# నీటిమీద దీపాలు

(కథలు)



రచన

ఇచ్ఛాపురపు జగన్నాథరావు

ప్రభాత్ పబ్లిషింగ్ హౌస్,
తెనాలి

# విషయసూచిక

D

ఈ సంపుటిలోని కథలు
తమ పత్రికలలో తొలిసారి ప్రకటించిన
స్వతంత్ర, ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక, భారతి
పత్రికల సంపాదకులకు రచయిత కృతజ్ఞుడు.

# 1



# రాగోదయం

ఉదయంనుంచీ కురుస్తోన్న వర్షం ఆగి, నీరసంగా ఎండ వచ్చింది. కిటికీలోంచి బయటికి చూస్తోన్న చంద్రశేఖరానికి చాలా సంతోషం అనిపించింది. ఈ ప్రయాణం ఈ చీకటిలో, తేమలో జరగడం తనకిష్టంలేదు. స్టేషను దగ్గర పడుతోంది తాను దిగాల్సింది. మరోగంట ఎండవుంటే సునాయాసంగా తాను రామాపురం చేరుకోవచ్చును.

అతని ఆలోచనల్ని గ్రహించినట్టు రైలు తన కొంచెం వేగాన్ని ఇంకా తగ్గించి ఆగడానికి సిద్ధం అయి, నెమ్మదిగా ఆగిపోయింది. తలుపు తీసుకొని అటూ ఇటూ చూశాడు చంద్రశేఖరం. తనకోసం ఎవరూ రాలేదు. పోర్టర్లు ఎవ్వరూ కనిపించలేదు.

తొందరగా దిగి, తన పెట్టె, బెడ్డింగు, చేతి సంచీ, క్రిందని పెట్టి మళ్లీ స్టేషనంతా కలియ జూశాడు చంద్ర శేఖరం. నిజానికి తనుచూసిన వాటిలో రామాపురం స్టేషను చాలా చిన్నది. తనుతప్ప ఎవరూ దిగినట్టు లేదు. మొత్తం పదిమందికన్న ప్లాట్‌ఫారమ్‌మీద లేనే లేరు. అంచాత తన కోసం రామం వచ్చినా, ఎవరినైనా పంపినా, వాళ్లూ తానూ కలుసుకునేందుకు ఈ కొద్దిక్షణాలు చాలును. తనకోసం ఎవ్వరూ రాలేదు.

కొంచెం ఆశ్చర్యపడ్డాడు శేఖర్. తన ఉత్తరమూ, టెలిగ్రామూ, కూడా రామానికి అందలేదా? తాను వారం ముందరే రాశాడే. మరి, తారీఖులూ, ట్రైన్లూ తప్పు రాశాడా?

లేదు. తాను డైరీలో నోట్‌చేసుకొని, ఈ రోజు 18వ తేదీ, శుక్రవారం అని రాశాడు.

"రామాపురం వెడతారా బాబూ?"

ఆలోచన ఆపి, అడిగిన అతనివేపు తిరిగి, "ఆ!" అన్నాడు శేఖరం.

కూలీ సామాను తీసుకుని గేటువైపు నడిచాడు. గార్డు విజిలు వేశాడు. గంటవిని ట్రైలు సాగిపోయింది.

గేటుదాటి బయటికి వచ్చేసరికి లోపలికన్నా నిశ్శబ్దంగా ఉంది. ఈ అయిదు మైళ్లూ ఎలాగవెళ్లాలో తనకి తెలీలేదు.

"బండిగావాలండి?"

కూలీయే మళ్లా అడిగాడు.

"ఆ. రామాపురం వెడుతుందా?"

"వెళ్లకేం బాబూ! ఇక్కడ నిలబడండి కేకవేసి వస్తాను."

స్టేషన్ వరండాలో సామానుపెట్టి అతను వెళ్లిపోయాడు. రైలు దూరంగా వెళ్లిపోయినట్టుంది. ఆ శబ్దమూ ఏమీ వినపడలేదు.

కొంచెం దూరాన్న బీడులో ముసలి గుర్రం మేస్తోంది. స్టేషన్ చుట్టూ పది పన్నెండు గుడిసెలుమాత్రం ఉన్నాయి. రైల్వేక్వార్టర్లు రెండూ గాక. మరో మైలు చిన్న చిన్న చెట్లు. అవతల కొండలు.

వాటి అవతల రామాపురం ఉంది కొండవాలులో. దానిలో తన మిత్రుడు రామనాథం — 'రామం' తనకి— ఉంటున్నాడు. దాని అవతల ఒక నది ఉంది. ఆచోట తనకి స్నేహం ఉంది. అక్కడ తనకి ఆరోగ్యం ఉంది. అలసిపోయిన మనసుకి శాంతి ఉంది.

కాని, అక్కడికి వెళ్లడం ఎలా?

బండికోసం వెళ్లినమనిషి తిరిగి వచ్చి, మరో అరగంటలోకాని బండివాడు దొరకడని చెప్పాడు.

గడియారం చూసుకున్నాడు శేఖరం. పావుతక్కువ మూడైంది. ఇక్కడనుంచి వాహనంమీద వెళ్ళాలంటే

ఆ ముసలి గుర్రాన్ని, బహుశా దానికన్నా పాతదైనబండినీ నమ్ముకోవాల్సి ఉంటుందని తెలుసును.

"రామాపురం ఎంత దూరమయ్యా ఇక్కణ్నించి?"

"రెండున్నర క్రోసు లుంటాది బాబూ."

"తిన్నగా దారేనా?"

"మధ్యలో బంగళాకి రోడ్డు కలుస్తాదండి ఈ కొండ దిగేక. దానవతల వంతెనా, దానవతలనించి తిన్నగా రోడ్డే నండి. జమీందారుగారింటికా బాబూ?"

సమాధానం ఇవ్వకుండా స్టేషన్ మాస్టర్ దగ్గరకి నడిచాడు శేఖర్.

ఆయనకు ఏభై ఏళ్లకు తక్కువ ఉండవు. శేఖర్ని చూస్తూనే, "కూర్చోండి బాబూ. జమీందారుగారి ఇంటికా?" అన్నాడు.

ఈ కొద్ది క్షణాల్లో ఈ ప్రశ్న వినడం రెండోసారి. ముఖం చిట్లించి, "ఆవూళ్లో జమీందారుగారు తప్ప ఇంకెవరూ లేరా?" అన్నాడు.

చేతిలోని కాగితాలు వదిలి, అతన్ని పరిశీలనగా చూస్తూ, "ఉన్నారు బాబూ. అక్కడ పది పన్నెండు కుటుంబాలు పెద్దవారివే ఉన్నాయి. అందులో రిటైర్డు ఆఫీసర్లూ, ధనవంతులూ, అందరూ ఉన్నారు. కాని, ఇవేళ కొంతశక్తి తగ్గినా జమీందారుగారు అందరికీ పూజ నీయులుకదా!" అన్నాడు.

అతని సిన్సియారిటీకి తనలో తనకే నవ్వు వచ్చింది. సంభాషణ మార్చి తను వచ్చినపని చెప్తూ, "నేను రామాపురం నడిచి వెడతాను. మీరు సామాను మీ గదిలో ఉంచండి. సాయంత్రం ఎవరినన్నా పంపుతాను." అన్నాడు శేఖర్.

"అలాగే బాబూ, కాని, మీకు అభ్యంతరం లేకపోతే ఓలాగ చెయ్యండి. మరో పావుగంటలో ప్యాసింజరు వస్తూంది. దాన్లో ప్రొఫెసరుగారు—ప్రొఫెసరు రామస్వామి మీకు తెలుసునా? — వస్తారు. ఆయనతో మీరూ వెళ్లవచ్చు. ఆయనకోసం జమీందారుగారి టాంగా వస్తుంది."

ముక్కూ మొహమూ తెలియని ఎవరినో సహాయం అడగడం కానీ, అంగీకరించడం గానీ నచ్చలేదు శేఖర్‌కి. వాళ్ళకోసం తను వెయిట్ చేసి అడగడం ఆలోచనల్లోనే బాగులేదు.

"వద్దు మాస్టారూ, నేను నడిచి వెడతాను. దయచేసి సామాన్లువుంచి నేను మనిషిని పంపేక పంపండి," అన్నాడు వెంటనే శేఖర్.

"సరేబాబూ," అన్నాడు స్టేషన్ మాస్టరు.

♦ ♦ ♦

"రామాపురం ఫారెస్టు బంగళా ఆరు ఫర్లాంగులు."

ఆరడుగుల వెడల్పు రోడ్డు నించి రెండడుగుల ఎత్తుగా పెరిగిన గడ్డిలోకి చీల్చుకుని వెళ్ళిపోయింది. రామాపురం దారి పట్టేడు.

బహుశా రెండు మైళ్లు ఒచ్చివుంటాడు. నడక సాగించాడు.

ఆ ప్రశాంతతలో, అరణ్యపు అంతరంగాల నిశ్శబ్దతలో, ఏదో ఆనందంలో తేలిపోతూన్నట్లుంది శేఖర్‌కి. ఎన్నాళ్లైందో తనతో తానంత దగ్గరగా ఒచ్చి!

మళ్లీ, నాలుగేళ్ల తరువాత రామాన్ని చూడ్డం మిలటరీలోనించి ఇద్దరూ డిశ్చార్జీఅయ్యాక ఇదే కలుసుకోవడం. సంతృప్తిగా, ఆనందంగా కొన్ని రోజులు గడపడం, తన సంసారం తనకి ఇచ్చిన హాలాహలాన్ని క్షణమాత్రమైనా వెలిగ్రక్కడం. తనకి పేర్లు తెలీని ఏదో పక్షులు తియ్యగా వింతగా అరుస్తున్నాయి. తను ఎన్నడూ చూడని చెట్లూ మొవ్వలు, పువ్వులూ రోడ్డుకి ఇటూ అటూ ఎంతో చక్కగా కనిపిస్తున్నాయి.

వీటన్నిటి మధ్యా, తన ఆనందతరంగాలని చీల్చుకుంటూ ఒక్కటే ప్రశ్న వస్తూన్నది. రామం తనని చూడడానికెందుకు రాలేదు? స్టేషన్‌లో ఎవరూ తననెందుకు కలుసుకోలేదు?

వెయ్యి జవాబులు తనకి నచ్చినవి ఒస్తున్నాయి. అవన్నీ అర్థవిహీనాలని తనకి తెలుసును. అతని ఉత్తరాలలో రామం తనని ఎంత ఆతృతగా ఆహ్వా

నిస్తున్నాడో, ఎంతగా తన రాకని వాంఛిస్తున్నాడో తెలుస్తూనే ఉంది తనకి. ఇవేళ తాను నెల రోజుల సెలవులో ఇక్కడికి రావడం, తన భార్యనించీ, తన ఉద్యోగం నించీ, తన అనారోగ్యం నించీ తాత్కాలికంగానైనా విశ్రాంతిని ఆశించడం—— అన్నీ అతని నమ్మకతోనే, రామంమీద ప్రశ్నలకి తావులేని తన నమ్మకతోనే.

తాను ఇవేళ స్టేషన్‌లో రామంని ఎందుకు చూడ లేదనేదాని కివన్నీ సమాధానాలు కావని శేఖర్‌కి తెలుసును. కాని... కాని...

నెమ్మదిగా నడుస్తున్న వాడల్లా త్వరగా నడవడం సాగించాడు. స్లో మార్చి..క్విక్ మార్చి... కాని శేఖరానికి ఈ మధ్య అలవాటులేక ఇంతశ్రమా మరొక మైలు వెళ్లేసరికి అతన్ని నిశ్శక్తుడుగా చేసింది. బ్రిడ్జి దాటి దూరాన రామా పురం కనిపిస్తూంటే సెలయేరు ప్రక్కన కూర్చున్నాడు శేఖర్.

కొంచెం స్థిమిత పడి, సిగరెట్ తీసి వెలిగించాడు. ఇంకో అరగంటలో తాను రామాన్నే అడుగుతాడు ఎందు కిలాగ జరిగిందని. ఈలోపున ఇన్ని ఆలోచన లెందుకనీ?

ఎంతో ప్రశాంతంగా ఉన్న పరిసరాలలో సెలయేటి పోకడ చిత్రమైన మధుర ధ్వని గలుగజేస్తూంది. కిందని గడ్డి తడి తడిగా ఉంది. ఇంతసేపూ కాస్తూన్న ఎండ మళ్లీ పలుచ బడుతోంది. మేఘాలు కమ్ముకుంటున్నాయి.

గాలిలేని ఆ వాతావరణంలో సిగరెట్ పొగ సూటిగా ఆకాశంలోకి వెళ్లిపోతోంది. నల్లటి మేఘాలకూ తెల్లటి సిగరెట్ పొగకూ ఎంత దగ్గర! ఇంత సుఖం సిగరెట్‌లో ఉందని అతననుకోలేదు.

పది పన్నెండు నిముషాలు సెలయేటి ప్రవాహాన్ని చూస్తూ అలాగే కూర్చున్నాడు శేఖర్. సిగరెట్ అయిపోయింది. ఆలోచనలు రామం నుంచి తన భార్యమీదికీ, ఆమె నించి తన నెర్వ్సమీదికీ, అక్కడి నించి రామం మీదికీ పరుగులు పెడుతున్నాయి.

ఆకాశం మేఘాలతో నిండిపోయింది. సూర్యకాంతి పూర్తిగా మాయమయింది. ఒకసారి చల్లటి గాలి వచ్చి చిన్న జల్లు పడింది. తరువాత చినుకులు ఆగకుండా పడసాగాయి.

కొంచెంసేపు చెట్టుకింద నిలబడి చినుకుల్లోనే ప్రయాణం సాగించాడు శేఖర్. ప్రతి జలకణమూ సూది మల్లే గుచ్చుకుంటూంది ఒంటికి. కాని అతను ఆగ దలచుకోలేదు. మరొక ఇరవైనిముషాలలో రామాపురం చేరుకోవచ్చు. రామం ఇంట్లో బట్టలు మార్చుకోవచ్చు.

తనకి తెలీకుండానే, టాంగా స్టేషన్‌నించి వస్తూ శేఖర్‌నిదాటి తరువాత ఆగింది. సుమారు అరవైయేళ్ల వృద్ధుడూ, పాతికేళ్ళ యువతీ వెనకాల కూర్చున్నారు.

"అయ్యోపాపం తడిశారా!"

వృద్ధుడు దిగివచ్చి శేఖర్ చెయ్యి తీసుకుని "నాపేరు రామస్వామి. అన్నామలై యూనివర్సిటీ రిటైర్డ్ ప్రొఫెసర్‌ని. ఈమె నా నీస్ మనోరమ. ఇవాళ మదరాసునించి ఒస్తున్నాము," అన్నాడు. ఆయనతో కరచాలనంచేసి ఆమెకి నమస్కరిస్తూ "నాపేరు శేఖర్, మీ సహాయానికి కృతజ్ఞత" అని, శేఖర్ టాంగాలో ప్రొఫెసర్ ప్రక్కన కూర్చున్నాడు. టాంగా కదిలింది.

"బాగా తడిశేసు శేఖర్. మీ సామాను ఒచ్చే సరికి ఆలస్యం అవుతుంది. స్టేషన్‌మాష్టరు చెప్పాడు మీరు వెళ్లారని. ఇవేళ మిమ్మల్ని కలవలేకపోయాం." అన్నాడు ప్రొఫెసర్.

"బాధ లేదండీ. కొంచెం సేపుకి బాధలేదు," అన్నాడు శేఖర్.

టాంగా నెమ్మదిగా సాగి వెడుతోంది. చినుకుల్లో కాళ్లు తడుస్తున్నాయ్ శేఖర్‌కీ, ప్రొఫెసర్‌కీ, మనోరమకీ. ఆయన ఏదో మాట్లాడేస్తూన్నాడు.

టాంగా వూరు ప్రవేశిస్తూండగా మనోరమ శేఖర్ వైపు తిరిగి, "మీరు ఎక్కడికి వెడతారు?" అని అడిగింది.

"రామనాథంగారి ఇంటికి."

ప్రొఫెసర్ రామస్వామి అందుకుని, "అవును—ఆయన ఆథర్ కాదూ? నాకు బాగా తెలుసును. ఆయన ఇల్లు వీధి చివరన ఉంది. ఇల్లు అవతల అడివీ, దాని అవతల నదీని. మీరు ఆయనకోసం వచ్చారా?" అన్నాడు.

"ఆ. ఆయన నా మిత్రుడు."

"వెరీగుడ్. క్రిందటి నెలలో ఆయన మొదటి సారిగా ఏదో చారిత్రిక నవల రాయడానికని మేటర్ వెతుకుతూ నాదగ్గరకి వచ్చాడు. చాలాసేపు మాట్లాడేం. గజినీ పిరియడ్ మీద చాలా ఇంటరెస్టు."

తమ ఇంటిదగ్గర ప్రొఫెసర్‌గారూ, మనోరమా దిగి పోయాక, టాంగామీద శేఖర్‌ని దిగబెడతానన్నా, అతను వద్దని బయలుదేరుతూ ఆయన దగ్గర సెలవు తీసుకున్నాడు. వెనువెంటనే రామస్వామి లోపలికి వెళ్లిపోయాడు. మనోరమ అతని దగ్గర సెలవు తీసుకుని, హఠాత్తుగా, "మరోసారి నన్ను కలుసుకుంటారా?" అన్నది.

క్షణమాత్రం ఆమె కోరిక విచిత్రంగా కనిపించినా, మిత్రుణ్ణి కలుసుకొనే ఉత్సుకతలో "తప్పకుండానూ!" అని, రామనాథంఇంటివేపు సాగిపోయాడు.

మీదని మేఘాలు చాలా దట్టంగా పట్టిఉన్నాయ్. దూరాన గాలిహోరు ఉండీ ఉండీ జడిపిస్తోన్నట్లు ఎక్కువవుతోంది. చీకటి పడిపోయింది. ఒంట్లోనించి చలి కొరుకుతోంది.

అతను తొందరగా అడుగులువేసి, రామస్వామి చెప్పిన గుర్తులతో రామనాథంఇంటిని గుర్తించాడు. గేటుప్రక్క స్తంభం మీద స్పష్టంగా 'మధుకుంజ' అనిచూసి, లోపలికి నడిచాడు చలిలో ముడిచిపెట్టుకుపోతున్న శేఖరం.

◆ ◆ ◆ ◆

వరండామీద నిలబడి లోపలికి చూశాడు శేఖర్. పెద్దహాలూ, మీదికి మెట్లూ కనిపించాయి. మీద నెక్కడో దీపం వెలుగుతోంది. మరేసంచారమూ, సవ్వడీ అతనికి కనిపించలేదు.

ఇది రామనాథం ఇల్లేనా, తిన్నగా లోపలికి వెళ్ళలేక పోయాడు శేఖర్. నెమ్మదిగా కాల్ బెల్ నొక్కాడు.

బయట వర్షపు జల్లు హోరు, దూరాన సముద్రపు హోరుతో కలిసిపోయి, బెల్లు వినిపించలేదు శేఖర్‌కి. వరండామీద వర్షం పడుతోంది. ద్వారంలో నిలబడ్డాడు శేఖర్ వర్షంలోకి చూస్తూ.

"ఎవరు కావాలండీ?"

అప్పుడే నిద్రపోయి లేచిన గొంతుకతో స్త్రీకంఠం ప్రశ్నించింది. వెనుకదిరిగి చూసిన శేఖర్‌కి తన భావన నిజమేననిపించింది — ఆమె నలిగినబట్టలూ, చెదిరిపోయిన జుత్తూ, ఎర్రటి కళ్లూ చూసి.

నెమ్మదిగా, "రామం ఉన్నాడా?" అన్నాడు శేఖర్.

ఆమె తెల్లబోయి చూసింది. ఆ సగం చీకటి లోనూ ఆమె ముఖం పాలిపోవడం చూశాడు శేఖర్. నీరసంగా రెండడుగులు వెనక్కివేసి సోఫాలో కూలబడి "మీరు..." అంది ఆమె.

"నాపేరు శేఖర్... అతను ఇంట్లోలేడా?"

"లేరండీ, లేరు. ఇంట్లోనూ, మరెక్కడా లేరు."

మాటలుపూర్తి అయేలోగా ఆమె దుఃఖం ఆపుకోలేక పోయింది.

ఆమె భావన పూర్తిగా అర్థంకానట్లుగా వెర్రిగా చూశాడు శేఖర్—"మీరంటున్నది..."

ఉదయంనుంచీ మొదటిసారిగా ఒక మెరుపు మెరిసింది. అతనికి అర్థం ఐంది.

"భగవాన్!"

తలుపుకి జేరబడి పోయ్యాడు. బయట ఆకాశంనించి పందాలు వేసుకుని ప్రకృతి భీభత్సం చేస్తూంది. లోపల మసక చీకటి క్రమంగా చిక్కబడి పోతూంది. ఆమె అలాగే సోఫాలో రెండు చేతుల్లోనూ తల దాచుకుని కూర్చుంది. అతను గోడ మీద సొమ్మసిలినట్లు అలాగే జేరబడి ఉండిపోయాడు. పదేపదే అతని కనిపించింది "ఇదంతా వాస్తవమా? కలా?" అని.

కాని ఆ ఇల్లూ, రామాపురమూ, ఆమె, బయట వర్షపు భీభత్సమూ, జరుగుతోన్నది కల అనే భ్రాంతినిగానీ, ఆశనిగానీ అట్టేకాలం నిలవనివ్వలేదు.

ఇదంతా నిజం. భరింపలేని నిజం.

# 2

పది, పదిహేను నిమిషాలలాగే గడిచి పోయాయి. గదిలో చీకటి. బయటి రొద. ఇద్దరి మనస్సుల్లోనూ చెప్ప లేని ఆవేదన.

"శ్యామలా!"

మెట్లమీద నిలబడి అప్పుడే లేచి కిందకి దిగిన పార్వతి పిలిచింది. ఆమెకి ఇక్కడ ఏంజరుగుతుందో బోధపడలేదు.

జవాబురాక పార్వతి స్విచ్‌బోర్డు దగ్గరకి వెళ్లి లైట్లు వేసింది. రెండు ట్యూబ్‌లైట్ల కాంతిలో కళ్లు మిరుమిట్లు కమ్మాక ఆమెకి శేఖర్ కనిపించాడు. కాంతిలో అతనికీ తెలివి ఒచ్చి నెమ్మదిగా వెళ్లి సోఫాలో కూర్చున్నాడు.

శ్యామల కళ్లు తుడుచుకుని, "ఇవేళ ఆరో రోజు... ఐదారుగంటల విపరీత జ్వరం తర్వాత ఆయన కళ్లుమూశారు. పార్వతి మా చెల్లెలు. నా టెలిగ్రాం చూసి ఒచ్చింది." అన్నది.

"టెలిగ్రామూ, ఉత్తరమూ వార్తేరునుంచి రాసింది మీరేనా?" అంది పార్వతి.

"ఆఁ" అన్నాడు శేఖర్.

"మీ అడ్రస్ దొరకలేదు. రాద్దా మనుకున్నాము. అరే! తడిసివచ్చారా?" అంది పార్వతి.

ఆమెకి పదిహేడు పద్దెనిమిది ఏళ్లకన్న ఉండవు. ఆమెకన్న ఎనిమిది, పది ఏళ్లు పెద్ద శ్యామల. రామం మిలటరీనుంచి తిరిగి ఒచ్చాకనే ఆమెని వివాహం చేసుకున్నాడు. అప్పటికి తాను కొత్తగా ఉద్యోగంలో చేరి ఉండడంవలన రాలేకపోయాడు.

"ఫరవాలేదమ్మా. దారిలో వర్షం రావడాన్న కొంచెం తడిశాను. ఇదంతా చూశాక ఇంక ఈ బాధ తెలీదు." అన్నాడు శేఖర్.

మరో రెండు నిమిషాలట్లానే నిశ్శబ్దంగా గడిచి పోయాయి.

పార్వతి ఒక్కసారి లేచి నిలబడి "సారీ శేఖర్‌గారూ, టీ తెస్తాను. మీసామాన్లేవీ?" అన్నది.

"ఏమీ ఒద్దు పార్వతీ—రాత్రి నేను తిరిగి వెడతాను మీరు కూర్చోండి," అన్నాడు.

పార్వతి "ఏమీ" అనేలోపున శ్యామల "మీ ఇద్దరి స్నేహమూ నాకు బాగా తెలుసును శేఖర్‌గారూ! ఆయన ఇవేళ ఇక్కడ లేకపోయినా, మీరీ వర్షంలో తిరిగి వెళ్లడం అనుకోని మాట. వెళ్లమ్మా పార్వతీ. ముందు టీ తెచ్చి త్వరగా వంట చెయ్యమని ఆవిడకి చెప్పు," అన్నది.

పార్వతి వీధి తలుపులు దగ్గరగా నెట్టి వెళ్లింది. హటాత్తుగా తగిలిన ఈఘాతంనుంచి యింకా తేరుకోని శేఖర్ సిగరెట్‌కేసూ, లైటరూ తీసుకుని, "సిగరెట్ కాల్చుకునేదా?" అన్నాడు.

శ్యామల అంగీకారంగా తల వూపింది.

సిగరెట్ వెలిగించుకుని శేఖర్ తిరిగి ఆలోచనలో పడ్డాడు. చిటగాంగులోనూ, తరవాత విశాఖపట్నంలోనూ, రామమూ తానూ ఎన్నో నెలలు కలిసి గడిపేరు. ఎన్నో చోట్లకి కలిసి వెళ్లేరు. ఇవాళ ఉదయందాకా అతన్ని కలుసుకునే తన కౌతుకం ఇంత హటాత్తుగా ఇలాగ మారి పోయింది. రామం లేడు, ఎక్కడా లేడు.

ఎంతో ఒంటరి అనిపించింది తనకి. ఎదురుగా శ్యామల అలాగే కూర్చుంది. ఆమెమాట ఏమిటని?

తానీ రాత్రిక్కడ గడపగలడా ? శ్యామల? పరిస్థితు లెలాగ ఉన్నాయి ? తానేం చెయ్యాలి ?

ఏం ఆలోచిస్తూంది శ్యామల? ఈ ఇంట్లో మరెవ్వరూ లేరేం?

తలలో ముసురుకుంటున్నాయి వెయ్యి ఆలోచనలు. దుఃఖమూర్తిలాగా పేనుకుపోయి కూర్చున్న శ్యామలని చూస్తూంటే ప్రశ్నలు ఎక్కువవుతున్నాయి.

నిశ్శబ్దంగానే సిగరెట్ కాల్చడం ముగించి, లేచివెళ్లి తలుపుతీసి బయట పడవేసి ఒచ్చాడు శేఖర్. ఇంతలోనే శ్యామల ట్రేలో టీ, కొన్ని బిస్కట్లూ తెచ్చింది. ఒక్క నిముషం తరవాత ఆమె మూడు కప్పుల్లో టీ కలిపి ముగ్గురి ముందూ పెట్టింది.

"తీసుకోండి శేఖర్." అంది శ్యామల. కాని ఆమె తన కప్పు తీసుకోడానికేమీ ప్రయత్నించే సూచన కనపడక "మీరు తీసుకుంటే..." అన్నాడు శేఖర్.

పార్వతి పట్టిపట్టి చూస్తోంది ఆమెని, మధ్యన అతన్ని క్షణమాత్రం పరికిస్తూ.

తల వంచుకుని కొద్దిక్షణాలు వూరుకుని, మాట్లాడకుండానే శ్యామల కప్పు తీసుకుంది. ముగ్గురూ టీ త్రాగసాగారు.

చల్లగా, తడిగాఉన్న ఒంటిమీద టీ త్రాగుతూంటే కొంతవరకు ఉపశమనం ఐంది శేఖర్‌కి. మధ్యన తలఎత్తి అతను శ్యామలముఖంలోకి చూశాడు. ఉదయం పువ్వులనుంచి మంచుబిందువుల్లాగ కన్నీటి బిందువులు నెమ్మదిగా ఆమె చెక్కిళ్లమీదికి జారుతున్నాయ్.

సగం టీ తాగి, హటాత్తుగా లేచి శ్యామల మీదికి వెళ్లిపోయింది. శేఖర్ తెల్లబోయి నిలబడ్డాడు.

"కూర్చోండి. ఆయన పోయాక మంచినీళ్లు తప్ప తాగలేదు అక్క. సద్దుకునేదాకా కొంత..."

ఆలోచనగా సిగరెట్ వెలిగించాడు శేఖర్. పైన వర్షం తగ్గింది. గడియారంలో ఆరవుతోంది.

శ్యామలతో ఏం చెయ్యడం?

◆ ◆ ◆

ప్రొఫెసర్ రామస్వామి తను మద్రాసు వెళ్ళిపోయాక తనకు వచ్చిన ఉత్తరాలన్నిటినీ చదువుకుని, మనోరమ తెచ్చిన టీ తాగి, సావకాశంగా కూర్చుని, "ఏం వర్షం పడుతోంది! ఏమి చేస్తున్నావు మనూ? ఓ మనూ!" అని పిలిచాడు.

తన గది సిద్ధం చేసుకొంటూన్న మనూ ఆయన గది లోకి వచ్చి, "ఏం మామయ్యా?" అంది.

"వర్షం చాలా పడిపోయిందమ్మా. ఇంక తగ్గుతోంది," అన్నాడు రామస్వామి.

"అవును మామయ్యా!" అంది మను.

"అది సరేగాని మనతో ఇందాకా ఒచ్చాడే, శేఖర్ కదూ? అతన్ని ఎక్కడో చూసిన గుర్తు ఉందమ్మా. జ్ఞాపకం రాకుండా వుంది."

క్షణమాత్రం నివ్వెరపోయి నిలబడింది మనూ. ఏదో అస్పష్టమైన అనుమానం ఆమెని సాయంత్రంనుంచీ ఆవరించి, ఆయన మాటలతో స్పష్టమైన ఆకారం దాల్చసాగింది.

"నాకూ అలాగే అనిపిస్తోంది మామయ్యా. సాయంత్రంనించీ ఆలోచిస్తున్నాను. ఆఁ, మదరాసులో ఒకనాడు శకుంతలగారి ఇంటికి వెళ్లాం జ్ఞాపకం ఉందా మామయ్యా?"

"ఆఁ"

"వాళ్ల డ్రాయింగు రూమ్‌లో ఒక పోటీ ఫోటో చూశాం. అది ఈయనది కాదూ?"

గట్టిగా కళ్లు మూసుకుని ఆలోచించి, "అలాగే అనుకుంటానమ్మా. మరి..."

"శకుంతలగారి అమ్మాయి నీకు తెలుసుగా రాజేశ్వరి — ఆవిడ సంసారంలో ఏవో చికాకులువచ్చి ఇంటికి వచ్చేసింది సంవత్సరం క్రిందట. బహుశా ఈయన..."

"కావచ్చు మనూ, కాకనూ పోవచ్చు. చూద్దాం కానీ, స్టేషనుకి బండి వెళ్లిందా? మన సామాన్లూ, శేఖర్‌వీ తెచ్చేందుకు?"

"వెళ్ళింది."

ఆలోచించుకుంటూ మనూ తన గదిలోకి వెళ్ళిపోయింది. రాజేశ్వరి భర్తకి విడాకు లిచ్చినట్లు తాను వినిన జ్ఞాపకం. లేక మరేవో కలతలో — ఏమైనా, అతన్ని మరోసారి కలుసుకుని మాట్లాడితే, రాజేశ్వరికి తానేమైనా ఉపకారం చెయ్యగలిగితే...

బయట వర్షం పూర్తిగా తగ్గిపోయింది. ఆకు కావస్తూంది. ఏదో మేగజైన్ తీసుకుని కుర్చీలో కూర్చుంది మనూ.

బయటనించి టాంగా మనిషి పిలిచి, సామాన్లన్నీ తెచ్చానని చెప్పేడు. తమ సామాన్లన్నీ లోపల పెట్టేక, శేఖర్ సామాన్లు రామనాథంగారి ఇంటికి పట్టికెళ్లమని చెప్పింది మనూ.

"ఆయన క్రిందటి వారం పోయారమ్మా! మీకు తెలుసునా?" అన్నాడు టాంగామనిషి గోపన్న.

ఆశ్చర్యపడి, "రామనాథంగారే!" అన్నది మనూ.

"అవునమ్మా. మీకు తెలీదా?" అన్నాడు గోపన్న.

ఏమిటో చాలా విచిత్రంగా అనిపించింది. శేఖర్ ఆ మాట ఏమీ చెప్పలేదే! సాయంత్రం ఆయన చాలా ఉత్సాహంగా కూడా ఉన్నాడు. ఏమిటి ఈ రహస్యం?

"సామాను ఆయనకి ఒప్పజెప్పిరా గోపన్నా. బహుశా ఆయన అక్కడే ఆగుతారనుకుంటాను" అంది మనూ.

"అలాగేనమ్మా," అని వెళ్ళబోయి ఆగి, మరి ఈసారి చాలా చిక్కిపోయారేమమ్మా? పరీక్షలు బాగా రాశారా?" అన్నాడు గోపన్న.

"బాగానే రాశాను గోపన్నా. రిజల్ట్సు వస్తాయి. మరి నువ్వు బాగున్నావా?"

బాగానే ఉన్నానమ్మా... మరి శేఖర్ బాబుగారు ఎవరమ్మా? మీకు తెలుసా?"

"తెలీదు గోపన్నా. సాయంత్రం స్టేషనునించి వస్తూంటే, ఆయన నడుస్తున్నారని బండిలో తీసుకొచ్చాం. బహుశా రామనాథంగారికి చుట్టాలై ఉంటారు."

గోపన్న టాంగా తీసుకుని 'మధుకుంజు'కి వెళ్ళి శేఖర్‌ని కలుసుకుని, "సామాను నిక్కడ పెట్టమంటారా బాబూ?" అన్నాడు.

ఈరాత్రి తానిక్కడ ఆగాలని శేఖర్ ఇంకా నిశ్చయించలేదు. ఈ చీకట్లోని దుఃఖం తనని ఆ ఇంటికి కట్టిపెడుతోంది. ఆ దుఃఖంలోని మనుషులు తను అక్కడ ఉండటం మంచిది కాదనిపిస్తున్నారు.

"లోపల పెట్టు," అని పార్వతి తనవంతు నిశ్చయానికి వచ్చింది. గోపన్న సామాన్లు పెట్టేక జేబులోనించి ఒక రూపాయి తీసి ఇచ్చాడు శేఖర్.

"రామస్వామిగారు పూర్తిగా ఇచ్చేశారు బాబూ. మీరు వేరే ఇవ్వక్కరలేదు," అన్నాడు గోపన్న.

"ఫరవాలేదు, తీసికో."

రూపాయి జాగ్రత్తగా మడిచి చేతిలో ఉంచుకుని "గదిలో పరిచి వెళ్ళిపోతాను బాబూ. పదేళ్ళ క్రిందట అలవాటే—పెద్ద దొరగారి దగ్గర. ముసిలినై పోయాక టాంగా పెట్టుకున్నాను."

జవాబుకి ఎదురు చూడకుండానే, పార్వతిగారూ గది చూపమని గోపన్న సామాన్లు విప్పి పెట్టేశాడు. పార్వతి వెళ్ళాక శేఖర్ తన గదిలోకి వెళ్ళేడు.

"తమరిక్కడకిదేనా అండీ మొదట రావడం?"

సగం తడిసిన కోటు తీసేస్తూ, "అవునయ్యా... నీ పేరో?" అన్నాడు శేఖర్.

చెప్పి, "పాపం! బంగారులాటి మనిషి పోయారు బాబూ! రామనాథంగారంటే దేవుడిలాటి వారు. వారిని ఎప్పుడూ మరిచిపోము... పాపం! అమ్మగారికే గొప్ప కష్టం!" అన్నాడు గోపన్న.

వింటున్నాడు శేఖర్. ఈ మధ్య ఇక్కడ జరిగినది తనకేమీ తెలీదు — అప్పుడప్పుడూ రామం తన ఉత్తరాల్లో రాసేది తప్ప.

"వారు బ్రతికుండగా ఏవో కలతలు వచ్చినా, మొత్తం మీద బంగారులాటి మనుషులు. ఆపాటివి ఏ సంసారంలో ఉండవ్ గాని — బాబూ!"

తన సూటు, షర్టూ, హేంగర్సుకి తగిలించి, పైజామా బాత్ రూములో పెట్టి, హోల్డాల్ నించి పరుపు తీసి వేసి, చక్కగా అమిర్చి పెట్టాడు గోపన్న.

"తమరు సర్కారులో ఉన్నారండి?"

"ఆఁ."

పరధ్యానంగా అని గోపన్నకి సెలవిచ్చి ఈజీ చెయిరులో కూర్చున్నాడు శేఖర్. క్షణ క్షణానికీ ఇక్కడ జరుగుతూన్నది విచిత్రంగా అనిపిస్తోంది తనకు. గోపన్న ఏం చెప్పేడు? ఈ రోజు రామం గురించి ఏ చెడ్డమాటా విన

దల్చుకోలేదు తాను. తాను నమ్మనూలేదు. తన అంతరంగమూ సమ్మతించదు.

మంచం మీద పడుకుని, కళ్లుమూసుకున్నాడు శేఖర్. అంతా ఎంతో విచిత్రంగా ఉంది. రామం పోవడంకన్న ఘోరం తనకు జరగలేదు. అందులోను ఇక్కడకి వచ్చేదాకా ఆవార్త తెలియకపోవడం. కాని, తనకి ఇదంతా ఎంతో దూరంగా జరుగుతోన్నట్లు ఉంది. తనలో తనకే తెలియని ఒక స్వార్థంలో అస్పష్టమైన ఏదో రాక్షసభావంతో తన హృదయం కుదురుగా ఉండిపోయింది. రామం ఆనందాలతో తన ఆనందాలూ, అతని దుఃఖాల్లో తన కన్నీళ్లూ ఉన్నాయని తాననుకున్నాడు. కాని ఇవేళ అతని మరణవార్త విన్నాక వింతగా తన మానసిక జీవితం సుమారు అచంచలంగా ఉండిపోయింది...ఏం? రెండు సంవత్సరాల క్రిందట రాజేశ్వరి తనన్న మాటలు జ్ఞాపకం వచ్చాయి హఠాత్తుగా. "ఎందుకో మీరు మారిపోతున్నారు...క్రమంగా మీలో మనిషిపోయి ఒక రాక్షసుడు వస్తున్నాడు...మీహృదయం మాయమైపోతుంది," అని.

కొరడాతో కొట్టినట్లైంది శేఖర్ కి. లేచి కూర్చున్నాడు. ఒకసారి కెరటం విరిగి కొండ విరిగినట్లు అయింది. రాజేశ్వరి మాటలు నిజం అవుతున్నాయా? తనలో ఏం జరుగుతోంది? తనలోని మనిషి ఏం అయిపోయాడు?

బయట మళ్ళా జల్లు పడుతోంది. అతనికి చెమటపోసింది. గాలిలో అగరువత్తుల పరిమళం ఒస్తూంది.

ప్రయత్నించాడు, కాని ఏడుపురాలేదు.

రాత్రి చాల ఆలస్యం అయే వరకూ నిద్ర పట్టలేదు శేఖర్‌కి. శ్యామలా, పార్వతీ భోజనం చేశాక చాలాసేపు కూర్చున్నారు. ఎలాగో ఆ కొద్ది గంటల్లోనూ ఆమె చాలా మారినట్లు అనిపించింది శేఖర్‌కి. సాయంత్రం స్నానం చేసి నట్లుంది. సాయంత్రపు దుఃఖపు చీకట్లు ఊహామాత్రంగా ఉన్నా, ఆమె ముఖంలో దుఃఖంకన్నా ఆకర్షణ ఎక్కువ కని పిస్తూంది. ఆ విషయం గ్రహించిన శేఖర్, "ఎంత క్రిందికి దిగజారాను!" అనుకున్నాడు.

మాటల సందర్భంలో, "ఇంక ఈ వూరులో ఉండాలని ఎలాగా లేదు. బ్రతికి ఉన్నన్నాళ్లు ఆయన ప్రశాంతత కావాలని కోరుకుని ఈ బంగళా తీసుకున్నాను. మాకు భూముల మీద ఒచ్చే డబ్బూ, షేర్లమీద లాభాలూ, సరి పోయేవి. ఇంక ఇక్కడ ఉండే అవసరమూ లేదు. ఇక్కడ ఉండి నాకు సాయం చెయ్యడానికి ఎవ్వరూ లేరు," అన్నది శ్యామల.

"మీకు అవసరమైనదేదీ చెయ్యడానికి అభ్యంతరం లేదు. కాని, ఎవరైనా లాయరు చేతిలో పెడితే?"

"మాకు తెలిసిన లాయరుకి నాలుగు రోజుల క్రిందట రాశాను. ఆయనా రావాలి. ఇంకా ఉత్తరం రాలేదు. దయచేసి ఆయన ఒచ్చేదాకా మీరు ప్రయాణం కాకండి," అన్నది శ్యామల.

ఆమె ప్రార్థిస్తోన్నా, అనుజ్ఞ ఇస్తూన్నట్టే అంది. కాని, ఆ విషయం ఆలోచనల్లోకి రానీకుండా, "అలాగే" అన్నాడు శేఖర్.

"పార్వతి వాల్తేరులో బి. ఎస్‌సి. చదువుతోంది. పరీక్షకి వెళ్ళింది. దాని ఫ్యూచరు చూడాలి. ఇక్కణ్ణించి వెళ్ళిపోవాలి."

తనలో తాను మళ్ళీ అనుకుని, లేచి, ఏమీ చెప్పకుండానే బయటికి వెళ్ళిపోయింది శ్యామల. అప్పటిదాకా మాట్లాడకుండా కూర్చున్న పార్వతి అతనివైపు తిరిగి, సగం భయంతో, "ఆమెకి మెదడు సరిగా ఉందంటారా?" అన్నది.

"ఏం?"

"ఈ వారంలోనూ ఆమె చాలా చిత్రంగా ప్రవర్తించింది. ఇవేళదాకా ఆమె ఆ గదిలోనించి ఇవతలికి రాలేదు. మంచినీళ్లు తప్ప ఏమీ త్రాగలేదు. కాని, ఒక్కనాడూ ఏడ్వనూ లేదు ఈ సాయంత్రం కన్నీళ్లు తప్పితే."

"ఆమె చాలా షాక్ తిని ఉంటుంది."

"అవును. కాని, మరి ఇవేళ బట్టలు మార్చి అంతా ఏమి జరగనట్లే ఉంది. సాయంత్రం ఆయన గదిలోకి వెళ్ళి ఏవో కాగితాలన్నీ చించిపోసింది. ఇప్పుడు చూడండి."

"ఏమిటి?"

"మీతోనైనా చెప్పకుండా వెళ్ళిపోయింది అదీ కాక..."

"ఆఁ ?"

"రెండేళ్ళ నించి ఏవో కారణాలవల్ల పెట్టుకోని పెళ్ళి ఉంగరం ఈ సాయంత్రం పెట్టుకుంది. ఆమెని చూస్తేనే ఏదో విచిత్రంగా ఉంది."

"మరేమీలేదు. శ్యామలకి ఈ షాక్ మూలాన్న కొంత విచిత్రమైన ఫలితాలు కలుగవచ్చు. అంతకన్న ఏమీలేదు."

మరి కొంతసేపు కూర్చుని పార్వతి లేచివెళ్ళాక అతను తన గదిలోకి వెళ్ళాడు. పార్వతి ముఖంలో ఏదోభయం అతని ధైర్యవచనాలకి మాయం కాలేదు. ఆ సంగతి అతనికి తెలిసి మరీ చికాకు పడసాగాడు తన చుట్టూ ఏం జరుగుతోందో తనకి తెలీక.

గదిలోకి వెళ్ళి లైటు ఆర్పి పడుకున్నాడు. ఆకాశం నిండా మేఘాలు ఉండడాన్న మరీ చీకటిగా ఉంది బయట.

ఎన్నాళ్ళ క్రిందటనో రాజేశ్వరితో ఇంత చిక్కటి చీకట్లోనే తను కూర్చుని మాట్లాడడం జ్ఞాపకం ఒచ్చింది అతనికి. ఆమె కదలడం చూసి "ఇంకా నిద్రపోలేదా, రాజేశ్వరీ?" అన్నాడు తాను.

ఆమె లేచి కూర్చుని, "ఆఁ...లేదు. మీరు ఇప్పుడే వచ్చారా? భోజనం చేశారా?" అన్నది.

"చేశాను. సాయంత్రం బ్రిడ్జి ఆడుతూ కూర్చుని, అక్కడే డిన్నర్ ఇచ్చారు — తిన్నాను. నువ్వు తినలేదా?"

"తిన్నాను. పడుకోండి."

ఆమె తనమీద ఆరోపించేందుకు నేరం ఉన్నా ఆరోపించలేదు. కాని, అంతకన్న క్రూరంగా, లేచివెళ్ళి ఈజీ చెయిర్‌లో కూర్చుంది. తను చేసినది పొరపాటని తనకి తెల్సును. ఈ మధ్య తరుచూ ఇట్లాగ జరుగుతోందనీ తనకి తెల్సును. ఆమె తప్పక ఏదో అంటుంది. తాను తప్పు ఒప్పుకోవచ్చు అనుకున్నాడు. కాని...

ఆ రోజూ ఇలాగే చీకటి. ఆ చీకట్లో తన సిగరెట్ ఎర్రటి కాంతి. తెల్లగా పొగ...

అప్రయత్నంగా సిగరెట్ తీసుకుని వెలిగించాడు శేఖర్. ఎండిపోయిన గొంతుకమీద చల్లగా, హాయిగా ఉంది.

తన కానాడు తెలియలేదుగానీ, ఆనాడే తనకీ రాజేశ్వరికీ మధ్య ఎంతో దూరం రావటం ప్రారంభించింది. మిలిటరీ నుంచి వచ్చాక తనకి మొదటి సమస్య ఉద్యోగం. ప్రభుత్వం ధర్మమా అని పీస్‌టైమ్ ఎస్టాబ్లిష్‌మెంటులో తనని తీసుకున్నారు. అప్పుడే రాజేశ్వరితో పరిచయం. చాలా సాధారణంగా...చాలా...

ఆ రోజున తనూ, ఆమె, ఏదో కంపెనీ–ఇవాళ దాని పేరుకూడా అతనికి జ్ఞాపకం లేదు. సెక్రటరీ ఉద్యోగానికని ఇంటర్వ్యూకి వెళ్లేరు మరో పాతికమందితో. ముందు తన యింటర్వ్యూ అయిపోయి, తాను యివతలకు వచ్చి సిగరెట్

కాల్చుకుంటూ పేవ్‌మెంటుమీద నిలబడ్డాడు. ఆ ఉద్యోగం తనది కాదని ఖచ్చితంగా తెలిశాక యింక బాధ ఏమీ అనిపించలేదు.

హొంటులోకెడుకు పోతే అక్కడ కాఫీ తాగి తన హోటలుకి ట్రిప్లికేనుదాకా నడిచి వెళ్ళవచ్చునని ట్రాన్సుపోర్టుకోసం చూస్తూ నిలబడ్డాడు. పది పదిహేను నిముషముల తరువాతకూడా ఆటోరిక్షాగానీ, టాక్సీగానీ రాలేదు.

రెండో సిగరెట్ తాను వెలిగించుకోపోతుంటే ఆమెకూడావచ్చి తన కనతల కొంచెం దూరంలో పేవ్‌మెంటు మీద నిలబడింది.

ఆమె ముఖంమీద చిరునవ్వు నాట్యం చేయటం చూచి అదృష్టవంతురాలు, ఈమెను సెలక్టు చేసి వుంటారు_ అనుకున్నాడు తాను. చూసేందుకు బాగుంది స్మార్ట్‌గా, అనుకున్నాడు. కానీ మాటాడలేదు.

ఇంతలో బేబీటాక్సీ ఒకటి రావడమూ, అనుమానిస్తూనే తాను దాన్ని స్టాప్ చెయ్యడమూ, అది తనకూ, ఆమెకూ మధ్య ఆగడమూ జరిగింది.

ఆమెకూడా టాక్సీని పిలిచింది తానెలాగో పోటీకి వెడతాడని.

టాక్సీ ఆగినా ఆమె వెళ్ళకపోవడం చూచి, "మీరు తీసుకోండి నేను వెయిట్ చేస్తాను," అన్నాడు తాను.

ఆమె నవ్వుతూ, "నాకన్నా ముందరనుంచి చూస్తున్నారుగా! మీరు వెళ్ళండి. లేకపోతే ఇద్దరం షేర్ చేద్దాం," అంది. అతను సంతోషంగా అంగీకరించాడు.

ఇద్దరూ ఎక్కి కూర్చున్నాక, "మీరు ఇంటర్వ్యూలో బాగా ఫేర్ చేశారా?" అన్నాడు తాను.

ఆమె నవ్వుతూ, "లేదండీ. ముందర అసలు మాటా మంతీ లేకుండానే నేను కరెక్టు కాండిడేట్‌నికాదని తేలిపోయింది. ఎవరో మిస్. మర్చంట్ కోసం వాళ్లుచూస్తున్నారు."

ఆ మాటా ఈ మాటల్లో అతన్ని గురించి ఆమెకీ, ఆమెను గురించి అతనికీ తెలిసింది. మైలాపూర్‌లో ఆమెను వదలి తను హోటలుకు వెళ్ళిపోదామని అనుకున్నాడు తాను. కానీ ఆమె దిగి హటాత్తుగా "దిగిరారూ! మా యింట్లో భోజనం చేద్దురుగాని," అన్నది.

కాలుస్తూన్న సిగరెట్ ఐపోవచ్చింది. ఆ రోజుల్లో ఎంతో అందంగా ఉండేది తనకు రాజేశ్వరి. మొదట కలుసుకున్న మూడు నెలలలోనే తమ వివాహం అయిపోయి వాళ్లేరు వచ్చేశారు. ఆ రోజులు మళ్ళీ ఎలాగు వస్తాయి? ఆ రాజేశ్వరి మళ్ళా . . .

♦ ♦ ♦ ♦

"శేఖర్‌గారూ! శేఖర్ !!"

మగతనిద్రలో లేచి, "ఎవరూ?" అన్నాడు.

"శేఖర్! అక్క కనిపించటం లేదు."

గది కాంతితో నిండిపోయింది. అతనికి ఒక్కసారి చిందర వందరగా సంవత్సరాలలోనుంచి కలిసిపోయిన ఆలోచనల్లోంచి తెలివి వచ్చింది.

"అక్క... లేచిచూస్తే మంచంమీద లేదు. ఇంట్లో ఎక్కడా లేదు."

పార్వతి ముఖంనిండా చెమట పోసింది. అతను లేచి "గాభరా వద్దు పార్వతీ! మరొకమారు చూసి అన్ని చోట్లకూ వెడదాం," అన్నాడు.

తొందరగా యిద్దరూ యిల్లంతా వెదికారు. ఆమె ఎక్కడా లేదు. గేటు తీసుకుని బయటకు వచ్చి త్వరగా నది వేపు నడిచారు. ఎవరూ మాట్లాడకపోయినా, యిద్దరకూ ఆలోచన ఒక్కటే!

మసకచీకటి. గడ్డిలోనుండి కాలిబాట మాత్రం స్పష్టంగానే కనిపిస్తూ వుంది. ఆమె పరుగు పెడుతున్నట్లు సాగిపోతున్నది.

ఐదు నిముషాలలో నది దగ్గరకు వచ్చారు. రెండు ఒడ్డులకూ వరిసిపారుతూవుంది భయంకరంగా. అవతలిఒడ్డు సరిగా కనిపించడమే లేదు.

"అక్కా... అక్కా!"

పార్వతి గొంతుక వణికిపోతూంది. చుట్టూ ఎక్కడా కదలిక కనిపించటం లేదు.

"అక్కా!"

బొంగురు పోయిన గొంతుకతో మరొక్కసారి పిలి చింది పార్వతి.

జవాబు రాలేదు. నీరసంగా తడిగావున్న నేలమీద కూలబడింది పార్వతి. శేఖర్ ఆమె భుజంమీద చెయ్యివేసి "భయంవద్దు పార్వతీ! ఆమె యిటు వచ్చివుండదు," అన్నాడు.

నదీప్రవాహంలో పెద్దచెట్లు కొట్టుకుని వస్తూంది. ఆ దృశ్యం చూడగానే శేఖర్‌కే ధైర్యంపోయింది. నిన్నను పార్వతి చెప్పిన మాటలు జ్ఞాపకం వచ్చాయి. కొద్ది క్షణాలు ... "అవును ... ఆమె నిస్సహాయురాలు!" అను కున్నాడు శ్యామలను తలుచుకుని.

నెమ్మదిగా పరుగు పెడుతున్న నదీ, ఆతృతగా అన్ని వైపులా చూస్తున్న పార్వతీ, చిందర వందరగా ఆలోచనలలో క్షణకాలం రామాన్నీ, క్షణం శ్యామలనీ, మరొక క్షణం రాజేశ్వరినీ తలుచుకుంటూన్న తనూ తప్ప పలుచబడు తున్న ఆ మసకచీకట్లలో మరెవ్వరూ లేరు. భయంలో ప్రకృతి అనంతంలో శ్యామల లేక పార్వతి పసిపిల్లలాగా వుంది. ఒక్క క్షణం అతనికి ఆమె తన చిన్నకూతురులాగా ఆమె రక్షణకోసం తాను బాధ్యుడులాగా అనిపించింది.

ఎందుకో శ్యామలకు ఏ అపాయమూ జరిగిందని అత నికి అనిపించలేదు. రాజేశ్వరి అంటూంది మానవత్వం వుంటే భయం వుంటూందని. కాని అతనికి తనలో మాన వతా, భయమూ ఉన్నాయనిపించలేదు.

కొన్ని నిముషాలలాగే గడిచిపోయాయి. నిర్విరామంగా నదీజలం ప్రవహిస్తోంది. అతనికి తనమీద కోపం వస్తూంది. పార్వతి నెమ్మదిగా, నిశ్శబ్దంగా ఏడుస్తోంది.

తనకంత ఆత్రుత లేకపోయినా, ఆమె ఆత్రుతను అర్థం చేసుకున్న శేఖర్ ఆమెను లేవదీసి, నెమ్మదిగా యింటికి నడిపించుకుని వెళ్ళాడు. దారిలో వాళ్ళేమీ మాట్లాడలేదు. కానీ శ్యామలను గురించి వెయ్యి భయాలు యిద్దర్నీ ఎన్నో బాధలు పెడుతున్నాయి.

ఆమె నదిలో పడిపోయిందా ?

ఆ ప్రశ్నకు మళ్ళీ మళ్ళీ తిరిగిరాకుండా ఎంతో ప్రయత్నంచేశాడు శేఖర్. ఒకనాడు రాజేశ్వరి బ్రతికివున్న మృతుడితో సమానమయిన తన మూలాన్న అలాగచేస్తున్నదా?

గేటుతీసుకొని ఇద్దరూ యింటిలో కాలుపెట్టేసరికి మేడమెట్లమీద శ్యామల క్రిందకువస్తూ కనిపించింది. ఆమెను చూడగానే పార్వతి వెళ్ళి కౌగలించుకున్నది.

అతను తెల్లబోయి చూస్తూ నిలబడి పోయాడు. శ్యామల ఎంతో అందమయిన నీలిచీర కట్టుకున్నది. మెడలో సన్నటి బంగారు గొలుసు, బుజాలమీద అందంగా పడుతున్న తలలో తెల్లటి గులాబీ.

కానీ, ఆమె పాదాలనుంచి కొంచెం మీదకు చీర తడిసిపోయింది. ఆమె నుదుటన ఎర్రటి కుంకుమబొట్టు కొట్ట వచ్చినట్లు కనిపిస్తోంది.

"అవును శ్యామలా, నాదే పొరపాటు. దుఃఖసముద్రం ఒడ్డుకువచ్చి వెనుదిరిగావు నువ్వు. ప్రాణం తియ్యటిది. నీది మరీని," అనుకున్నాడు శేఖర్.

ఆమె చూపులలో ఆ సందేహం స్పష్టంగా వుంది.

"ఇక్కడనించి వెళ్ళిపోవాలి నేను. నాకు తెలీని ఏదో విపరీతశక్తి నన్ను వేధించుకొని తింటోన్నది. నాలో ఉండి పోయిన కొంచెం మానవత్వాన్ని హరిస్తోంది. రామం చచ్చి పోయాడు. శ్యామలకి చనిపోవాలని ఉంది. పార్వతికి జీవితపు మార్గం ఏమీ తెలియదు."

పదిరోజుల సెలవు ఇక్కడ గడపాలని వచ్చాడు తాను. అనుక్షణం తనని బాధిస్తోన్న రాజేశ్వరి జ్ఞాపకాలని చెరిపెయ్యాడానికి వచ్చాడు తాను. ఏమిటి జరుగుతోంది?

శ్యామల నిస్సహాయురాలుకాదు. తాను వస్తానని ఆమె అనుకోలేదు. తన ఆస్తికి సంబంధించిన ఏర్పాట్లు ఆమె స్వంతంగా చేసుకోగలదు. తన సహాయం ఆమె అర్థించనూ లేదు. ఆమె ఏమిఅన్నా ఆమెకా అవసరమూలేదు.

ఇక్కడనుంచి వెళ్ళిపోవాలి తాను ఇవాళే. గోపన్న వస్తే బాగుండును. సామాన్లుమళ్ళీ...

గోపన్న జ్ఞాపకం రావడంతో నిన్నను రామం గురించి అతనన్నమాటలు జ్ఞాపకం వచ్చాయి. గోపన్న ఏమిటి ఉద్దేశించి అన్నాడు? ఇదంతా శ్యామలకి తెలుసునా?

ఆలోచిస్తూ కుర్చీలో కూర్చున్నాడు శేఖర్. టైము తొమ్మిది దాటింది. పార్వతి అతని గదిలోకి వచ్చి "అక్క నిద్రపోతోంది. ఉదయం జరిగిన దాని తరువాత నాకు చాలా భయంగా ఉంది. నేనడిగితే, మళ్ళీ అలాటి ప్రయత్నం చెయ్యనని మాట ఇచ్చింది. కాని, ఆమెని ఈ పరిస్థితిలో ఎలాగ నమ్మడం?" అంది.

అతను సమాధానం ఇవ్వలేదు. శోకమూర్తిగా శ్యామల నిన్న రాత్రి అతనిలో కలిగించిన మానసిక వేదన ఈ రోజు అతనిలో కలగడంలేదు. ఈ మార్పుకి కారణం అతను దూరంగా వెదకనూ లేదు.

సిగరెట్ వెలిగించుకున్నాడు. పార్వతి తనదగ్గర కూర్చున్నప్పుడల్లా తనకి అనిపిస్తుంది ఆమె తనపిల్ల అయితే ఎంతబాగుండునని. సామాన్యులకి ఉండాల్సిన అన్ని బాధలూ ఆమెకి ఉన్నాయి. కాని, ఆమెలో చిత్రమైనది ఆమె మరొకర్ని రక్షిస్తున్నా, తానే రక్షితగా కనబడడం.

"నేను ఇవాళ వెడతాను పార్వతీ! నేను వచ్చిన పని ఇలాగ అయింది," అన్నాడు చివరికి.

అప్పటిదాకా పార్వతి మాటాడలేదు. అతనిలోంచి కిటికీ అవతలికి చూస్తోంది. అతని మాట విని, "హఠాత్తుగా అలాగ ఎందుకని నిర్ణయించావు?" అన్నది.

"నేను చేసేదేమీ కనిపించ దిక్కడ. మీ ఇద్దరికీ నా సహాయం ఏమీ అవసరం అని అనిపించదు," అన్నాడు.

సిగరెట్ పొగ కిటికీలోంచి బయటికి వెళ్ళడం ఎంతో ఉత్సుకతతో గమనిస్తోన్న పార్వతి చిరునవ్వుతో, "అది పొరపాటే —మీరు బావగారికి చాలాదగ్గర స్నేహితులవడం మూలాన్న అక్కకి కొన్నిరోజులు సహాయంగా ఉంటారని అనుకున్నాను", అన్నది.

"ఏం చేసేది సహాయం?"

"మీరు ఉండడమే సహాయం. ఈవారం నుంచీ మేము ఎంత బాధపడ్డామో మీకు తెలిస్తే, నిన్నటినుంచీ మాకెంత సుఖంగా ఉందో మీకు తెలుసును!" అన్నది పార్వతి.

అతను చిరునవ్వుతో, "సుఖం! ఆమె ఈ ఉదయం నదిలో పడేందుకు ప్రయత్నించడమా సుఖం అంటే!" అన్నాడు. .

"ఆఁ...ప్రయత్నించి మానివెయ్యడం," అన్నది ఆమె.

అతను మరుక్షణం గంభీరుడై, "నావల్ల ఏ ఉపకారం జరిగినా తప్పక చేస్తాను పార్వతీ! కాని, ఏదో నానుంచి దాస్తోన్నట్లు, నాకు తెలియనట్లు ఉంది—నేను సరిగా చెప్ప లేను. కాని, నేను ఇక్కడ ఉండలేను," అన్నాడు.

సిగరెట్ అయిపోవచ్చింది. మరొక సిగరెట్ దానితోనే వెలిగించి, కుర్చీలో జారబడ్డాడు శేఖర్. సంవత్సరం

క్రిందట తనతో రాజేశ్వరి ఆమాటే చెప్పింది. తన మనః ఫలకంపై రాసినట్లే జ్ఞాపకం ఉన్నాయి తనకామాటలు.

టవునుకి వెళ్ళి, రామన్‌తో ఉండిపోయి ఉదయమే వచ్చాడు ఇంటికి. రాత్రి తనకి నిద్రలేదు. కళ్ళు ఎర్రరంగు తాను తాగడంవల్లనని అనుకుంది రాజేశ్వరి. తాను తాగిన మాట వాస్తవమే కాని చాలా తక్కువగా...

"రాత్రి తాగారు కూడానా?" అంది రాజేశ్వరి. నిజం చెప్పే ధైర్యంలేదు తనలో.

అసత్యం చెప్పే నీచత్వమూ లేదు.

సానునయంగా, "ఒక్కొక్కరోజు నా కేమవుతూందో తెలీదు రాజ్యం—నీకన్యాయం చేస్తూన్నానని తెలిసీ ఆగలేకుండా ఉన్నాను. ఇలాగ జరగదు మళ్ళా." అన్నాడు తను.

"ఈ సంవత్సరంనుంచీ ఇలాగే మీరు ఏమైపోతున్నారు? మీలో మానవత అంతా యేమైపోతోంది? మీతో నేను ఉండలేకుండా చేస్తున్నారు కాదూ?—జయించారు కూడా," అంది రాజేశ్వరి.

"తొందరపడకు రాజ్యం, నామాట విను."

"వింటాను —కాని, నిజం నాకు తెలుసును. నేనూ మీరు కలిసి ఉండలేము," అంది రాజేశ్వరి.

ఆరోజుతో తమ దాంపత్య జీవితంమీద శపించినట్టు అఘాతం పండింది. ఆవిషయం ఆక్షణంలోనే తనకి తెలిసింది.

ఆమె మాటలికి ప్రతిధ్వనిగా తనమనస్సులో "అవును, రాజ్యం...ఒకనాడు నిన్ను ప్రేమించాను_ ఏదో తెలియని ఆకర్షణ ఉంది నీలో—అదిచూసి. ఇవాళా నీలో ఆ ఆకర్షణ ఉంది. కానీ, దానికన్న బలమైనదేదో నీనుంచి నన్ను లాగేస్తోంది. నిన్ను ప్రేమించలేను,'' అనిపించింది.

రాజ్యం తనదికాదు. మరే స్త్రీ కాని ఆమె స్థానం ఆక్ర మించదు. కాని, ఆరకం జీవితమే తనదికాదు.

పార్వతి లేచి, ''దయచేసి ఈరోజు ఆగండి,'' అని బయటికి వెళ్ళిపోయింది. అతను లేచి ఒకటి రెండు వుత్తరాలు రాసి, పోస్టుచేసేందుకు పోస్టాఫీసుకి బయలుదేరేడు.

♦ ♦ ♦

"నమస్కారం బాబుగారూ!''

దార్లో గోపన్న ఎదురవనే అయాడు. ఉన్నవూరు చిన్నదైనా, ఆతనికోసం వూరంతా తిరగడం ఇష్టంలేని శేఖర్ సంతోషంగా, "బాగుంది గోపన్నా! నీకోసమే చూశాను,'' అన్నాడు.

ఉత్తరాలు పోస్టుచేసి నెమ్మదిగా నడుస్తూ దగ్గర్లోఉన్న చిన్న పార్కుకి వెళ్ళారు గోపన్నా, అతనూను. ఆమాట ఈమాట అడిగి, ''రామనాథంగారు చివరిరోజుల్లో కొంత వరకూ అల్లరిపడ్డారా గోపన్నా?'' అన్నాడు శేఖర్.

"అలాగని చెప్పలేం బాబూ. అల్లరి ఏమీ జరగ లేదు. పూరందరికీ ఈ విషయమే తెలీదు బాబూ," అన్నాడు గోపన్న.

"అసలు ఎవరావిడ?"

"ఇక్కడ ఒక దుకాణదారు కూతురు బాబూ. పట్నం వెళ్లి చదువుకుంది కూడాను. ఆవిడతో ఆబాబుగారు తరుచూ తిరుగుతూవుండేవారు."

"మరి, ఆమెకి తల్లి తండ్రీ ఉన్నారుగా!"

"పదిమంది పదిరకాలుగా చెప్తారు బాబూ. కాని, తల్లి చచ్చిపోయింది. తండ్రికి మరి వేరే పిల్లలు లేరు. అంచాత ఆమె ఏంచేసినా అతను చూసీచూడనట్టు వూరుకుంటాడు."

"వాళ్ళమధ్య సంబంధం ఎంతవరకూ?"

రీతి మార్చి కూర్చుని, "అది ఎవరు చెప్పగలరు బాబూ? ఆయన వారింటికి తరుచూ వెళ్ళడం చూసినవాళ్ళు ఉన్నారు? ఆపైన ఏమైనా చూసినదెవరు బాబూ భగ వంతుడు తప్ప?" అన్నాడు గోపన్న.

"అవున్లే గోపన్నా!"

"వెళ్లొస్తాను బాబూ! స్టేషనుకి వెళ్ళాలి."

"రేపు బండికి నేనూ వాల్తేరు వెడతాను గోపన్నా. వస్తావుకదూ?"

"వస్తాను బాబూ! మరి—ఆ అమ్మాయిని చూడా లంటే ఈ పార్కులోకి సాయంత్రము రండి బాబూ. రోజూ వస్తూనే ఉంటుంది."

గోపన్న వెళ్లిపోయాడు. శేఖర్ తిరిగి ఆలోచించ సాగాడు. శ్యామలని ఇంకా తాను పరిశోధించలేకపోతు న్నాడు. ఈ ఉదంతం....

"నమస్కారమండీ!"

పార్కు బెంచీమీద కూర్చుని ఆలోచనల్లో తేలి పోతూన్న శేఖర్ కళ్లు తెరిచి, "ఎవరమ్మా?" అన్నాడు.

ఆమెకి పదిహేడేళ్లకన్నా ఉంటాయని అనిపించలే దతనికి.

"నాపేరు వసుంధర, చనిపోయిన రామంగారి ఇంటికి వచ్చిన స్నేహితులు మీరేనా?"

"అవునమ్మా!"

"గోపన్న మీతో మాట్లాడ్డం విన్నాను శేఖర్ గారూ. అతను మాట్లాడినది నన్ను గురించే."

అర్ధనిద్రావస్థనించి పూర్ణ జాగ్రదవస్థకి వచ్చి, "కూర్చోండి." అన్నాడు శేఖర్ కొంచెం గాభరాగా.

ఆమె కూర్చుంది. ఇలాగ ఆమెని కలుసుకుంటానని అతను అనుకోలేదు. సిగరెట్ వెలిగించుకుని, "మీకు నొప్పి కలిగించేదేమీ మీరు వినలేదని ఆశిస్తాను," అన్నాడు.

ఆమె బాధగా నవ్వింది. "వాస్తవంగా జరిగినవే బాధ కలిగించనప్పుడు వాటి ప్రసక్తి ఎందుకలాగ చెయ్యాలి? మీకు చాలా ఆనందంగా లేరని నాకు తెలుసును. అందుకే త్వరగా మాట్లాడ్డం ముగించి వెడతాను," అన్నది.

"బాధలేదు వసుంధరా! మిమ్మల్ని కలుసుకోవాలనే అనుకున్నాను. ఈ కథలో నాకు తెలియనిదేదో ఉంది. అది మీకే తెలిసి ఉంటుంది. మీకు ఎంతవరకూ అభ్యంతరం లేదో అంతవరకూ చెప్పండి."

"గోపన్న చెప్పినది చాలా వరకూ నిజమే శేఖర్ గారూ. అయితే, నలుగురూ అనుకున్న కారణాలు మాత్రం తప్ప. ఆయన కథలు రాస్తారని ఇక్కడ ఎవరికీ మొన్న మొన్నటిదాకా తెలీదు. నేను కాలేజీలో చదువుకునేటప్పుడే ఆయన కథలు చూసేదాన్ని. ఆయన ఇక్కడికి వచ్చి స్థిర పడ్డాక నేను సెలవుల్లో ఆయన్ని కలుసుకున్నాను. ఆయన మీద ఉన్న అభిమానం, ఆయన్ని కలుసుకున్నాక ఆకర్షణగా మారింది. కొన్ని ఆకర్షణలకీ, అభిమానాలకీ కారణం కాని, హద్దు కాని ఉండదు. ఒక్కమాటలో చెప్పాలంటే, శేఖర్ గారూ, మా సంబంధం అలాంటిదే! ఆయనలో నేను మానసికానందాన్ని, నిర్వచించలేని సుఖాన్ని అనుభవించాను. ఆయనా ఎన్నోమార్లు తనదీ అలాటి భావమేనని వ్యక్తపరచేవారు. సంఘం కానీ, కట్టుబాట్లు కానీ, ఆయన పరి

స్థితి కానీ మమ్మల్ని ఆపలేదు. ఇవాళ నాకు చివరిగడియల్లో ఆయనతో లేకపోయానని తప్ప పశ్చాత్తాపమూ లేదు."

సావధానంగా వింటూన్న శేఖర్ ఆమెవైపు తిరిగి మాట్లాడకుండానే మరొకసారి సిగరెట్ పీల్చాడు.

"ఇంకా ఏమైనా అడుగుతారా?"

"మీరు చెప్తే అడుగుతాను. రామనాథం నాకు చాలా దగ్గర స్నేహితుడు. అతన్ని నేను చూద్దామని వచ్చి ఇంకెప్పటికీ చూడలేనని తెలుసుకున్నాను. అయినా, మీకు చెప్పాలని వుంటే ఇది చెప్పండి. ఈ సంగతి ఆయన భార్యకి తెలుసునా?"

ఆమె కొంచెం ఆగింది ఆలోచిస్తూన్నట్లు. "నాకు తెలిసినంత వరకు ఆమెకు యీసంగతి బాగా తెలుసును. చివరిరోజుల్లో ఆమె ఆయనతో చాలా దెబ్బలాడేదని అనుకుంటాను. కాని ఆయన ఆవిషయం నాకెప్పుడూ చెప్పలేదు," అన్నది.

కొన్ని క్షణాలాగి వసుంధర, "మీ దగ్గరకి ఒక ఉపకారం కోసం వచ్చాను," అన్నది.

"చెప్పండి."

"ఆయనకి నేను రాసిన ఉత్తరాలు వారి ఇంట్లో ఉన్నాయి. ఆమె కోపంకొద్దీ ఏం చేసినా చెయ్యొచ్చు. మీకు వీలైతే ఆ ఉత్తరాలు తీసుకుని రిటర్ను చేయండి."

అతను ఆగి చివరికి "తప్పక ప్రయత్నిస్తాను వసుంధరా," అన్నాడు.

సెలవు తీసుకొని ఆమె వెళ్ళిపోయాక ఒక్కసారి మనస్సు తేలిక పడినట్లయింది శేఖర్‌కి. శ్యామల తాను బాధపడ్డాననుకుంటున్నది. ఆమె ఉద్దేశంలో రామానికి తగిన శిక్ష అయింది. ఈ విషయం తెలిశాకనే ఆమె దుఃఖం తీరిన పగ క్రింద మారిపోయింది.

వసుంధర అందగత్తె ఏమీ కాదు. రామానికి ఆమెలో ఏం కనిపించిందో కానీ, ఆమెలో సిన్సియారిటీ ఉంది. ఒక జీవితం ఆమెది అంతం అయింది. రెండో జీవితానికి ఆమె సంసిద్ధురాలౌతుంది.

ఎంత అదృష్టవంతులు వీళ్ళు! తనూ అలాగ చెయ్యగలిగితే!

ఆక్షణంలో తన ప్రక్కన రాజేశ్వరి నవ్వినట్లుంది. లేచి ఇంటికని బయల్దేరాడు శేఖర్.

# 3

మధ్యాహ్నానికి ఎండ బాగా వచ్చింది. భోజనం చేసి శేఖర్ తనగదిలో కూర్చున్నాడు. వర్షంలో తడిసి తడిసి వున్న ప్రకృతి ఎండలో ఏదో చిత్రమైన అనుభూతిని కలుగ జేస్తున్నది.

మగతలో సిగరెట్ కాల్చుకుంటూన్న శేఖర్‌కి ఎన్నో ఆలోచనలు వస్తున్నాయి. కానీ, పదేపదే వసుంధర అతన్ని వెంటాడుతోంది. ఆమెని పార్వతితో సరిపోల్చి చూశాడు. జీవితసాగరాన్ని మథించి అప్పుడే ఒక హాలాహలాన్ని ఇముడ్చుకున్న యువతి వసుంధర. జీవిత సాగరాన్ని ఇంకా దూరంనించే చూస్తూ, కాలం గడుపుతూన్న అమ్మాయి పార్వతి. వీళ్లిద్దరికీ మధ్య ఎక్కడో శ్యామల.

"మిమ్మల్ని ప్రేమించాలని ఆశించాను. కానీ, దాని కోసం నాకున్న అన్నిటిని నాశనం చేసేశాను," అంది తనతోవున్న చివరి రోజుల్లో రాజేశ్వరి. ఇవేళదాకా ఆమె ఉద్దేశం పూర్తిగా అవగతం కాలేదు తనకి. కానీ గడచిన ఇరవై గంటల అనుభవాల్లో రాజేశ్వరి తనకి ఎప్పటికన్నా సన్నిహితురాలైనట్లుంది. తనని ప్రేమించాననుకుని ఆమె గడిపిన రోజులు, చివరికి ఆమె గ్రహించిన అవాస్తవికతా, ఆ తరువాత ఆమె ఎంతో తీవ్రంగా పొందగోరిన ఆనందమూ తన కివాళ అర్థం అయిపోతున్నాయి.

ఒక మోస్తరుగా తనదీ ఆమె జీవితంలాంటిదే. కానీ, ఆమెకి తన మనస్సులో ఏం వుందో, జీవితంలో తానేమి కోరుకుంటుందో తెలుసును. కానీ తన మనస్సుమీద ఎవరో తెర కప్పేశారు. చిక్కటి మంచులోలాగ అవతల ఏం జరుగుతుందో తనకి తెలియడంలేదు. అనేక సంఘటనలకి తాను అనుకున్న రియాక్షన్సు తననించి రాలేదు. కానీ ఆ సంఘటనలు సుమారు అన్నీ చిన్న చిన్నవి కావడాన్న తనలో వచ్చిన మార్పుకూడా తనకి తెలీలేదు. రాజేశ్వరి వెళ్లిపోయిన రోజున తాను ఇంటికి వెళ్లలేననీ, ఆ ఇంటిలో తిరిగి అడుగు పెట్టినప్పుడల్లా పాత జ్ఞాపకాలతో మనస్సు బాధపడుతుందనీ అనుకున్నాడు తాను. కానీ తనకి ఆ రోజు ఆయింట్లో ఎంతో స్వేచ్ఛ కనిపించింది. ఆచారీ, తానూ, విల్సన్‌తో కలిసి రాత్రంతా తాగి, ఆడుకున్నారు. ఈ సంవత్సరంలో అలాగా చాలాసార్లు చేశారు. ఉద్వేగం కానీ, సిగ్గుగానీ తనని బాధపెట్టలేదు.

మేడమీద గదిలో శ్యామల వుంది. పార్వతీ బహుశా అక్కడే వుంది. క్రిందగదిలో బయట ఎంతో ఆకర్షణీయంగా ఉన్న ప్రకృతిని చూస్తూ తాను కుర్చీలో పడుకున్నాడు. అప్పుడు ఎన్నాళ్లనుంచో తాను తననించి దాచుకుంటూన్న ప్రశ్న సూర్యోదయపు ప్రకాశంలో తనని ఎదుర్కొంది.

"రాజ్యం ఏం నేరం చేసింది?"

మగతనిద్ర మాయం అయిపోయింది. కళ్లు తెరచి చుట్టూ చూశాడు. గదిలో తానే వున్నాడు.

ఆమె ఏం నేరం చేసింది? ఇన్నాళ్ళనుంచి బాటిల్సు వెనకాల, సినిమా చీకట్లలో, పేకముక్కల చాటున తాను దాగున్నాడు యీ ప్రశ్ననుంచి, రాజ్యం నించి.

ఏకాంతంలో తనని రక్షించేవి యివేవీ లేవు. జవాబు తాను చెప్పకోవలసిందే.

సిగరెట్ అయిపోయింది. ట్రేలో పడేసి అతను పచార్లు చెయ్యడం సాగించాడు. ఏదో దుష్టశక్తిమల్లే ఆ ప్రశ్న తనని వెన్నంటి తిరుగుతోంది. ఇవేళ దొరికిపోయాడు.

పెద్దకళ్లు రాజ్యానివి. కానీ, ప్రార్థిస్తూ తన కనికరం కోసం ఆమె వాటిని గాని, వాటి అశ్రువుల్ని గాని ఎప్పుడూ ఉపయోగించలేదు. తన హుందాతనాన్ని చివరి నిమిషం లోనూ ఒదులుకోలేదు. ఆమెను రైలులో వదలి తాను వెళ్లినప్పుడుకూడా ఆమె తన స్వాభావిక గాంభీర్యాన్ని కాపాడుకుంది.

ఇవేళ తనని ఏమిటి వెనుదరుముతోంది?

"బాబూ!"

తృళ్ళిపడ్డాడు శేఖర్. గుమ్మంలో నిలబడ్డ గోపన్నని చూసి సర్దుకొని, "నువ్వా గోపన్నా! రేపుకాదూ నిన్ను రమ్మన్నాను?" అన్నాడు.

"అవును బాబూ! మనోరమగారు ఈ చీటి తమ కిమ్మంటే తెచ్చాను".

కవరు తీసికొని, లోపలి రెండుపంక్తుల ఉత్తరం చదువుకొని, "సరేనని చెప్పు," అన్నాడు శేఖర్. గోపన్న వెళ్ళిపోయాడు.

"మీకు వీలైతే సాయంత్రం ఒక్కసారిరండి. మాతో టీ తీసుకుందురుగాని," అని రాసింది మనోరమ. 'మనూ!'

నిన్న ఆమె తనతో చెప్పింది మరోకసారి తమని చూడమని. "ఇవేళ ఆహ్వానం పంపింది. మంచిదే! మాట నిలబెట్టుకుంది" అనుకున్నాడు శేఖర్. కాని ఇవేళ తన మనసంతా పాడైపోయింది. ఏమీ చెయ్యాలనిలేదు. ఎవరితోనూ మాటలాడాలనిలేదు. అయినా...

ఎవరో కాల్ బెల్ రింగు చేస్తున్నారు. నిశ్చయానికి వచ్చి అతను లేచేలోపునే పార్వతి గొంతుక "నువ్వా రఘూ?" అని వినిపించింది.

వాళ్ళు డ్రాయింగు రూంలోనే కూర్చుని మాట్లాడుకుంటున్నారు. "నిన్ను చూడాలని వచ్చాను పారూ!... ఉత్తరం అయినా రాయలేదెందుకని?" అన్నాడు రఘు.

ఆమె మెల్లిగా జరిగినదంతా చెప్పింది. అతనేదో చెప్తున్నాడు మెల్లిగానే. మధ్య మధ్య తనకి వినిపిస్తోన్న మాటల్నిబట్టి రఘూ తన తల్లి దండ్రుల్ని ఆమె పెళ్ళికి ఒప్పించాడనీ, పార్వతిని ఒప్పించడానికి వచ్చాడనీ అతనికి అర్థం అయింది.

అతనికి ఆశ్చర్యం అనిపించింది. పార్వతి తాను కొంటూన్న పసిపిల్లకాదు. ఆమె యువతి. తన వయస్సుని బట్టి ఆమెమీద తన దృష్టిని నిర్ణయించుకున్నాడు తాను. ఆమె మానసిక జీవితాన్ని ఏమాత్రమూ అర్థం చేసుకోలేక పోయాడు.

సిగరెట్ మీద సిగరెట్ కాలుస్తూ ఆలోచిస్తున్నాడు శేఖర్. తనలో ఉన్న లోపం ఏమిటి? ఏ పరిస్థితినీ తాను సవ్యంగా చూడలేక పోతున్నాడు. ఎవరిని సరిగా తాను అర్థం చేసుకోలేక పోతున్నాడు.

తాను, శేఖర్ అనే చంద్రశేఖరం, వయస్సు ముప్పై ఆరు, ఆర్డినన్స్ డిపోలో ఉద్యోగి, ఇంకెవరినీ గుర్తు పట్టలేదు. తనని గురించిన ఇతర వివరాలూ తనకి తెలీవు.

మళ్లీ మగతకమ్మింది తనకి. అప్పుడప్పుడూ పార్వతి మెల్లని మాటలు గాలిలోంచి వస్తున్నాయి తన చెవుల్లోకి, హృదయంలోకి.

  

సాయంత్రానికి రఘు వెళ్ళిపోయాడు—అయిదయాక శేఖర్ బయలుదేరి మనూని చూడడానికి వెళ్లేడు.

నిజానికి ప్రొఫెసర్ ఇంటికి ఇప్పుడు వెళ్లాలని అతనికి లేదు. కాని, ఇచ్చినమాట తప్పలేకా, ఆ సాయంత్రం ఎలాగ గడపాలో అతనికి తెలియక బయలు దేరాడు.

అతను వెళ్ళగానే ప్రొఫెసర్ అతన్ని ఆహ్వానించి, "రండి, నిన్నసాయంత్రందాకా జరిగినది తెలీనే తెలీదు — పాపం! ఆయన పోయాడని విని చాలా బాధపడ్డాము," అన్నాడు.

కొన్ని నిముషాల తరువాత మనూవచ్చి వాళ్ళని టీ కి లోపలికి తీసికెళ్ళింది. ఆ మాటా ఈ మాటా చెప్పు కుంటూ టీ త్రాగటం ముగించేసరికి ఆరయింది. బయట కూర్చుని శేఖర్ సిగరెట్ వెలిగించుకోగానే, ప్రొఫెసరు ఏదో పని ఉందని చెప్పి వెళ్లిపోయాడు.

తనూ ఇంక సెలవు తీసుకోవచ్చుననుకున్నాడు శేఖర్. తనని గురించి వాళ్ళు తెలిసికోదగ్గది తెలుసుకున్నారు. తన ఉద్యోగం, రామంతో తన స్నేహం. తనకి పిల్లలు లేరు. ఆమె మదరాసులో హిస్టరీలో ఎం. ఏ. కి హాజరు అయింది. ఆమె తల్లిదండ్రులు ఎక్కడో ఒరిస్సాలో ఉన్నారు. ప్రొఫెసరు రామస్వామిగారి చెల్లెలి కూతురు ఆమె. ఈ సెలవుల్లో ఇక్క డికి వచ్చింది.

అక్కడితో తమ సంభాషణ ఎంతవరకు అవగలదో అంతవరకూ సాగినట్లనిపించింది. ఈ సాయంత్రం ఎలాగో గడిపితే...

బద్ధకంగా ఒళ్లు విరుచుకున్నాడు శేఖర్. అర్థరహితం అయిపోతోంది ఇక్కడ ఉనికి. మళ్లీ విశాఖపట్నమూ, స్నేహితులూ...

"మీతో రాజేశ్వరిగారిని గురించి మాట్లాడేందుకు పిలిచానీవేళ. మీ భార్యపేరు అదే కదూ?"

అప్పుడే వచ్చి కూర్చున్న మనూ మాటలకి మళ్ళీ పూర్తిగా తెలివొచ్చింది. ఇది తను అనుకోనిది.

సిగరెట్‌పొగ గాఢంగాపీల్చి, "అవును, ఆమె మీ కెట్లా తెలుసునూ?" అన్నాడు శేఖర్.

"ఆమె యూనివర్సిటీలో రిసర్చికి జాయిన్ ఐంది. మీకు తెలుసునా?"

నిజంగా ఆశ్చర్యపడ్డాడు శేఖర్. దాచుకోలేక పోయాడు. "అలాగా?" అన్నాడు.

"అక్కడే మా పరిచయం. రెండుమూడుసార్లు వాళ్ళ యింటికికూడా వెళ్ళేము మైలాపూర్‌లో."

అతను వింటున్నాడు.

"అక్కడ మీ ఫొటో చూశాను. తనకష్టాలు చెప్పుకొనే మనిషి కాదు రాజేశ్వరి. కాని, ఆమె గురించి క్రమంగా కొంత తెలిసింది. ముఖ్యంగా మీరు చేసినది—"

"చెప్పండి."

"ఆమెకి యూనివర్సిటీ స్కాలర్‌షిప్ వచ్చింది. పోనీ ఆ సంగతి తెలుసా మీకు?"

"తెలీదు".

"అంటే ఆవిడకి అమెరికన్ స్కాలర్‌షిప్ వొచ్చిన సంగతి కూడా మీకు తెలీదన్నమాట."

త్రుళ్లిపడ్డాడు—"అమెరికన్?"

"ఆఁ. ఆఫర్ ఒచ్చింది క్రిందటివారం."

అప్రయత్నంగా, "ఎప్పుడు వెడుతుంది?" అని అడిగాడు శేఖర్. తన గొంతుకలోకి వచ్చిన ఆతృత అతన్ని సిగ్గుపరచింది వెంటనే.

"తెలీదు! ఆమె ఇంతవరకూ ఇవ్వలేదు. మీకు రాశారేమోననుకున్నాం. క్షమించండి — మీరు డైవోర్స్‌కే సిద్ధపడుతున్నారా? అందుకే ఇలాగ..."

తనని తానే అడగడానికి సాహసించని ప్రశ్నలు తనని ఎక్సరే చేసి ఆమె అడుగుతోంది ధైర్యంతో. ఆమెవైపు తేరిపారచూశాడు ఓటమి కోపంతో.

"సారీ—క్షమించండి. కాని, మేమందరమూ ఆమెని చాలా ప్రేమతో చూస్తాము. అంచేత కొంత ఆతృతగా అడిగాను. ఆమె మామూలంగా ఇప్పటికి ఒక జీవితం పాడు చేసుకుంది. రెండోదికూడా పాడైతే—"

సిగరెట్ పారవేసి, లేచి నిలబడ్డాడు శేఖర్. "ఎంత చదువుకున్నా, ప్రతి స్త్రీ జీవితానికి ఒక పురుషుడు బాధ్యుడనే ఆలోచన మీలోనించి పోదని అనుకుంటాను—ఇంతవరకూ తెలుసుకున్న మీరు మిగిలినది ఎందుకు తెలుసుకోలేదు?"

మనూ సిగ్గుపడింది. అతను తనకి పూర్తిగా పరాయి వాడు—అతన్నట్లా అడగడానికి హక్కేముంది తనకి?

"అవును కాని, ఆమె జీవితానికి మీరే బాధ్యులని అనుకుంటాను" అంది చివరికి.

అతను సిగరెట్ వెలిగించి మళ్లీ కూర్చుని "అంటే?" అన్నాడు.

"అంటే, ఆమె మిమ్మల్ని ఆరాధిస్తోంది—ఆమెకింకా నమ్మకం పోలేదని మీరు ఏమన్నా అంటారని అనుమానం ఉన్నా ఆమె స్కాలర్‌షిప్ రిజెక్ట్ చేస్తుందని."

ఆమె ఉద్దేశాన్ని అవగతం చేసికోవడానికిలాగ, కొద్ది క్షణాలు ఆగి, "మీకు రాజేశ్వరిమీద అభిమానం ఉంది. మంచిదే. కాని, నామీద ఏదో దురుద్దేశం కలిగించుకోడానికి అది కారణం కాకూడదు. మేం మా జీవితాలని ఎవరికి వాళ్ళం గడిపేందుకు నిశ్చయించాం. ఆమెకి దేనికీ నేనడ్డు చెప్పను—నాకా అవసరమూ లేదు. హక్కూ లేదు."

అలాగే కూర్చుంది మనూ. ఆమె ఏమనుకుంటూందో బయటికి తెలీదు. ఆమె ముఖంలో ఏ భావమూ ప్రస్ఫుటం అవడంలేదు.

కొద్ది క్షణాలాగి, "నేనింక వెడతాను. మీరు నాకన్న చాలాచిన్నవారు. బహుశా అనుభవాల్లో ఎన్నోతరాల భేదం ఉంది మన మధ్య. కాని, ఈ పరిస్థితి విచిత్రమైనది. మీఉద్దేశంలో నేను చెయ్యాల్సింది ఏమిటో చెప్పండి." అని అతను లేచి నిలబడ్డాడు.

ఆమెకూడా లేచి నిలబడి, "నిజంగా, దానికి సమాధానం నేను చెప్పలేను శేఖర్ గారూ! కాని, ఆమె మీా మీాద చూపుతోన్న అభిమానం మీారు ఆమె మీాద చూపితే ఏదో ఒకటి మీాకే తడుతుందని అనుకుంటాను" అన్నది.

అతను గుమ్మందాకా వెళ్లేవరకూ ఆమె సాగనంపి సెలవు తీసుకుంది. వెయ్యి ఆలోచనల్తో అతను ఇంటివైపు నడిచాడు.

అతను వెళ్లేసరికి శ్యామల గేటుదగ్గర నిలబడి ఉంది. అతన్ని చూడగానే, "రండి మీాకోసమే చూస్తున్నాను. మీాతో కొన్ని విషయాలు మాట్లాడాలి" అన్నది. ఆమె వెనకాలే అతను నడిచి వెళ్లాడు.

## 4

చీకటిపడుతోంది. క్రింద హాలులో దీపాలు వెలిగించి, అతన్ని కూర్చోమని సంజ్ఞ చేసింది శ్యామల. అతను కూర్చున్నాక, "మీారివాళ వసుంధర అనే అమ్మాయిని కలుసుకున్నారా?" అంది శ్యామల, తానూ కూర్చుంటూ.

"ఆఁ" అన్నాడతను.

"ఆ విషయం మీాకెలాగ తెలిసిందట? — ఆయన రాశారా?"

సాలోచనగా శేఖర్ కొంచెం ఆగి, సిగరెట్ వెలిగించుకొని, "ఎలా ఐతేనేంలెండి—నాకు తెలిసింది" అన్నాడు.

"నాకు తెలుసుననీ మీకు తెలుసా?"

"అలాగే అనుకున్నాను ఇవాళదాకా. కాకపోతే, రామం గది మీరు వెతికాక ఎప్పుడో ఒకప్పుడు తెలియక పోదు."

"అంటే?"

ఆమె ముఖంలోకి సూటిగా చూచాడు శేఖర్.

ఆమె ఏమిటి దాచడానికి ప్రయత్నిస్తోంది!

"నా ఉద్దేశం, వసుంధర అతనికి రాసిన ఉత్తరాలూ మీ చేతిలో పడక తప్పదని."

చిన్న నవ్వు నవ్వి, "అవును—నిన్న సాయంత్రమే అవీ దొరికాయి. ఐతే, ఇదంతా మీకు బాగా తెలుసునన్న మాట!" అంది.

చీకటిలో వెలుతురు మెరుపులాగ ఆలోచన వచ్చింది. శ్యామల తననించి అడగబోతున్న ప్రశ్నలు తెలిశాయి శేఖరికి. వసుంధరకి ఉపకారం చెయ్యడానికి ఇదే అదను దొరికిం దతనికి.

"అవును — తెలుసును" అన్నాడు.

"ఇంత విచిత్రం అయింది జీవితం శేఖర్ గారూ! నిన్నటి దాకా నాకు కొంత తెలిసినా ఇంత అన్యాయంగా ఉందని నేననుకోలేదు. చివరికి నాతో ఉండడమే ఆయనకి కష్టం అయిందన్నమాట. ఇదంతా మీకు రాశారా?"

ఆలోచించకుండా, "ఆఁ!" అన్నాడు శేఖర్.

"మరి, వసుంధర ఏం చెప్పింది?"

అట్టే ఏమీ లేదు. ఏమాట ఎలాగ ఉన్నా, ఈ దుర్ఘటన ఆమెకే కష్టమే కలిగించింది."

కొన్ని నిముషాలు ఆమె ఏమీ మాటలాడ లేదు. తరువాత చాలా నెమ్మదిగా, "ఆయన ఉత్తరాలు ఆ అమ్మాయి దగ్గర ఉన్నాయి. అవి ఎవరి చేతుల్లోనైనా పడటం నాకిష్టం లేదు" అంది.

"ఆ విషయం నాకు తెలుసు. కాని, ఆమె వాటిని ఇవ్వదు — మీ ఉత్తరాలు ఆమెకిచ్చేస్తే ఏ పరిస్థితుల్లోనూ ఆమె ఆ ఉత్తరాల్ని మరేవిధంగానూ ఉపయోగించకపోవచ్చును."

శ్యామల లేచి, మీదికివెళ్ళి, ఒక కట్ట ఉత్తరాలు తెచ్చింది. అతనికి యిస్తూ, "ఇవి మీకు ఇస్తున్నాను...మీదే బాధ్యత", అంది.

"సరే" అన్నాడు శేఖర్. ఆమె అలాగ ఏందుకు ప్రవర్తిస్తోందో సూచనామాత్రంగా తనకి తెలిసినా, ఆమె యెదుట దానిని గురించి ఆలోచించదలచుకోలేదు శేఖర్.

"ఇంకొక్కటి ఉంది."

తిరిగి ఆమె లేచి వెళ్ళింది—అతను సిగరెట్ వెలిగించుకొని, తాను గెలిచాడో, ఓడిపోయాడో ఆలోచించసాగాడు.

ఐదు నిముషాలలో ఆమె కొన్ని కాగితాలు తెచ్చి అతనికి ఇచ్చింది.

"ఆయన పోయేనాటికి ఈ నవల రాస్తూండేవారు. దీన్ని పూర్తి చేయించడంతో ఆయన చివరి రచన పూర్తి అవుతుంది. మీరు కొన్నాళ్లు రాశారని అనుకుంటాను— కాదూ?"

"అవును"

"అందుకే, మీరే ఇది పూర్తిచేసి ప్రచురణకి ఏర్పాటు చెయ్యండి."

అలిసిపోయినట్లు ఆమె సోఫాలో జేరబడింది. బయటి చీకటి హటాత్తుగా జ్ఞాపకంవచ్చి, "పార్వతి ఏదీ?" అన్నాడు శేఖర్.

"నిద్రపోతుంది నా గదిలో. రఘు నాకేం నచ్చలా—తిట్టానని ఏడ్చి ఏడ్చి నిద్రపోయింది. దాన్నిగురించి బాధలేదు లెండి. దానికే అర్థం ఔతుంది."

ఇంక మాట్లాడడానికేమీ లేదు. శేఖర్ లేచి తన గది లోకి వెళ్లేడు. మనూ, వసుంధర! ఈ ఇద్దరూ మళ్ళీ మళ్ళీ తనకి జ్ఞాపకం వస్తున్నారు. ఏదో, తనకి తెలీని వెన్నో చెప్తు న్నారు. తన మస్తిష్కానికి చక్కనిపూతలు...ఏమిటో అవ గతం కావు తనకి.

నవల కాగితాలు పెట్టెలోపెట్టి, తిరిగి బయటికి వచ్చాడు. హాలులో ఎవరూ లేరు.

నెమ్మదిగా అతను బయటికి నడిచాడు. రాత్రి నిశ్శబ్దంలో నదీ ప్రవాహం పిలుస్తోన్నట్లు ధ్వనిస్తోంది. కొంచెం ఎండిన కాలిబాట మసగ్గా దారి చూపుతోంది.

తన ఆధీనం లేకుండానే అతన్ని పాదాలు నడిపించాయి. తనవికాని ఏవో కళ్ళు ఆ చీకటిలో తనకి దారిచూపుతున్నాయి. నెమ్మదిగా నడిచివెళ్ళి ఒడ్డున రాళ్ళమీద కూర్చున్నాడు. ఆచీకట్లోనే ఏదో వెలుగు కనిపిస్తోందతనికి.

సాంద్రతను నిశ్శబ్దంలో అతనికి మనూ మాటలూ, రాజేశ్వరి జ్ఞాపకం వచ్చారు.

ఎన్నాళ్ళనించో లేని ఆర్ద్రిత అతన్ని ఆవరించింది. ఆ ఏకాంతంలో, సాయింత్రపు చీకటిలో ఆమె తనది. ఆమె అడిగింది తనని తనవాడు కావాలని ఒకప్పుడు అనిపించేది. ఆమెకన్న ఇంకెవరూ తనకి వద్దని. ఈమధ్య అదంతా అబద్ధం అనిపించింది.

కాదు...తనకీ రాజ్యానికీ, మధ్య ఏదో నిజం ఉంది. శ్యామలకీ, రామానికీ: రామానికీ వసుంధరకీ మధ్య ఉన్నట్లే ...తాత్కాలికంగా తాను పొరపాటు పడ్డాడు. ఆమెకూడా ఏదో పొరపాటు చేసింది. ఔనా?

నదీజలాలమల్లే కాలం ముందుకి సాగిపోతోంది. వయస్సులు వచ్చేస్తున్నై. రాజ్యానికి తాను తప్ప ఎవరున్నారని? ఎవరిమీద ఆశలతో ఆమె బ్రతుకుతుందని? తనకీ ఎవరున్నారు?

ఇంకా లోకం తెలియని పార్వతి తన మగవాడికోసం శ్యామలతో దెబ్బలాడుతోంది. వసుంధర తన జీవితంలో ఒక అధ్యాయాన్నిముగించి ఇంకో అధ్యాయానికి తొలి పంక్తులు రాస్తోంది. అందరిలాగా ప్రేమించదు మనూ; కానీ, ఆమే ప్రేమిస్తుంది. శ్యామల తనకీ, రామానికీ మధ్యన ఉన్న బంధాలన్నీ విడుదల చేస్తోంది. కత్తిరించిన రెక్కలు మళ్లీ పెరుగుతాయి. ఆనాటి రామం ఇవాళే జ్ఞాపకం అయ్యాడు. త్వరలోనే విస్మృతుడూ ఔతాడు; చరిత్ర లేకుండా, ఏమీ తెలీకుండా తానూ, రాజ్యం మాత్రమే ఉండిపోతారా? బాధల యీ జ్ఞాపకాలలో, వేదనల భవిష్యత్తులో, దినం నుంచి దినం ప్రయాణం నిమిషం నుంచి నిమిషం గమనం— ఎక్కడికి, ఎందుకని?

తన కళ్లముందు చీకటి; హృదయంలో చీకటి; నది తనలో తాను సాగిపోతోంది — నిరామయంగా. ఆ చీకటి కవతల ఏమిటి వుంది?

చంద్రశేఖర్ కూడా ఒకనాడు చచ్చిపోతాడు. తాగి, తాగి, లివర్ ఎన్‌లార్జి అయి చచ్చిపోతాడు. లేకపోతే సిగరెట్లు కాల్చి కాల్చి కాన్సర్ వచ్చి. ఈలోగా అతని జీవితంలో ఒక్కడూ దాచుకోడానికి దుఃఖాలూ, మూసుకోడానికి ద్వారాలూ తప్ప ఏమీ వుండవు?

తనకి భయం వెయ్యడంలేదీ ఏకాంతంలో. తనకి భయం వెయ్యడం లేదు చీకట్లో ఈనది ఒడ్డున. కానీ,

ముందూ, వెనుకా యేది తల్చుకున్నా తనకి భయం వేస్తోంది.

చాలా ఆలశ్యం అయిపోయింది. గడియారం వంక చూశాడు శేఖర్. కనిపించలేదు. లైటర్ వెలిగించాడు. తొమ్మిది పది అయింది.

ఇంత సేపూ అతను సిగిరెట్టు కాల్చలేదు. గొంతుక ఆర్చుకు పోతోంది.

సిగరెట్ వెలిగించి, వెళ్లడానికి లేచాడు. రెండడుగులు వేసేసరికి చాలా నీరసం అనిపించింది. అతను ఆశ్చర్య పడ్డాడు. ఇంత సేపూ కూర్చున్నాక యీ నీరసం ఏమిటో!

ఇంటికి వెళ్లేసరికి శ్యామలా పార్వతి తన కోసం చూస్తున్నారు. వాళ్ల ప్రశ్నలన్నిటికీ, "షికారు వెళ్లే" నని సమాధానం చెప్పి భోజనానికి సిద్ధమయ్యాడు శేఖర్.

## 5

అతను నిద్రలేచే సరికి ఎనిమిదైపోయింది. కాఫీ తాగి సిగరెట్ వెలిగించుకునే సరికి శ్యామల వచ్చి "ఇవాళే వెళ్లి పోతారా?" అంది.

అతను "అవును" అన్నాడు.

"ఎంచేత? మావూరు నచ్చలేదా?"

అతను నవ్వి, "నేను వచ్చినది ఒకందుకు. ఇక్కడ జరిగింది మరొకటి. తిరిగి నిన్ననే వెళ్లాల్సింది—కాదూ?" అన్నాడు.

"మరి—మీరు మళ్లీ వస్తారా? ఎప్పుడైనా?"

"ఎందుకని? అవసరం వుంటే తప్పక వస్తాను" అన్నాడు.

"అవసరం వస్తూనే వుంటుంది శేఖర్‌గారూ! మీ మిత్రుడి జీవితం గురించి కొంత బోధపడింది మీకు ఆయన ఇంకలేరు. కాని నేను ఉన్నాను. మీకిచ్చిన నవల నేను చదివాను; అందులో వున్న చాలా విషయాలు మా సంసారం లోవే. ఇన్నాళ్లూ మిమ్మల్ని ఆయనకళ్ళతో చూడలేక పోయాను. మొన్న రాత్రినుంచి అలాగ చూచుకోడం నేర్చుకున్నాను."

"అయితే?"

"అంతే. నేనొక మనిషిని కోల్పోయాను. కానీ నా లోకం ఇంకా ఉందని అనిపించింది. ఆరోజువరకు ఆయన ప్రపంచం. వసుంధర కూడా అందులో ఉన్నా నాకు కోపం రాలేదు. ఇప్పుడు..."

"ఊఁ?"

"ఇప్పుడు ఆయన ప్రపంచమే వేరని తెలిసిపోయాక, నాకు కష్టం ఒకమనిషిగాని, ప్రపంచం కాదని తెలిసింది.

శేఖర్‌గారూ! వెయ్యిమంది ఇవ్వలేని ఓదార్పు యీగుర్తింపు ఇచ్చింది నాకు."

"ఇదంతా నాకెందుకని మీరు చెప్పడం?"

"ప్రత్యేకమైన కారణం ఏమీ లేదు నిన్న రాత్రి మీరు చెప్పినది తప్ప. అయినా, ఇదేదీ రహస్యంగా వుంచాలనే ఉద్దేశ్యంలేదు నాకు."

పార్వతి మెట్లు దిగి వచ్చింది. ప్రత్యేకంగా పరిశీలించకుండానే ఆమె రాత్రి సరిగా నిద్రపోలేదని గ్రహించాడు శేఖర్.

ఆమె వచ్చి నిశ్శబ్దంగా శ్యామల ప్రక్కన కూర్చుంది. శేఖర్ లేచి తన గదిలోకి వెళ్ళిపోయాడు.

తన పని అయిపోయింది.

♦ ♦ ♦

ఊరు దాటి నెమ్మదిగా సాగుతోంది టాంగా.

"వసుంధరతో చెప్పవా గోపన్నా?"

వెనక్కి తిరిగి, "చెప్పాను బాబూ... కానీ, తనకోసం చూడక్కరలేదుట మీరు—అవి మీదగ్గరే వుంచమన్నారు."

కొంచెం ఆశ్చర్యపడ్డాడు శేఖర్—కాని అర్థం అయింది అతనికి. ఒకనాటి మధుర స్వప్నాలు సాక్ష్యాలు ఆమె ఉత్తరాలు. ఆ మధుర స్వప్నాలని తన చేత్తో నాశనం చెయ్యలేదు తాను, దాచుకోనూలేదు.

నెమ్మదిగా సాగుతోంది టాంగా.

రామాపురం చెట్లచాటుకి వెళ్ళిపోతోంది—టాంగా కొండమీదికి రోడ్డు ఎక్కినకొద్దీ అందం కనిపిస్తోంది ఆ చిన్న వూరు.

ఎండ కాస్తోంది తీవ్రంగా—కాని చెట్ల నీడలో ఎంతో చల్లగాఉంది.

సిగరెట్ వెలిగించుకున్నాడు శేఖర్.

ఆ వూరికి తాను దూరం ఔతూన్నకొద్దీ అతన్ని ఏదో విచిత్రమైన ఆనందం ఆవరిస్తోంది. రామం గురించి తలుచుకున్నా, అతని మనస్సు క్షణికంగా మాత్రమే బాధ పడుతోంది.

తన ఆలోచనల్లోకి వరసగా శ్యామలా, పార్వతీ, మనూ, ప్రొఫెసరూ, రఘూ వస్తున్నారు. తన ఆలోచనల్లోకి అక్కడి వూరు, ఆరోడ్డు, మధుకుంజమూ, దాని అవతల నదీ జ్ఞాపకం వస్తున్నాయి. వీటన్నిటినీ అతిక్రమించి రాజ్యం తన ఆలోచనల్లోకి వస్తోంది.

యూనివర్సిటీలో జాయిన్ అయింది. ఆమె రిసెర్చి చేస్తుంది. పగలల్లా పని చేస్తూ, సాయంత్రం ఏమిటి అనుకుం టుంది? తన ఫొటో ఆమె తన గదిలో పెట్టుకుంది. దాన్ని చూసినప్పుడల్లా ఆమెకి ఏం ఆలోచనలు వస్తాయి?

ఆమెఫొటో తానడిగి తీసుకున్న రోజు తనకి జ్ఞాపకం ఉంది. ఆముందరి రోజే తనకి ఉద్యోగం వచ్చింది. ఆర్డరూ

వచ్చి విశాఖపట్నంలో పోస్టుచేశారు. ఆమెతో చెప్పేందుకు వెళ్ళాడు.

"గుడ్! మళ్ళీ ఎప్పుడు దర్శనం ఇస్తారు?" అన్నది రాజేశ్వరి—ఎంతో తియ్యగా.

"మీరు కోరినప్పుడు—ఆజ్ఞాపించినప్పుడు" అన్నాడు తాను.

ఎలాగో, అలాంటి మధుర మధుర క్షణాలు జీవితంలో దొర్లిపోయినా, పదే పదే మనస్సులోకి వస్తుంటాయి. క్షణికంగా మనస్సులోని తమస్సుని పైకి పంపిస్తూ, క్షణికంగా కన్నీళ్ళని తుడిచి మళ్ళా తెప్పించుతూ...

ఆ సాయంత్రం ఇంటికి వెడుతూ, మీ ఫొటో పట్టుకు పోతాను నేను—ఆ టేబిల్ మీదది" అన్నాడు తాను.

మైలాపూర్‌లో ఆ ఇల్లూ, ఆ గదీ, ఆ టేబిలూ, దానిమిద ఆమెఫొటో తనకి జ్ఞాపకం ఉన్నాయి. ఏమిటో ఒకొక్క దృశ్యం కళ్ళలో ఉండిపోతుంది— మొన్న సాయంత్రం శ్యామల కన్నీళ్ళలాగ.

"ఎందుకని, నా ఫొటో మీకు?" అంది ఎంతో అందంగా, అమాయికత్వంతో తనని మోసంచేస్తూ, రాజ్యం.

"మీరు వచ్చి అది తెలుసుకునేవరకూను!" అన్నాడు తాను.

ఈ కొండల ఎత్తైన పచ్చదనం మధ్య, ఆ సెలయేరు నీలిమ ప్రక్క, అంతా ఆవరించిన ఈ ఏకాంతంలో, తాను, తన జ్ఞాపకాలలో అవన్నీ...

ఇవేళ రామాన్ని తలుచుకుంటే దుఃఖం రావడంలేదు తనకి. రాజేశ్వరి ఆలోచనలు కోపం తేవడం లేదు తనకి— గతించిన రోజున్నరా, తన జీవితంలో ఎంతమార్పు తెచ్చింది!

బ్రిడ్జి దాటుతోంది టాంగా. ఆనాడు తాను కూర్చుని సిగరెట్ కాల్చుకున్నచోటు జ్ఞాపకం వచ్చింది — వెను వెంటనే నిన్నరాత్రి తాను నది ఒడ్డున కూర్చోడం, ఆ కొద్ది కాలపు చీకటి ఆలోచనలు జ్ఞాపకం వచ్చాయి. తాను మారిపోతున్నాడా?

మళ్ళా ఆలోచనల్లో పడిపోయాడు శేఖర్—తనని గురించి తానంతగా ఎప్పుడూ ఆలోచించలేదో సిగరెట్ తరువాత సిగరెట్ కాలుతోంది. నిమిషం తరువాత నిమిషం గడచిపోతోంది.

టాంగా స్టేషన్‌లో ఆగింది. వాచీ చూసుకున్నాడు శేఖర్. రెండున్నర—రైలు రావడానికి ఇంకా సుమారొక గంట వ్యవధి ఉంది.

గోపన్నని పంపించి, ప్లాట్‌ఫారమ్ చివర చెట్టుక్రింద కూర్చుని సూట్‌కేసులోంచి రామం నవల మాన్యుస్క్రిప్టు తీశాడు శేఖర్.

♦ ♦ ♦

చదువుతూ చదువుతూ తలఎత్తి చూశాడు శేఖర్. ప్లాట్‌ఫారమ్ మీద హడావిడి ఏమీ లేదు. కానీ చూశాడు. టైమ్ మూడుంపావు ఐంది.

స్టేషన్‌మాస్టరు దగ్గరికివెళ్ళి, "బండి లేటా మాస్టారూ? అన్నాడు.

ఆయన తల ఎత్తకుండా, "వాల్తేరుబండి గంట లేటు, మదరాసుబండి రైట్‌టైము—అంటే ఇంకో అరగంటలో వస్తుంది." అన్నాడు.

మళ్ళీ వెళ్ళి కూర్చున్నాడు శేఖర్. నిజానికి ఇంక ఆ నవలలో తాను చదవాల్సింది లేదు. అందులో ఉన్నది శేఖరికి, రాజేశ్వరినీ...ఇంకో పేర్లతో. అన్నీ తమజీవితాలే— అందులోని సంఘటనలే.

కాగితాలు పెట్టెలో పెట్టి లేచి, సిగరెట్ వెలిగించాడు శేఖర్. తల తిరిగిపోతోంది. రామం ఇన్ని వివరాలతో తన జీవితాన్ని ఎలాగ రాయగలిగాడూ? తన మధ్యా రాజేశ్వరి మధ్య వచ్చిన ఈ అగాధం అతనికంత సూక్ష్మంగా ఎలాగ తెలిసింది?

చివర్ని తన జీవితంలాగే ఏమి చెయ్యాలో సూచించకుండానే ఈలోకం వదిలి వెళ్ళిపోయాడు రామం.

శిథిలమైపోయిన అభిమానాలమీద మళ్ళీ వాత్సల్యాల గోడలు లేస్తాయా? లేక ఈమనిషికీ ఆమనిషికీ మధ్య వచ్చిన ప్రవాహం వాళ్ళిద్దర్ని ముంచేస్తుందా?

ఏమో! ఏమో!

♦ ♦ ♦ ♦

ఇంకా అత నలాగ ఆలోచిస్తూనే ఉన్నాడు. అతనికి జ్ఞాపకం ఉంది—ఊర్లో మెడ్రాస్ పేసింజర్ కనపడింది. గంటకూడా కొట్టారు స్టేషన్‌లో.

తొందరగా స్టేషన్ మాస్టర్ దగ్గరికివెళ్లి "మద్రాసుకి ఒక సెకెండ్ క్లాస్ టిక్కెట్టు ఇవ్వండి" అన్నాడు.



పెట్టె ఖాళీగా ఉంది. అతను బెడ్డింగు తలకింద పెట్టుకుని, సీలింగుచూస్తూ, సిగరెట్ తీసుకున్నాడు. రైలు నెమ్మదిగా కదిలింది. చక్రాలు పట్టాలమీద కదులుతూ—

"ఈ ప్రశ్నకి జవాబు ఎవరు చెప్తారు?"

"నువ్వే—రాజ్యం!—నువ్వే" అంటున్నట్లనిపించిందతనికి.

— ఆంధ్రప్రభ - 29–6–60

# ఏకరక్తం

సంశయిస్తూనే అడిగింది శకుంతల, "అలాగ ఉన్నారేం?" అని. ఎదురుగా సముద్రపు కెరటాలు చిన్నపిల్లలమల్లే ఇసకతో ఆడుకుంటున్నాయి. అవతల నెమ్మది నెమ్మదిగా బయటికి వొస్తున్నాడు చందమామ. లేతవెన్నెలలో స్నానం చేస్తూ మిలమిలా మెరిసిపోతున్నాయ్ నీలినీలి కెరటాలు... ఏదో అనుభూతి... మధురస్వప్నంలాగా.

అవన్నీ అతను చూడటం లేదనికాదు. అరగంటనించి అతనలాగే చూస్తూ కూర్చున్నాడు. కాని, ఏదో బాధ... ఏదో ఆవేదన_ అతనిచుట్టు. తనవాళ్ళకి తెలిసేలాగ...

తన వ్రేళ్ళు అతని చేతిలోనే ఉన్నాయి. ఆ స్పర్శలోని మెత్తదనం ఎన్నో వాగ్దానాలు చేస్తున్నది. ఈ అందాలకి అతన్ని సాన్నిహిత్యం ఎంతో మెరుగు తెస్తున్నది. కాని...

ఇంత పరిపూర్ణతలో ఏదో లోటు—

ఇంతసేపూ ఆమె భుజాలని దూసుకుపోతూన్న అతని చూపులలో ఉన్న బాధనంతటినీ దాచుకుని, "ఏమీ లేదు శకుంతలా!" అన్నాడు.

ఒకసారి అతనివైపు చూసి తిరిగి ఎటో చూడసాగింది శకుంతల. ఏదో ఉందని తనకి తెలుసును. సముద్రం ఇంత అందంగా ఉండి, అతనంత నిర్లిప్తుడిగా ఉండడం ఎప్పుడూ లేదు.

"చందమామ బాగున్నాడుకదూ! ఎంత అందంగా నవ్వుతున్నాడో!"

"నాకు విడాకులిచ్చి వెళ్ళాడు."

"మీరు—"

"మరో తారని చేసుకుంటాను."

అట్లా అల్లరి చేసేవాడు— లేకపోతే, దూరాన్న కూర్చున్న మరో అమ్మాయిని చూపెట్టి "ఆమె ఎలా ఉందీ?" అనేవాడు.

"చాలా బాగుంది."

"అనవసరంగా తొందరపడిపోయాను నిన్ను చూసి—లేకపోతే—"

ఇలాగ సాగేది.

"శనగకాయలు కొందామా?"

"అవతల భోజనం"

"అట్లా అయితే నీవొంక చూడడం మానెయ్యాలి మరి."

ఇవాళ అతనేమీ అనలేదు.

అలాగే కూర్చుని "కోపం వచ్చిందా?" అన్నాడు కొంచెం ఆగి.

బాధగా చిరునవ్వు నవ్వింది శకుంతల.

"చెప్పండి..."

"......ఇవాళ శారద ఉత్తరం రాసింది."

ఒక్కసారి తృళ్ళిపడ్డది... శకుంతల ఆ విషయం తప్ప మరేమిటతన్ని బాధించినా బాధలేదు...కాని...

"ఏమని రాసింది?"

ముఖం ఎత్తకుండానే అడిగింది శకుంతల.

"ఇంటికి పోదాంపద."

♦ ♦ ♦

" — ఈ సెలవలకి ఇంటికి రావాలని ఉంది. తాతగారితో మీరు చెప్పి నన్ను తీసికెళ్ళండి. తమ్ముణ్ణి ఒకసారి చూడాలనివుంది."

ఉత్తరం సాంతమూ చదివి ఈ పంక్తులు మళ్లా చది వింది శకుంతల.

శారద

అదంతా పీడకలలాగ జరిగిపోయింది.

శ్రీపతికి రెండేళ్ళక్రింద భార్య పోవడమూ, అప్పటికి ఎనిమిదేళ్ళ శారదతో అతను ఒంటరిగాడై పోవడమూ హటాత్తుగా జరిగిపోయాయ్.

చిన్నప్పుడే శ్రీపతి పెళ్ళి అయింది. అతనికి ఇరవైపళ్లు రాకుండానే శారద పుట్టింది. అతని కామె అంటే ప్రాణం.

భార్యావియోగంతో చిన్న వయస్సులోనే అన్ని కష్టాలూ అనుభవించాడు శ్రీపతి. తినడానికి ఆస్తి ఉంది. చేస్తోన్న ఉద్యోగం ఉంది. కాని...

"నిజమే అన్నాళ్లు కాపురం చేశాక ఎంత కష్టంగా ఉంటుందో గ్రహించగలను." అన్నది తానారోజు అతన్ని పరామర్శించడానికి వెళ్ళి అప్పుడు తాను నిజంగా అతని అవస్థని చూచి జాలిపడ్డది. కాలేజీ వాదిలి ఇంటిలో కూర్చున్న కొత్తరోజులు జీవితం గురించి కొంచెం తెలుస్తూన్న మొదటి రోజులు...

ఆ రోజూ ఈ గదిలోనే కూర్చున్నారు. చీకటి పడుతోన్నా లైట్లు వెలిగించలేదు. లేచి వేద్దామని తనకీ అనిపించ లేదు. ఆ ఒంటరితనంలో, శూన్యతలో, ఒళ్ళంతా నీరసించి నట్లయిపోయింది మనసుతో బాటు.

"ఆమె చాలా మంచివారు కూడా" అన్నది తాను.

ఒక్కసారి తన వొంకచూసి "నిజం చేప్పేదా శకుం తలా? నా బాధ అదికాదు" అన్నాడు శ్రీపతి.

తెల్లబోయి చూసింది తాను.

"ఈ పరిస్థితీ, భార్యపోయిందనే నిజమూ నాకు బాధ కాని_ ఆమె పోయిందని కాదు."

అతను ఎందుకలాగ అన్నాడో తనకి అంతుచిక్కలేదు. అతనికి భార్యమీద గొప్ప అనురాగం ఉందనీ, ఆ విరహం అతన్ని బాధిస్తోందనీ తా ననుకోలేదు. కాని ఆ విషయం అంత సూటిగా చెప్పడం.

"అందరూ ఏమనుకున్నా, మీసంగతి నాకు తెలుసును. అందుకని, నీ దగ్గర నేను అసత్యం చెప్పదలుచుకోలేదు."

అతని తత్వమే అంత... చెప్పదలుచుకున్నది వీలైనంత మెత్తగా, నిజంగా చెప్పడం.

ఆ సూటిదనంతోనే ఆరు నెలల తరువాత తనని అడి గాడు... పెళ్ళిచేసుకుంటానని.

అతనంటే తనకి గౌరవం. భార్యగా తాను త్వరలోనే అలవాటు పడగలదని తనకి తెల్సును. కాని...

"నీ ఆలోచన నాకు తెలుసును శకుంతలా. ఆ పెళ్ళి నాటికి నాకు జ్ఞానం రాలేదు. ఈ నాడు నీతో నిన్ను ప్రేమిస్తు

న్నానని చెప్పగలను. మా ప్రణయం బలవంతంగా తప్పనిసరి అయిపోయింది. ఈ రెండిటికీ చాలా తేడా ఉంది.

తనకి తెల్సును. అతని మనసు తనకి తెల్సును. తన మీద ఉన్న అభిమానం విషయంలో తనకి అనుమానంలేదు కాని...

"పూర్వపు జీవితాన్ని గురించి తలుచుకుని ఏడుస్తూ నీ బ్రతుకు పాడుచెయ్యను శకుంతలా! ఎంత అమానుషమని నువ్వు అనుకున్నా, నీ దగ్గర నేను నిజం దాచలేదు. నాకూ ప్రణయానికి అంత దూరంలేదు. నీ మీద ఉన్న అనురాగం నాకూ నీకూ కూడా సుఖాన్నిస్తుందని." అతను నిజం చెప్తున్నాడని తెలుసును కాని...

"అతనికి శారద అంటే ప్రాణం శకుంతలా! ఆ అమ్మాయిని చూసినప్పుడల్లా మీ ఇద్దరూ బాధపడతారు. నువ్వు నిజమైన భార్యవి కావొచ్చు. నీ కలలూ, వయసూ అలాటివి. కాని, ఆమెకి నువ్వు నిజమైన తల్లివి కాలేవనుకుంటాను."

అట్లా అన్నది విశాల... అంతా విని.

అదీ నిజమేననిపించింది. తన అంతరాంతరాలలో తనకి అతనిమీద రాబోయే హక్కులో పెద్దభాగం ఆ చిన్న పిల్లకి ఉంటుందని అనిపించిన బాధ ఈ మాటలతో వెలికి వచ్చింది. ఎంత పెద్ద త్యాగమైనా చేసి ఆతని భార్యకావాలని తా ననుకోలేదు—కాని...

చిస్తూ లోపలికి నడిచాడు శ్రీపతి. ఈ సాహచర్యంలో సప్త పాదాలూ తన యాజమాన్యంలో వేయించాలనుకున్న నిర్ణయం అనవసరం అయిపోయింది.

మరో అరగంటదాకా శకుంతలా, శారదా, తనకి కనబడనూ లేదు. ఆతరవాత శారద నెమ్మదిగా గదిలోకివచ్చి, "ఆవిడని ఏమని పిలిచేదినాన్నా?" అన్నది.

ఏమీ తోచక—"ఆవిడనే అడుగమ్మా!" అన్నాడు.

"అడిగాను నాన్నా మిమ్మల్నే అడగమన్నారు."

ఒక్కసారి తెలివి వొచ్చింది తనకి...శకుంతలా! అనుకున్నాడు. శారద తనభార్యని ఏమని పిలవాలి?

"అమ్మా అని పిలూ అమ్మా...మీఅమ్మేగా!"

కొంచెం ఊరుకుని—"తమ్ముడేడీ నాన్నా?" అన్నది శారద.

"నిద్రపోతున్నాడమ్మా...పద చూద్దాం."

బయటికి వొచ్చేసరికి శకుంతల ఎదురైంది. ఆమె ఆ సంభాషణ విందని శ్రీపతి అనుకోలేదు.

"దానికి తమ్ముణ్ణి చూపమంటోంది." అన్నాడు శ్రీపతి. ఈ అమాయికపు బంధాలని బలపరచడం తనకేదో నేరం చేస్తోన్నట్లుంది. కాని...కాని...

"నన్నడిగితేనా!" అంది శకుంతల.

"తమ్ముడేడమ్మా?"

♦ ♦ ♦

మొదట శారదకి ఈ చిన్నవాడి సంగతేమీ నచ్చ లేదు. వాడు తనదగ్గరకి రాలేదు...ఎత్తుకుంటే ఏడ్చాడు... అమ్మ తీసుకుంటే ఊరుకున్నాడు.

తెల్లబోయింది శారద.

ఆమె బాధ చూసి– "రేపు నీదగ్గరికే వొస్తాడమ్మా–చిన్నపిల్లలలాగే..." అన్నది శకుంతల.

ఆరోజంతా శారద వాడిని ఎలాగో అడించే ప్రయత్నంలోనే ఉంది. సాయంత్రం ఒక్కసారి వాడు తనదగ్గర ఉండి ఆడుకున్నాడుకూడా.

పెద్ద విజయంమల్లే చెప్పింది శారద. రెండురోజుల్లో వాళ్ళిద్దరూ పెద్దస్నేహితులైపోయ్యారు.

"తమ్ముడెలాగ ఉన్నాడమ్మా?"

ఎన్నోసార్లు ఆపుకుంది—కాని...

"మంచి బాగున్నాడమ్మా! మంచివాడు."

ప్రక్కనించి వింటున్నాడు శ్రీపతి. తేలికగా నవ్వు కున్నాడు. కాని, అతను శకుంతల కళ్ళవొంక చూడలేదు.

శారద తండ్రిదగ్గరికి ఎప్పుడో పిలిస్తేగాని వెళ్ళదు. ఆమెకి సర్వస్వం చంటివాడు. వాడి బట్టలూ, వాడి శుభ్రతా,

వాడి సుఖ దుఃఖాలు, వాడి షికార్లు, నిద్దరా అన్నీ ఆమెవి. తరతరాలనించి స్నేహితుల్లాగ, దగ్గర అయిపోయారు వాళ్లు.

ఏదో ఒప్పందంలాగా, ఆ విషయం తమమధ్య ప్రస్తావించుకోలేదు శకుంతలా, శ్రీపతిని. కాని, శారదపట్ల శకుంతల చూపే అభిమానం రోజురోజుకీ హెచ్చవుతూందని శ్రీపతికి తెలుస్తును.

"పోనీ దానికి సెలవులైనా ఆనందంగా గడచాయి" అనుకున్నాడు శ్రీపతి.

అట్లాగే అయిపోయాయి సెలవులు. శారదని తీసికెళ్ళడానికి తాతగారు రావడంతో ఒక్కసారి ఇంటి పరిస్థితి మారిపోయింది.

ఆరాత్రి శకుంతల మరీ మౌనంగా ఉండిపోయింది. ఆ రోజంతా శారద చంటివాడిని ఒదిలిపెట్టలేదు.

అన్నీ తలుచుకుని "ఎల్లుండి శారద వెడుతుంది_" అన్నాడు శ్రీపతి.

ఏం చెప్పాలో తోచక, శకుంతల— "సెలవులైపోయాయా?" అన్నది.

"ఆఁ..."

మళ్లా ఇద్దరూ ఊరుకున్నారు. తిరిగి శకుంతల "దానికి వెళ్ళిపోవాలని ఉందా" అన్నది.

ఇంక ఎటూ సంభాషణ నడిచే అవకాశం లేదని గ్రహించుకున్నాడు శ్రీపతి. ఆమెని తనవైపు తిప్పి—"ఉన్నది సూటిగా చెప్పుకోవడం మనకి అలవాటు. దాన్ని ఇక్కడ ఉంచెయ్యాలని నా ఉద్దేశంకాదు—నీకూ తెల్సును" అన్నాడు.

తన మెదడుకన్న హృదయమే ఎక్కువగా మాట్లాడించింది శకుంతలని "అవును—కాని, దాన్ని పంపించివెయ్యడం నాకు ఇష్టంలేదు" అన్నది.

"ఎందుకని?"

కష్టంగానే అన్నాడు శ్రీపతి. ఆ ప్రశ్న తాను వెయ్యకూడదు—కాని... కాని...

"అప్పుడు పొరపాటు చేశానని నాకు తెల్సును. ఒప్పుకోడానికి నాకు చిన్నతనమూ లేదు. ఆ పరిస్థితులు అలాంటివి" అన్నది శకుంతల.

"నిన్ను నేను తప్పుపట్టడంలేదు శకుంతలా—కాని, ఇలాగ సాగుతోన్న ఏర్పాటు మార్చాలని నాకు లేదు. నా మీద నీకూ, నీ మీద నాకూ హక్కులు ఉన్నాయి. నిన్ను దూరంచేసుకోలేను శకుంతలా!"

నీరసంగా కూర్చున్నది శకుంతల. ఈ పరిస్థితిలో ఎన్ని రహస్యద్వారాలున్నాయో ఆమెకిప్పటిదాకా తెలియలేదు. ఈనాడు తనకి వొచ్చిన మహత్తరమైన ఈ మధురానుభూతిని శాశ్వతం చేసుకుందామని తాననుకున్నది. కాని ఇన్ని అడ్డంకులు—

"మీతో వాదించనని మీకు తెల్సును-కాని, ఇప్పుడు శారద నా పిల్ల. అది ఇక్కడే ఉంటుంది. అదీగాక చంటి వాడు దానికోసం బెంగపెట్టుకుంటాడు."

చివరిమాటతో జ్ఞానోదయం అయింది శ్రీపతికి. ఒక్కసారి శారదా, వాడితో ఆమె సాహచర్యమూ, ఆ వెనుక శకుంతలా- అందరి పరిస్థితులూ తనకి బోధపడ్డాయి.

కాని, తానెక్కడ?

"నీకోసం అని తాతగారు వొచ్చారమ్మా- బడి తెరిచారు" అన్నాడు శ్రీపతి.

తల వొంచి నిలబడ్డది శారద. ఒక్కసారి నోరు చేదెక్కినట్లయింది శ్రీపతికి.

"వెళ్ళాలని లేదా అమ్మా?"

నెమ్మదిగా దగ్గిరగా తీసుకుని అడిగింది శకుంతల.

తెల్లబోయాడు చూస్తోన్న తాతగారు. ఇన్నాళ్ళనించీ ఆయన ఈ పరిస్థితిని గురించి ఆలోచించనేలేదు.

తాతగారు ఒక్కరూ ఉండలేరమ్మా! నువ్వు వెడితే నేను అస్తమానం వొస్తాగా!"

శారద మాటలాడలేదు. తాతగారూ మాటలాడలేదు. ఆ నిశ్శబ్దంలో సాలెపట్టుమల్లే వివిధ భావాలూ, బాధలూ వాళ్ళందరినీ పెనవేసుకున్నాయి.

లోపల ఉయ్యాలలో పడుకున్న చంటివాడు లేచి ఏడవసాగాడు. ఒక్కసారి పరిగెట్టింది శారద. వాడు ఊరుకునే దాకా శకుంతల అటే చూడసాగింది. అందరూ...

ఏదో చేసి వాడిని నవ్విస్తోంది లోపల శారద. కళ్ళు తుడుచుకుని గదిలోకి నడిచింది శకుంతల.

బాధగా మామగారి వంక చూసి నిశ్శబ్దంగా బయలు దేరాడు శ్రీపతి.

రుద్ధకంఠంతో "పదిగంటల రైలుకి వెడతాను బాబూ, ఇంట్లో ఎవ్వరూలేరు. టాక్సీని పిలూ" అన్నాడు వృద్ధుడు. శ్రీపతి తొందరగా నడిచాడు బయటికి.

లోపల శారదా, తమ్ముడూ మరీ గోలచేయ సాగారు, వృద్ధుడు ఇవతలి వరండాలోకి వొచ్చి నిలబడ్డాడు ఒక్కడూ. ఆయన కళ్లు తుడుచుకోనేలేదు.

— తెలుగు స్వతంత్ర, 31-8-56

# సాంధ్యరాగంలో సావిత్రి

అసలీకథ నీతోనే చెప్పాలనుకున్నాను.
కానీ, నువ్వు వెళ్ళిపోయావు నాకు కనపడకుండా.

♦ ♦ ♦

బావనీ, అక్కయ్యనీ ఒకసారి చూసిపోదామని వొచ్చాను ఆ వూరు. ఓ విధంగా, అదే నాకు రెండు సంవత్సరాల కష్టం తరువాత విశ్రాంతి. రోజూ ఏడుగంటలు ఆఫీసులో కూర్చొని ఆ కాగితాలతో బాధపడుతూ ఒక్కవారం విశ్రాంతి లేకుండా ఇరవైనాలుగు నెలలు గడిపేను—ఇక విశ్రాంతికోసం మనస్సు ఆరాటపడింది.

రెండూ కలిసివొస్తాయని మీ వూరు ఎంచుకున్నాను. వాళ్ళకన్న ఆప్తులు లేరు—ఆవూరూ చక్కగా అడవి అంచున

చిన్న కొండలమధ్య ఉంది. గోలచెయ్యాని రైల్వేస్టేషను. చిన్న చిన్న దుకాణాలు. నిజంగా ప్రశాంతంగా ఉండే సాయంత్రాలు. నిశ్శబ్దంగా కూర్చుని చదువుకోడానికని నాకు మేడమీద గది. అన్నీ ఉన్నాయి, రమ్మని రాసింది అక్కయ్య. సెలవుతీసుకుని బయలుదేరేను.

ఉదయం ఏడున్నరకి ఆ చిన్న స్టేషనులో దిగిపోయాను. అంతా ఏదో వింతగా కనిపించింది. ఎందుకాగిపోయిందో తానే అనుమానిస్తోన్నట్లు తెల్లబోయి నెమ్మదిగా వెంటనే సాగిపోయిందిరైలు. నాకోసమని రైలుకి బండీ పంపేరు మావాళ్ళు. బావ పదిలోపున లేవడుగా!

ఊరికీ స్టేషనుకీ చాలా దగ్గరే. ఒక్క మైలుకన్న ఉండనే ఉండదు. చెట్లలో కనిపించక కాని, అంతా ఒకటే చోట ఉన్నట్లుంది.

రాత్రంతా బాగా నిద్రపోయానేమో, ఉదయాననుంచి హాయిగా వుంది. ఆ గతుకుల బాటలో ప్రతి అంగుళాన్నీ, అంగుళంలో ప్రతీ గతుకునీ లెక్కవేసుకుంటూ సాగిపోతూంది బండీ. అయినా నాకు చిరాకు వెయ్యలేదు. చెట్లనీడల్లో చల్లటి గాలితగిలి వొంటిగా క్రొత్తజన్మ వొచ్చినట్లనిపించ సాగింది. చుట్టూ చిన్నచిన్న కొండలు, ఊరికి చేరేలోపున మూడు చిన్ననదులు దాటేం. అంతా ఏదో విచిత్రప్రపంచం లోకి జారిపోయినట్టు ఉంది. చిన్నపిల్లాడిలాగ మనసులో ఆనందం ఉరకలు వెయ్యసాగింది.

అప్పటికి నిన్ను గురించి నాకేం తెలుసు, సావిత్రీ? నేను మానసిక విశ్రాంతికోసమే అక్కడికి ఒస్తున్నా ననుకున్నాను. ఆ చెట్లనీడల్లో, సెలయేర్లల్లో, ఈ కొండల్లో తిరిగి మళ్ళా కొంతకాలం మానవుడిగా అయిపోదాం అనుకున్నా గాని, అక్కడ నా జీవిత రహస్యం, నానుంచి దాగిన నా నిజం, నువ్వు బయటపెడతావనీ, ఆ తలుపులు తెరచినందుకు నువ్వూ, ఆ ద్వారాలూ నావైనందువల్ల నేనూ నిప్పుల్లో స్నానం చేస్తామని నేను ఎలాగ కలగనేది! నీ పేరేనా నాకు తెలీదు సావిత్రీ—ఆ ఉదయం!

రాబోయే నెలరోజుల ఆనందాన్ని గురించి ఎన్నెన్నో ఊహించుకున్నానుగాని, నా జీవితంలోకే హృదయం ఉన్న అమ్మాయి వొస్తుందని నాకు తట్టలేదు. అక్కడ కొండలూ వదులూ మాత్రమే నాకు తెలిసినవి—అప్పటికి.

♦ ♦ ♦

అక్కడికి వొచ్చిన మూడోరోజు సాయంత్రం షికారుగా బయలుదేరేను—ఆ రోజు ఉదయం నువ్వెందుకనో మా ఇంటికి వొచ్చావుట.

"పాపం! ఆ అమ్మాయి బ్రతుకంతా గంగలో కలిసిపోయింది!" అన్నది అక్కయ్య నిన్ను తలుచుకుని.

"ఏం?" అన్నాను—ఎంతో మూర్ఖంగా.

"పెళ్ళిపీటలు దిగకుండా భర్త పోయాడు" అన్నది.

"తిరిగి పెళ్ళి చేసుకోలా!" అని అడిగేను—మనసులో నీ రూపం ఊహించుకుంటూ. నువ్వెలా ఉంటావో ఆ క్షణంలో తెలిసిపోయింది.

"లేదు."

మరి ఇంక నిన్ను గురించిన ఆలోచనలు సాగలేదు. ఏదో పాట రేడియోనించి వింటూ అలా నిన్ను వొదిలేశాను.

సాయంత్రం ఆ గుట్టకి అవతల తోటలోంచి వెడుతోన్న ఏరు వొంపులో కూర్చుని తిరిగి నా ఆలోచనలలో పడ్డాను. కొంచెం సేపయాక హఠాత్తుగా కొంచెం అవతల నీళ్ళు కదిలిన చప్పుడై నువ్వు కనిపించావు.

అప్పటిదాకా నన్ను నువ్వు చూడలేదు, నువ్వెవరో నాకు తెలీదు.

తెల్లబోయి నువ్వు నా వొంక చూశావు.

బాగా జ్ఞాపకం ఉంది. నీ నీడని నీటిలో చూసుకుంటూన్నట్టు వొంగి నీటిలో సాగిపోతోన్న కర్రముక్కల వేపూ అక్కడా, నృత్యం చేస్తోన్న సుడులవేపూ నువ్వు చూస్తూ ఉండి ఉండి ఒకరాయి విసిరావు. అదే శబ్దం.

ఎండ నీమీాద పడలేదు. అందుకని నువ్వు ఎండిపోయిన కళ్ళతో ఆలోచిస్తున్నావో, ఆలోచిస్తూన్న కళ్ళతో ఏడుస్తున్నావో నాకు తెలీలేదు. కాని, ఆ ఏకాంతపు బరువు భరించలేక నీ దుఃఖాలు నీ నుంచి ప్రవహిస్తోన్నట్లూ, ఆ బరువుతో నువ్వూ ఆ వాహినిలో పడిపోయినట్టూ అనిపించింది.

నాకు. మెరుపుమల్లే తెల్లటి మేఘాలమధ్య నల్లటి విద్యుల్లత మెరిస్తే ఎట్లా ఉంటుందో! అలాగ అనిపించావు నువ్వు.

ఒక్కసారి నా గతమే నాకు జ్ఞాపకం వొచ్చింది, సావిత్రీ! అందుకనే ఆ క్షణంలో నీ చీకటి మెరుపు నాకు ఎంతో అందంగా కనిపించింది. ఒకప్పుడు నేనూ ప్రేమించ గలిగాను...ఆమె వెళ్ళిపోతూ ఒక క్షణం నాకు దొరికింది— ఆకాశం నించి జారిపోతూన్న నక్షత్రంలాగా ఆ ఒక్క క్షణం నా జీవితంలో ఉన్న అత్యుత్తమ క్షణం అయిపోయింది. కాలం బలవంతాన లాగేస్తోన్నా, మరీ బలంగా ఆ క్షణాన్ని హృదయంలో దాచుకుని పెనుగులాడుతోన్న నాకు నువ్వా నది ప్రక్కన నా హృదయంలోనించి నడిచి వెళ్ళి అక్కడ కూర్చున్న సావిత్రివై పోయావు.

జ్ఞాపకం ఉందా? ఒక్కసారి కుదించుకు పొయ్యావు.

అప్పటికీ బాగా మత్తెక్కిపోయి, గాలిబుడగమల్లే అయిపోయిన నాకు నీ అసహ్యం, అనుమానం కనిపించి ఒక్కసారి దిగజారిపొయ్యాను.

కాని, ఏం చెయ్యనూ?... నీ నల్లటి కళ్ళ వెనకాల ఉండిపోయి గడ్డకట్టుకున్న బాధ నాకు తెలుసు...నీ కళ్ళల్లోకి చూడకుండానే, ఆ నీడలోనే నిన్ను చూసి ఆ విషయం అర్థం చేసుకున్నాను. ఏమనుకున్నావో నాకు తెలీదు. ఏం చెయ్య దలుచుకున్నావో నాకు తెలీదు. అట్లానే నీ వొంక చూస్తూ ఉండిపోయాను. నువ్వు కోపంగా నదివైపు చూస్తూ అలాగే

కూర్చున్నావు. నది తనదారి తాను వెతుక్కుంటూ సాగిపోతూంది.

కొంచెంసేపు నిన్ను చూశాక ఇంక అనుమానమే లేకుండా తెలిసిపోయింది సావిత్రీ!... ఎప్పుడో విడిపోయిన మనం మళ్ళా కలుసుకున్నాం అని. నువ్వేమంటావో అనే ఆలోచనే రాలేదు నాకూ— లేచివొచ్చి నీ ప్రక్కన కూర్చున్నాను. అందుకే ఎదురు చూస్తోన్నట్లు.

చాలాసేపు నువ్వు మాటలాడలేదు. అసలెన్నటికీ మాట్లాడవేమో ననుకున్నాను. ఏదో నేరంచేసి నీకన్యాయం చేసినట్టూ, నీకు కోపం వచ్చినట్టూ అనిపించి మరీ బాధ పడ్డాను.

"మీరెవరు ?" అన్నావు, ఆలోచనగా, బాధగా.

నేను నవ్వుకున్నాను...ఏడవలేక. ఆ కొద్ది నిమిషాలా మన పరిచయం జన్మజన్మల స్నేహమైపోయి, తరతరాల ప్రణయమైపోయి ఆ సముద్రంలో ఈదుతోన్న నన్ను గాలంతో వెలికితీసి పరీక్షిస్తోన్నట్లు ఒక్కసారి నా చేతుల్లోంచి నడిచి వెళ్ళిపోయి నువ్వు తెలివి తెచ్చుకున్నట్లు... నాకు దూరం అయిపోయి, నాకు నన్నే శత్రువుగా చేసేశావు. ఇంక ఏం చేసేదీ !

ఆరోజింక బ్రతకాలనిపించలేదు.

నా మనసు విడమరచి చెప్పాలనుకున్నాను. నా గుండెలలో మండుతోన్న వేడి; నీ హృదయంలో ఏదో దావానలం

మనకన్న సన్నిహితు లెవరని ! నీకు నేను రక్షకుణ్ణి; మిత్రుణ్ణి; అన్నీ...అంతా. ఆ తాపంనించి నిన్ను తప్పించమని ఎవరో వొప్పగించిన అమూల్య ప్రాణానివి నువ్వు...

ఆ ఆలోచనల మబ్బుల్లో నన్ను వొదిలేసి సుడిగాలి మల్లే చివాలున లేచి వెళ్ళిపోయావు. నువ్వట్లా చీదరించుకుని వెళ్ళిపోతూంటే ఎన్ని మృత్యువులో నన్ను గుచ్చుకున్నాయి... స్తబ్ధున్నై పోయి కదలలేక పోయానుగానీ, ఆలోచనల్లో నీ కాళ్ళకి చుట్టుకుని నా మనస్సులోని వ్యథల సంకెళ్లు వేసి నిన్నా సుందర పరిసరాలలో ప్రతిష్ఠించుకున్నాను. నా కథ అంతా చెప్పాను... నా మనసులో ఉండిపోయిన శిథిలాలతో ఇల్లు కట్టి నిన్నందులో దాచుకున్నాను... కానీ, ఏం చేసేదీ ?... నువ్వట్లా వెళ్ళిపోయావు ఆ రోజు—

ఇదంతా ఎందుకని నీతో చెప్తున్నానో !

అయినా ఆ రోజు ఎట్లా గడిపానో నీకు చెప్పను. ఆ సాయంత్రం మనసు వెయ్యిబలాలతో నన్ను మళ్ళా ఆచోటికే తీసికెళ్ళబోయింది. కాని, హృదయం బుద్ధి చెప్పి నన్ను కదలనీయకుండా చేసింది. అట్లానే ఊగులాడుతూ ఉండిపోయాను. కాని...

అదంతా నీకు తెలిసిందే. పిచ్చిగావొచ్చి నీకు ఈ వేదనల నిప్పుల్లో కరిగిన నా మనస్సుని చూపాలని ఆత్రుత. అంతే చేశాను. ఈ రోజు ఆ సంభాషణ నాకు జ్ఞాపకం ఉంది పూర్తిగా. కానీ, అంతకన్నా, నీ కళ్ళవెనకాల దాగిన ఆ దుఃఖం పూర్తిగా గమనించి ఒక్కసారి నా జీవితం తిరిగి నాకు

వొచ్చినంత ఆనందపడ్డాను... నీకూ తెలుసు సావిత్రీ... నీ దుఃఖం చూసికాదు...మన సన్నిహితత్వం చూసి నా దగ్గరగా నువ్వు వొచ్చావని.

ఆ రోజు మనం వొదిలి వెళ్ళలేకపోయాం ... మరిచిపోయావా?

♦ ♦ ♦

అట్లానే మనం మరీ దగ్గరగా వొచ్చివొచ్చి కలిసిపొయ్యాం...నీ మనసంతా నాకు తెలుసు, నా మనసంతా నీకు తెలుసు. ఈ అనుభవాన్ని ఎంతో విలువతో, ఆప్యాయంగా దాచుకున్నాను నేను. క్షణక్షణమూ నిన్ను తలుచుకునేవాడిని...నీ ఆలోచనలు నాకు తెలుసు...నా ఆలోచనలు నీకు తెలుసు...

సాయంత్రాలు మనం నిశ్శబ్దంగా కూర్చుని, వెళ్ళిపోయేవాళ్ళం. ఏమీ మాట్లాడుకోనేందుకు మిగలనూ లేదు; అక్కరా లేదు.

కాని, యిప్పుడు నీతో నేనే చెప్పుకుంటున్నాను సావిత్రీ! కొద్దిరోజుల తరువాత అట్లానే కూర్చోలేక పొయ్యావు.

హఠాత్తుగా నవ్వావు. సముద్రపు నురగల మాలి కలలాగా ఎందుకనో!

నేను తృళ్ళిపడి నీవొంక చుశాను. నా తత్తరపాటు చూసి నువ్వు మరీ నవ్వసాగావు.



"ఏమిటది?" అని నిన్నడగలేకపోయాను.

కొంచెం సంబాళించుకుని, "ఏం మనుషులం?" అన్నావు, విచిత్రంగా. ఎందుకనో ఆ క్షణం ఎంతో పవిత్రమైన దైవాలయంలోనించీ ఒక్కసారి పానశాలలోకి జారి నృత్యం చేస్తోన్నట్లనిపించావు నువ్వు నాకు.

"ఎందుకనీ ఇట్లా కూర్చోడం?" అన్నావు.

నీకేదో గాలిసోకిందనిపించింది నాకు. నీ అగాధ ప్రశాంతతా, దానిక్రింద ఆ బడబానలం, ఆవేదనల నిశ్చలత్వం—అన్నీ నశించిపోయి ఒక్కసారి నీ తరంగాల సంచలనంలో ఈ అందాల నురుగులని మాలికలుచేసి, వాటితో అలంకరించే ప్రియుడికోసం. వెతుకుతోన్న ట్లనిపించావు నువ్వు నాకు.

ఏమో చెప్పావు నాకు...

అక్కడా అక్కడా జ్ఞాపకం ఉంది.

నామీద నీ అభిమానాన్ని వ్యక్తపరిచావు. నీ చీకటి తెరలని తొలగించా నన్నావు. నీ గత దుఃఖాల చిన్నెలు నీగాద్గదిక కంఠస్వరంలో అప్పుడూ అప్పుడూ ప్రతిఫలించినా, వెనువెంటనే ఆ దుఃఖాలు తొలిగిపోయిన సంతోషం నీమాటలకి ఏదో తేలికదనాన్ని ఆపాదించింది. అప్పటిదాకా నాహృదయంలోనే వాడిన ప్రతీ మాటనీ నువ్వు వ్యక్తపరిచిన ప్రతీ ఉద్దేశాన్నీ అమూల్యంగా దాచుకొంటున్న నా చెవులనించి ఈ మాటలన్నీ తేలిపోయి తప్పించుకుని వెళ్ళిపోసాగాయి.

నీకు నూతనంగా ఏమి దొరుకుతుందో తెలీదు.

కాని నాకు దొరికిన ఒక్క మనసూ జారిపోయింది నా చేతులు సున్నితపు పట్టు విడిపించుకుని.

నీ ఆనందంలో, నీ హృదయపు తేలికదనంలో నేను పాలు తీసుకోలేకపోయాను. నువ్వు చిన్నబుచ్చుకున్నావు. అది ఎంత దాచినా దాగదు.

♦ ♦ ♦ ♦

ఆ తరువాతా నువ్వక్కడికొచ్చి కూర్చుంటావని నాకు తెలుసును... కాని, నేనే పిరికివాడినయి అక్కడికి రాలేక పోయాను. నీకు తెలియకుండా చెరువునించి వచ్చేటప్పుడూ, మా ఇంటికి వొచ్చేటప్పుడూ నిన్ను చూసేవాడిని. ఆ సాయంత్రపు సావిత్రి నీలోనించి త్వరగా మాయం అయిపోయింది: నువ్వు విలాసవతివి; నువ్వు సౌందర్యవతివి; నువ్వు యువతివి; కానీ నాకు కావలసిన సావిత్రి నీలో లేదు.

ఆమెకోసం ఇంక వెతకగలనని నాకు తెలీదు. అందుకనే నీ దగ్గరకి రాలేకపోయాను.

అట్లా కొంచెం రోజులయ్యాక నువ్వు పెళ్ళికూతురు వయ్యావు.

♦ ♦ ♦ ♦

ఒక్కసారే అయినా, జీవితంలో నాకు హృదయం ఉన్న ప్రయోజనం చేకూర్చావు నువ్వు. పాతుకుపోయిన

బురదలలోనించి క్షణికంగానే అయినా వెలికి తీశావు నన్ను. తిరిగి నా చేతులలోనించి జారిపోయినా, నా మనసుకి ఎంతో దగ్గరగా వొచ్చావు నువ్వు. ఇప్పుడు పూర్తిగా అపరిచితులమే ఐనా కొంచెం క్షణాలు నా మనసులో నీ హృదయం ఆలోచించింది; నీ హృదయంలో నా మనసు విశ్రాంతి తీసుకుంది.

ఆ కొద్ది సుఖం దాచుకోలేక ఆ సాయంత్రం వొచ్చి కూర్చున్నా నక్కడ...ఆ ఏటి వొడ్డును నిప్పుల మధ్య నిప్పులు పోస్తే బాధ ఎవరికని! నేను నీ తలపులతో నాకేదో అపకారం జరిగిందని బాధపడలేదు. కానీ, నీ నుంచి నువ్వెంత దూరంగా వెళ్ళిపోయావో తలచుకొని బాధ పడ్డాను.

ఆ సంజవేళ అక్కడికి నువ్వెందుకని వొచ్చావో !

నీతో ఎవ్వరూ లేరు. కాని, ఏదో పెద్ద సమూహంతో వొచ్చి నాతో కలహించేందుకు సింసిద్ధవైనట్లు భయపడిపోయాను నేను. నీ కళ్ళలో అసహ్యం లేదు; భయమూ లేదు. కాని నీకెంతో కోపం వచ్చినట్టు హడలిపోయాను నేను. అట్లానే నిలబడ్డావు నువ్వు నావొంక చూస్తూ. నీలో వచ్చిన మార్పుకి నిశ్చేష్టుడినై పోయి మూగినయి పోయాను నేను.

ఇదంతా నీతో చెప్పాలని తహతహ. కానీ! నోరు తిరుగదు. మాట రాలేదు. కదలలేక పోయాను. అట్లనే ఉండిపోయాము మనం.

అప్పుడు—నువ్వు వెళ్లిపోయావు...మలయానిలంమల్లే. అప్పుడు కూడా నేను పిలవలేకపోయాను.

♦ ♦ ♦ ♦

నువ్వేమనుకుంటున్నావోనని నా బాధ...
ఉన్నది చెప్పి తేలిక పడాలని కోరిక.
అందుకనే అసలిదంతా నీతోనే చెప్పాలనుకున్నాను-
కానీ, సావిత్రీ!, నువ్వు వెళ్లిపోయావు—కనపడకుండా.

—తెలుగు స్వతంత్ర, 6–4–1956

# నీటిమీద దీపాలు

"మగవాళ్లు మరీ అనుమానం మనుషులు—"

"అలాగేం?—ఆడవాళ్లు మరీ అబద్ధాలకోరులు—"

"ఈ కథలో మగవాళ్ళ అనుమానాలకన్న ఆడవాళ్ళ అబద్ధాలు చాలా తక్కువగా ఉన్నాయి లెండి—"

"పైపైని చదివితే అట్లా అనిపిస్తుంది—అసలు సంగతి రెండోదేనని తెలుస్తూనేఉంది...అయినా, ఎక్కడిదాకానో ఎందుకు? మనం ఉన్నాంగా — మగవాళ్ళం, ఆడ వాళ్ళమూను—"

"మీరూ నేనూనా?—మనకు రెండు ఉదాహరణలు ఎటా దొరుకుతాయి?"

"ఒకటైనా దొరికిందిగా!"

"ఆఁ...మగవాళ్ళ అనుమానాలను ఋజువు చెయ్యడానికి...మరి రెండోదో?"

"నువ్వా ఉన్నావుగా!"

"నేనా?"

"అవును—"

"నేను అబద్ధం ఎప్పుడూ ఆడలేదు—"

"అట్లా అయితే, నే నెప్పుడూ అనుమానమూ పడలేదు—"

"ఇంతకన్న పచ్చి అబద్ధం ఏ ఆడదీ ఆడదు, ఆడలేదు!"

"సామాన్యంగా అంతే...కాని, ఓనాడు ఓ ఆడది ఆడింది...ఇంతకన్న పచ్ చ్చి-..."

"అవు నవును...ఆ రోజు...మీ పెళ్ళినాడు — కాదూ?"

"సరిగా జ్ఞాపకం వచ్చింది...రైట్—"

"ఆమె అబద్ధం ఆడలేదే! మీ అనుమానం ఆనాటితో పోయిందని అనుకొంటూందామె...అయితే..."

"అది అనుమానం అయితే కదా, పోవడానికి!"

"అది—నిజమే నంటారా?"

"నువ్వే చెప్పాలి...ఆ అమ్మాయి మనసులోకి నేను వెళ్ళగలిగితే చెప్పేవాడిని—కాని...ఆమె మనసు కవాటాలు తెరవలా ఇంకా..."

"ఇంతకన్న మగవాళ్ళ అనుమానాలకు ఉదాహరణ ఏం కావాలి?"

ఆమె నిశ్శబ్దంగా తలవంచుకున్నది.

ఆకాశం నక్షత్రాలు ... ఆ నల్లటి ఆకాశంమీది తెల్లని నక్షత్రాలవైపు చూస్తూ అతను ఆలోచిస్తున్నాడు. ఆనాడు...తన పెళ్ళినాడు...కొద్ది నెలల క్రితం,...

ఏడున్నరకు ముహూర్తం...ఇప్పుడు అనుదాటి ఎంతో అయింది...పెళ్ళికొడుక్కి తలఅంటి నీళ్లుపోశారు. తరవాత అతన్ని మేడమీద వదిలిపెట్టి ఎవరిపని వారు చూసు కుంటున్నారు—సంభారాలూ, అవసరాలూ సమకూరుస్తూ కొందరూ...ఆ హడావుడిని చూస్తూనే కాలంగడుపుతూ కొందరూ ... ఉదయానికి పెళ్లి శోభను తెచ్చిపెడుతూ సన్నాయి వాద్యం చల్లగా సాగిపోతోన్నది. కొండల్లో నదిమల్లె మెలికలు తిరుగుతూ, హెచ్చిపడుతూ—అట్లా... అట్లా...సాగిపోతున్నది. వాళ్ళధర్మమా అని మిగిలిన వాద్యగాళ్లు ఊదుతున్నారు. వాళ్ళకు ఇంకా పూర్తిగా తెలివి రానట్లున్నది.

ఎవరో గట్టివాడిమల్లేనే ఉన్నాడు వాద్యగాడు ... మలయమారుతాలకు తన రాగసంగతులను జతచేసి మనసున్న

వారి అంతరంగాలను కదిలిస్తున్నాడు ... అపురూప సుంద రులూ, ప్రశాంతతా, ఉషఃకాంతులూ ... అన్నిటిలోనూ ఉన్న అందాలను జతచేసి మనస్సులలోకి పంపుతున్నాడు.

అట్లా అనిపించింది మూర్తికి...ఉదయానికీ, ఆ రాగానికీ ఎంత జట్టు! అని...తన గదిలో ఒంటరిగా ఉన్నాడు. ఆ కిటికీలోనించి చూస్తే ఇంట్లో హడావుడిగా సాగుతోన్న ప్రయత్నాల సందడి...ఆమధ్య సున్నితమైన ఈ రాగతరంగాల స్పర్శలు ఎట్లా తెలుస్తాయి! ఈ కిటికీలోనించి చూస్తే చక్కటి తోటా, పువ్వులునూ—మూడో అంతస్తులో నించి చూస్తే మరీ కలిసిపోయి ఏదో చిత్ర రచనమల్లే... ఈ అందమూ, ఆ రాగమాధుర్యమూ...కొద్దిక్షణాల్లో తనది కాబోయే అందమూ, మాధుర్యములాగే ఎట్లా పెనవేసుకొన్నాయి.

అట్లా సాగిపోతున్నాయి అతని ఆలోచనలు...ఇంతలో శ్రీపతి వగుర్చుకుంటూ మీదికి వచ్చి గదిలోకి వచ్చాడు ఆయాసంగానే. "మెట్లన్నీ ఎక్కేసరికి దుంపతెగిందోయ్! ఎంత పెళ్ళికొడుకువైనా ఇంత ఎత్తుకు ఇప్పుడే వెళ్ళిపోతే, మాలాటివాళ్ళం ఏం కావాలీ?" అన్నాడు.

చూస్తోన్న దృశ్యాన్ని వదిలి కృష్ణమూర్తి ఇవతలకు తిరిగి చిరునవ్వుతో, "ఈ మాత్రం మెట్లెక్కలేకపోతే మున్ముందు నీ ఆకాశ హర్మ్యాల మెట్లన్నీ ఎట్లా ఎక్కుతావోయ్?" అన్నాడు—శ్రీపతి స్థూలశరీరంవంక చూస్తూ.

తానూ ఒకసారి తన వంక చూసుకుని, "అది దేవుడి కరుణలే!...ముహూర్తం దగ్గరపడుతోంది; ఇంకా ఇక్కడే ఉన్నావేం ఒక్కడివీ?" అన్నాడు శ్రీపతి.

"ముహూర్తం వచ్చేసేదాకా మనకక్కడ పనేమిటిలే— నువ్వు కాఫీ త్రాగావా?" అన్నాడు జవాబుగా మూర్తి.

"ఆఁ... తెల్లారకుండా దేవాలయదర్శనం అయ్యాక తిరిగి వచ్చేసరికి మీ మామగారు ఎంత వద్దన్నా ఉపాహారసమేతంగా కాఫీ పుచ్చుకునేదాకా ఊరుకోనిదే!" అని చిన్న నవ్వు నవ్వి—

"కాదుకాదంటూనే మహాఘనమైన సంబంధం కొట్టేశావోయ్!" అన్నాడు శ్రీపతి.

"ఘనానికేముందీ— నా సంగతి నీ కాపాటి తెలుసుగా! లలితను ఎట్లాగైనా చేసుకోవాలనే అనుకొన్నాను. కాకపోతే కొంచెం ఆస్తి ఉంది..." అన్నాడు మూర్తి.

"కొంచెం!" అని నొక్కి అన్నాడు శ్రీపతి. "మూడు లక్షలు ఇంకా చాలలేదంటావ్!... ఆ అమ్మాయి విలువ ఇంకా ఎక్కువే ఉంటుందిలే..." అన్నాడు శ్రీపతి చిత్రంగా.

తేలికగా నవ్వి మూర్తి "భేష్! మనుష్యులింక రూపాయలూ అణాలలో విలువ చెయ్యలేని వస్తువు లేదంటావ్!" అన్నాడు.

కొంచెం సర్దుకుని— "అది కాదోయ్!... లలిత అంటే నీ కెంత అభిమానమో నాకు తెలుసును. ... ప్రేమ బొత్తిగా గుడ్డిది కాదని నా ఉద్దేశం", అన్నాడ

దీని కెలాగ జవాబు ఇవ్వాలో తెలీలేదు మూర్తికి. ఇంతట్లో క్రిందనుంచి మూర్తిని పిలిచారెవరో ... ఇద్దరికీ ఆ నిశ్శబ్దంనించి విముక్తి ఇస్తూ, శ్రీపతిలేచి, "అదిగో! మీ అమ్మగారక్కడే ఉన్నారు, పిలుస్తున్నారు. ఊరికే శుభాకాంక్షలు చెప్పిపోదామని వచ్చాను; వెడతాను", అన్నాడు శ్రీపతి.

అతను మాట పూర్తిచెయ్యకముందే మూర్తి కిటికీ లోంచి తోటవైపు చూస్తూ, బొమ్మమల్లే అయిపోయాడు— కొద్ది క్షణాలపాటు. ఆ బిత్తరపాటు చూసి ఆశ్చర్యంగా శ్రీపతి, "ఏమిటి కనిపిస్తోంది కిటికీలోనించి అంత అద్భుతంగా?" నని. "అరే! అట్లా బిత్తరపోయ్యావేం", అన్నాడు ఆ విషయం తానూ చూడడానికి కిటికీవైపు వస్తూ.

శ్రీపతి దగ్గరికి వచ్చేలోపునే మూర్తి కిటికీ తలుపులు వేశేశాడు. అతని ప్రవర్తన శ్రీపతి కేమీ అర్థంకాక, మూర్తి భుజంమీద చెయ్యివేసి, "ఏమిటిసంగతి మూర్తీ?" అన్నాడు.

మూర్తి ముఖంనిండా చెమట పోసింది. కొద్ది క్షణాల క్రితం అతని ముఖంలో తాండవం చేసిన ఆనందమూ, ఉత్సాహమూ మాయమైపోయాయి. "ఏమిటి—మూర్తీ, ఏమిటి?" అంటూ శ్రీపతి అతన్ని రెండు చేతులా తీసుకున్నాడు. విషయం ఏమిటో తెలీక కొంత, మూర్తి స్థితిచూసి మరికొంతా, శ్రీపతి గాభరాపడసాగాడు. ఆ పరిస్థితుల్లోకూడా మూర్తి శ్రీపతిని కిటికీ దగ్గరకి పోనివ్వలేదు... కొలది క్షణాలలో సర్దుకుని, " ళ్ళి వెంటనే రమన్నానని చెప్పి అన్న

య్యను పంపించు; మరింకెవరికీ ఏమీ చెప్పకు_" అన్నాడు మూర్తి.

ప్రశ్నించినా ఏమీ రాబట్టలేమని తెలిశాక శ్రీపతి క్రిందికివెళ్ళి మూర్తి పిలుస్తున్నాడని శేఖరంతో చెప్పాడు. అతను బయటికి వెళ్ళగానే మూర్తి కిటికీ తలుపులు రెండూ తీసి అటు చూస్తూ తల పట్టుకుని, 'భగవాన్!' అనుకున్నాడు.

శేఖరం తొందరగా గదిలోకి వస్తూ, "ఎందుకు రమ్మన్నావట?... క్రింద వాళ్ళందరూ నీ కోసం చూస్తూంటే_" అన్నాడు.

"కొంచెం జాగ్రత్తగా విను అన్నయ్యా... ఈ పెళ్ళి ఇంతటితో ఆగిపోవాలి___"

తృళ్ళిపడ్డాడు శేఖరం. "ఏమిటీ?" అన్నాడు ఆశ్చర్యంగా.

"ఈ పెళ్ళి నేను చేసుకోబోవడంలేదు_!ఇంతటితో ఆ ప్రయత్నాలన్నీ ఆగిపోవాలి", అన్నాడు మూర్తి.

"నిద్రపోతున్నావా మూర్తీ?— ఏమిటి నువ్వంటూన్నది?— ఏం జరిగింది?"

"తెలివి వచ్చింది_ కొంచెంసేపు క్రిందటనే. అందుకే ఈ పెళ్లి వద్దంటున్నాను. క్రిందికివెళ్ళి చెప్పేయ్ అన్నయ్యా ...మనం వెంటనే వెనక్కి వెళ్ళిపోదాం".

"నీకు మతి భ్రమించింది", అన్నాడు అక్కడ కుర్చీలో నీరసంగా కూలబడుతూ శేఖరం...ఇంతట్లో తిరిగి క్రిందినించి

కేక వినిపించింది మూర్తికి. శక్తి తెచ్చుకుని, తిరిగి,— "అదిగో వాళ్లు తొందరపడుతున్నారు ... పిచ్చిగా మాట్లాడకు ... మూర్తీ! పద!" అన్నాడు.

ఒక్క క్షణం నిశ్శబ్దంగా ఊరుకుని, పిచ్చేంకాదన్నయ్యా, నన్నింకేమీ అడక్కు... సాధ్యమైనంత త్వరలో అందరికీ ఈ విషయం చెప్పేశెయ్" అన్నాడు శేఖరం చేతులను పట్టుకుని మూర్తి.

"అసలు విషయం చెప్పు...ఏం జరిగింది?"

"క్షమించు అన్నయ్యా!... ఆ విషయం నేను మాట్లాడదలుచుకోలేదు..."

"మరి విషయం ఏమిటని అడిగితే, వీళ్ళందరికీ నే నేం జవాబు చెప్పుకోనేదిరా?"

"నా మీద ఉంచు అంత తప్పునూ... దయ ఉంచి కారణం అడగకు,... నా నిశ్చయం చాలా బలంగా చేసుకున్నాను—లలితను నేను పెళ్ళిచేసుకోవడం లేదు."

అనుమానాలకు వీలులేకుండా చెప్పేశాడు మూర్తి. శేఖరాని కేమీ తోచలేదు. అసలు ఏం జరిగిందో అతనికి అణుమాత్రమూ సూచనలేదు. లలితకోసం కలవరించిపోయి పెళ్ళిచేసుకొంటూన్న మూర్తి కొద్దినిమిషాలక్రిందటిదాకా లేని ఈ మార్పుకు ఎట్లావచ్చాడోననే మహదాశ్చర్యం ఒక వేపూ, వారందరికీ జవాబు ఎట్లా చెప్పడం అనే బాధ మరో వేపూ అతన్ని కింకర్తవ్యతామూఢునిగా చేశాయి. మూర్తి

అంటే అతను ప్రాణాల నివ్వడానికి వెనుదియ్యడు; కాని, తమ్ముడు సృష్టించిన ఈ వింత పరిస్థితి తనను విచిత్రమైన సూదులమధ్య పార వేసింది_అతనంటే కోపమూ, అసహ్యమూ కలుగసాగాయి.

ఇద్దరూ అట్లానే ఉండిపోయ్యారు కొద్ది క్షణాలు.

"నీ మీద ఆశలు ఉంచుకుని వాళ్ళెన్ని ప్రయత్నాలు చేసుకున్నారు... లలిత నీ కోసం ఎన్నో స్వార్థాలను వదులుకుని, ఈ పెళ్ళికి ఒప్పుకున్నది...అందరూ కొద్దిసేపట్లో జరుగబోయే మీ పెళ్లి చూడాలని కాచుకుని ఉన్నారు. క్రిందికి వెళ్లి నేనేమని చెప్పేదిరా?" అన్నాడు శేఖరం మళ్ళా. అతనికి త్వరగా క్రిందికి వెళ్ళి ఈ విషయాన్ని అందరికీ చెప్పి ఒక అంతానికి తీసుకునిరావాలని ఉన్నది; కాని, క్రిందికి వెళ్ళడానికి ధైర్యం రావడంలేదు.

"నే నింకేమీ చెప్పలే నన్నయ్యా!" అన్నాడు మూర్తి నీరసంగా.

"నీకు మతి చెడింది."

నిశ్చయంగా అన్నాడు శేఖరం...కొంచెం కోపంతో కూడా.

"పోనీ_అలాగ చెప్పు", అన్నాడు మూర్తి అతృతగా.

మళ్ళా పెళ్ళికొడుకుకోసం కేక వినిపించింది క్రిందినించి— శేఖరం బాధగా లేచి నిలబడి, కూర్చుని, ఏమీ తోచక తిరిగి నిలబడ్డాడు.

"పోనీ—మూర్తీ... నాతోనైనా నిజం చెప్పు... ఇంత మంది ఆశలను వృథాచేసే ముందు నా మనస్సునైనా దృఢ పరుచుకోనీ!" అన్నాడు.

మూర్తి జవాబు ఇవ్వలేదు. కిటికీ ఊచలను పట్టుకుని అట్లానే నిలబడ్డాడు. తిరిగి శేఖరం, "ఇన్నాళ్ళనించి లలితని గురించి కలలు కంటున్నావే! ఇంతలో ఈ వైరాగ్యం ఏమిటి?" అన్నాడు.

మూర్తి దీనికీ ఏమీ చలించలేదు— ముఖంనిండా చెమట...దాచుకున్న మిస్టరీని దాచలేకపోతున్నట్లు బాధ.

"చెప్పవ్ ! మూర్తీ !"— చివరి ప్రయత్నం చేశాడు శేఖరం బ్రతిమాలుతూ.

పూర్తిగా అతనివైపు తిరుగుతూ, "వద్దన్నయ్యా ! నన్ను మాటలాడించకు తల బ్రద్దలౌతూంది. వెళ్ళు. ఏదో చెప్పు—" అన్నాడు మూర్తి.

ఇంక లాభంలేదని నిశ్చయించుకుని శేఖరం బరువుగా క్రిందికి బయలుదేరాడు— గుమ్మందాటగానే, మూర్తి పిలిచాడు— ఆశగా వెనక్కి నడిచాడు శేఖరం.

"కొంచెం ఆగు. లలిత ఉంటుంది. ఒక్కసారి మీదికి పంపించు..." అన్నాడు.

కొంచెం తేలికపడి శేఖరం క్రిందికి బయలుదేరాడు. అతను వెళ్ళిన కొద్ది నిమిషాలలో లలిత మీదికి వచ్చింది— చెల్లెల్ని తోడుతీసికొని—

మూర్తి వారిద్దరినీ చూసి ఒక్క క్షణం చాలా గాభరా పడ్డాడు—లలిత అంటే అతని ఉద్దేశంలో తెల్లటి చీరా, జడలో ఒక పూవూ, మెడలో చిన్న గొలుసూ...అంతే—ఇప్పుడు అవన్నీ మారిపోయి...

పెళ్లికూతురు వేషంలో ఉన్న లలిత చాలా సిగ్గుగా, "ఎందుకో తక్షణం రమ్మన్నారుట—" అన్నది.

"అవును... కొంచెంసేపు ఒంటరిగా మాట్లాడాలి", అన్నాడు మూర్తి కిటికీవైపు చూస్తూ... లలితతో వచ్చిన అమ్మాయి నిశ్శబ్దంగా మెట్లు దిగిపోయింది.

వింతగా లలితవైపు చూస్తూ, "మన పెళ్లి విషయంలో— నేను చాలా పొరపాటు పడ్డానని అనుకుంటున్నాను...అందుకనే నిన్ను పిలిచాను. కొద్దిసేపటిలో మన ఇద్దరి సంబంధమూ మార్చలేనిదైపోతుంది..."

అతను చెప్పలేక, ఆగాడు—నీరసంగా లలిత కుర్చీలో కూలబడి, "ఏమిటి మీరంటోన్నది?" అన్నది.

"విను లలితా ... ఈ పెళ్ళి ఆగిపోవాలని నేననుకుంటున్నాను... ఆ మాట చెప్పడానికే నిన్ను పిలిచాను—" తన పని తొందరగా ముగించదలుచుకున్నట్లు అనేశాడు మూర్తి.

త్రుళ్లిపడింది లలిత... తనను ఆ సమయంలో మీదికి పిలిచినప్పుడు ఏదో కీడు ఉందని భయం వేసింది...కాని, ఇంత అవుతుందని అనుకోడానికి ఆమెకు సాహసం లేకపోయింది.

"ఎందుకని ?" అన్నది లలిత కొంచెంసేపు అట్లానే ఉండిపోయి.

సూటిగా ఆమె ముఖంలోకి చూస్తూ, మూర్తి "నాకూ తెలుసు; నీకూ తెలుసు— నా చేత అనిపించడం ఎందుకని ?" అన్నాడు.

"మీ రనేది నా కర్థం కావడంలేదు— ఏదో పొరపాటు జరిగినట్లుంది...వివరంగా చెప్పండి", అన్నది లలిత. మెడలో బరువైన ఈ ఆభరణాలూ, వొంటిని ఖరీదైన ఈ బట్టలూ, తన క్రొత్త అలంకరణలూ తనకు అందాలను తెచ్చిఇవ్వడం మానేసి ఒక్క-క్షణంలో బరువైపోయి వెక్కిరిస్తోన్నట్లు కనిపించాయి.

"అయితే, నే ననక తప్పదా, లలితా ?" అన్నాడు— కొంచెం కోపంగా మూర్తి.

"ఇన్నాళ్ళనించి మీరుకోరి, ఇష్టంచూపిన పెళ్లి ఒక్క నిమిషంలో మీ కయిష్టం అయిపోయిందంటే ఆ కారణమైనా మీరు చెప్పకపోతే ఎట్లా ?" అన్నది లలిత. ఆమె ఏడ్వడంలేదు...అంతే.

"ఒక్క-మాటలో చెప్తాను. విను—కొద్ది నిమిషాలక్రింద నే నీ కిటికీలోనించి క్రిందికి చూశాను. లేచి, ఇలాగ వచ్చి చూడు—"

లలిత లేచి అతను చూపిన కిటికీదగ్గరికి వెళ్లి అతను చూపుతోన్న వైపు చూసింది.

"అక్కడ ఏముంది?" అన్నది.

"అవును. అక్కడ ఏముంది?" అన్నాడు మూర్తి.

లలిత మళ్ళా చూసింది అటు. అవును ... అక్కడ ఏముందీ ?

"నాకక్కడ మల్లిపొదా, ప్రక్కన మామిడిచెట్లూ మాత్రం కనిపిస్తున్నాయి—మీ రనే దేమిటి?"

"మరేమీకాదు— అదే నేననేదీ... ఆ మల్లెపొదలో కొంచెం సేపటి క్రింద ఒక అమ్మాయి ఏవేవో చేసింది... అలా అంటే నీకు తెలుస్తుం దనుకుంటాను—"

లలిత తలవొంచుకునే ఆలోచిస్తోన్నది— తల ఎత్తకుండానే, "మీరు చిత్రంగా మాట్లాడుతున్నారు. ఆ అమ్మాయి ఎవరూ? ఏం చేసిందీ?" అన్నది.

"నాకు తెలీదూ!" అన్నాడు మూర్తి. "తెలిస్తే ఎందుకు అడగడం?" అన్నది లలిత.

ఈ సారి ఆశ్చర్యపడడం మూర్తి వొంతుమల్లే కనిపించింది. తాను కళ్ళతో చూసినదాన్ని ఈమె కాదంటూందా? తనకళ్లు తనను మోసగించాయా?

"నిజం చెప్పు లలితా— నీకు తెలీదూ?" అన్నాడు మూర్తి మరీ సూటిగా ఆమె కళ్ళలోకి చూస్తూ. తనకు తెలీకుండానే ఒక్కసారి లోలోపల కంపించిపోయింది లలిత. ఆ తత్తరపాటులో మాటలాడలేక ఊరుకున్నది.

"నిజంగా—ఆ పొదలో అప్పుడు నువ్వు కాదూ?"

"నేనా?"

అరిచింది లలిత. మరుక్షణం సర్దుకుని— "చెప్పండి— ఇప్పుడు కొంచెమూ కొంచెమూ తెలుస్తోంది... ఆ పొదలో ఆ అమ్మాయి— అంటే మీ ఉద్దేశంలో నేను—ఏం చేసింది?"

ఆమె గొంతుకలో ఇంక నిస్సహాయతకన్న కోపమే ఎక్కువగా ధ్వనించసాగింది. ఆ జీర చెవిలోపడి, ఒక్కసారి తెలివి వచ్చినట్లయింది మూర్తికి.

అతను మాట్లాడలేదు. కథ ఇట్లా అడ్డుతిరిగాక ఏమీ అనడాని కతను సంసిద్ధుడుగా లేడు.

"నేనా? అక్కడా?"

ఉన్న మార్దవం కూడా అంతరించి పోయింది లలిత గొంతులోనుంచి. ఆమె కళ్ళూ సిగ్గు బరువునుంచీ, అవ మానపు లోతులనుంచీ ఒక్కసారి కోపపుటావక్కికి మారి పోయాయ్.

మూర్తి కిటికీవైపు ముఖం తిప్పుకున్నాడు. ఆ మల్లె పొద... ఆ గుబురు మామిడిచెట్లు... అక్కడ... అతని కౌగిలిలో ఆమె—ఆమె కళ్లను తుడుస్తూ అతను...అప్పుడు— ఆమె వెళ్ళలేక వెళ్ళలేక వెళ్ళడం...తాను చూడలేదూ?

"మీరు నన్ను పిలిచి ఈ విషయం తెలియజేసినందుకు చాలా కృతజ్ఞురాలిని— నేనే క్రిందికివెళ్లి పెళ్లి ఆగిపోయిన సంగతి చెప్పి వొస్తాను—సెలవు."

లలిత లేచింది. మూర్తి మహావేగంగా వెనక్కి తిరిగి గుమ్మానికడ్డునిలబడి—"ఒక్క క్షణం ఆగు లలితా! నన్నాలోచించుకోనీ", అన్నాడు.

లేచిన లలిత అట్లానే కూర్చుని—"మీరేమీ ఆలోచించడం అనవసరం. మీకు ఇష్టమైనా కాకపోయినా ఈ పెళ్లి నాకు ఇష్టంలేదు. అంచేత ఎలా అయినా ఫలితం ఒక్కటే—" నన్నది.

"కాదు లలితా ... తొందరపడకు. నా తల పాడై పోయింది... కొంచెం ఆలోచించుకోనీ", అని మూర్తి దగ్గర ఉన్న మరొక కుర్చీలో కూర్చున్నాడు. ఆ గదిలోనే ఎన్నో సార్లు లలితతో గంటలతరబడి మాట్లాడుతూ కూర్చున్న సమయాలు ఒకటీ ఒకటీ అతనికి జ్ఞప్తికి వచ్చాయి... అన్ని రోజులనుంచీ తాను కన్న కలలూ, ఆలోచించుకున్న మధురానుభూతులూ, ఒక్క మాటతో—ఒక్క క్షణంలో మాయం అయిపోతోన్నట్లు కనిపించాయి.

ఆలోచించినకొద్ది మూర్తికి విషయం సుస్పష్టంగా బోధపడసాగింది. ఇంతదాకా వచ్చిన పెళ్లి ఈ క్షణంలో ఆగిపోయ్యాక తన మనసు ఎట్లా ఉంటుందో ఆలోచించిన కొద్దీ పెద్దలోటు తనముందు ఉండి భయపెట్టసాగింది.

"—నేను కొంచెం తొందరపడ్డాను లలితా... ఉదయం ఆ పొద దగ్గిర నేను చూసిన స్త్రీ నువ్వే ననుకున్నాను. ఉన్నది నీతో మాత్రం, చెప్పి పెళ్ళి మానుకుందా మనుకున్నాను—"

లలిత ఈసరికి కొంచెం స్థాయికి వచ్చింది.

"మా శ్యామల అయివుంటుంది", అన్నది నెమ్మదిగా.

"శ్యామల ఎవరూ?"

"మా పెదతల్లి కూతురు... దాని పెళ్లి వచ్చేనెల... అతన్ని చేసుకుందా మనుకున్నది కాని..."

"అలాగా!" అన్నాడు మూర్తి.

"ఆఁ... అది ముమ్మూర్తులా నా పోలికే!" నన్నది లలిత.

సంభాషణ తిరిగి ఈ మాత్రం ప్రశాంతతకు రావడం చాలా సుకరంగా కనిపించి, "జరిగినదంతా మరిచిపో లలితా! పెళ్లి మామూలుగా జరగనీ!" అన్నాడు మూర్తి.

"వద్దులెండి— ఇంత అనుమానాలతో మనం సుఖపడతామని నేను ఆశించడంలేదు", అన్నది లలిత.

"పొరపాట్లు ఎవరైనా చేస్తారు లలితా!... క్షమించడం మానవత్వం... నువ్వే నా స్థానంలో వుంటే ఏం చేసేదానివి?" అన్నాడు మూర్తి.

లలిత జవాబివ్వలేదు. నెమ్మదిగా లేచి, అతనివైపొకసారి బరువుగా చూసి క్రిందికి వెళ్లిపోయింది.

పెళ్లి యథావిధిగా జరిగిపోయింది. శ్యామలను లలిత తరువాత మూర్తికి చూపింది.

ముమ్మూర్తులా లలితే...అయితే, తాను ఎంత చీకట్లోనూ లలితను వేరుగా గుర్తించగలను— అనుకున్నాడు మూర్తి.

ఇవేవీ తరవాత వారి అభిమానాలకు అడ్డురాలేదు. అంతా సవ్యంగా అయిపోయింది.



ఈనాడది అంతా జ్ఞాపకం వచ్చింది మూర్తికి. ఆ కథ చదివాక, రాత్రి భోజనాలుచేసి కూర్చున్నారు దంపతులు... ఈ వాదన వచ్చింది.

"వెయ్యిమంది శ్యామలల మధ్య నిలబడు—నిన్ను గుర్తిస్తాను లలితా!...ఆనాడు అత నెవరో నాకు తెలుసు... ఆమె నువ్వేననీ నాకు తెలుసు...ఇప్పుడైనా నిజం చెప్పు లలితా!" అన్నాడు మూర్తి గంభీరంగా.

అత నట్లా మాట్లాడుతోంటే ఆమె దోషిలాగే కంపించి పోతూన్నది. కొంచెంసేపు ఏ ప్రత్యుత్తరమూ ఇవ్వ లేదు. తరువాత, "అది నిజమే అని నమ్మితే, మరి పెళ్ళి ఎందుకు చేసుకున్నారు?" అన్నది—నీరసంగా.

మూర్తి తేలికగా నవ్వాడు.

"ముందర మానేద్దామనే అనుకున్నాను ఆ ఆవేశంలో—అందుకే నిన్నుపిలిచాను. నీతో చెప్పేనుకూడా... కాని, క్రమంగా నా చర్యలోని మూర్ఖత్వం నాకు కనిపించసాగింది...నా కళ్ళలో పడ్డావు కనక తలిసింది—ఆ క్షణం

నేను కిటికీలోనించి బయటికి చూడనేలేదనుకో...జీవితంలో ఎవరినో ఒకరిని పెళ్ళిచేసుకుతీరాలిగా! అట్లా ఆలోచించాను. ఆక్షణంలో నీకు వచ్చిన కోపం నేను పెద్ద సంస్కర్తగానూ, విశాల హృదయుడిగానూ నటించకుండానే నా హారపాటుని కప్పిపుచ్చుకొనే వీలును ఇచ్చింది...నీ బదులు నేనే దోషిగా నిలబడ్డాను...అదే సుఖావనిపించింది. ఇవాళ నిన్నడగాలని అనుకోలేదు...కాని, సంభాషణ ఇంతదాకా వచ్చేక మన యిద్దరిమధ్యా వున్న ఈ తెర తొలగించుకోవాలనిపించింది...ఒక్కసారి నావైపుచూసి, నిజం చెప్పు లలితా!...నువ్వే—కాదూ?"

లలిత మాటలాడలేదు. ఆకాశంవైపు చూస్తూ అలానే ఉండిపోయింది.

"చెప్పవ్?"

ఆమె అతనివైపు తిరిగింది...రెప్ప వెయ్యకుండా చూస్తూ నిశ్శబ్దంగా వుండిపోయింది.

"నాకు తెలుసు లలితా! శ్యామల అక్కడ లేదని... ఈ చీకటిలో నువ్వూ, పదిమంది శ్యామలలు నిలబడండి... నాకళ్ళకు గంతలు కట్టినా నిన్ను నేను గుర్తించగలను. చెప్పవ్ లలితా?"

ఆమె తలవంచుకున్నది, ఆ నిశ్శబ్దానికి అట్లానే దీర్ఘాలిస్తూ.

జవాబుకోసం కొంచెంసేపు చూసి మూర్తి ఆమె ముఖాన్ని తనవైపుకు త్రిప్పి ఎత్తాడు.

చేతికి తడిగా, వేడిగా తగిలాయి కన్నీళ్లు. అప్పటిదాకా చీకటిలో తనకు కనిపించలేదు.

"నువ్వు నిజాన్ని అర్థం చేసుకోలేవు లలితా!... క్షమించు—మరెప్పుడూ అట్లా అడగను", అన్నాడు పశ్చాత్తాపంతో.

"మీరు నిజాన్ని తెలుసుకోలేరు — భరించలేరు. ఎప్పుడూ అడగకండి", అందామనుకున్నది లలిత.

కాని, ఆమె నిరుత్తరంగా అలాగే వుండిపోయింది— అతని కళ్ళలోకీ, వెనుక చీకట్లవైపూ చూస్తూ.

— ఆంధ్రప్రభ, 25–8–54.

# ప్రేమ - చీకటి

సాయంత్రం ఏడు కావచ్చింది,.. సంజచాయలు చిక్కబడి చీకటిని ఆహ్వానిస్తూన్నవి.

ఆ వీధిలో ప్రపంచమంతటికన్నా త్వరగా ప్రవేశిస్తాయి చీకట్లు...అందుకనే అక్కడ గదులూ, కొద్దిగా ఇళ్ళూ పట్నంలో మిగిలినచోట్లకన్న కొంచెం చవుకగా దొరుకుతాయి. మధ్యతరగతి మనుష్యుల్లో క్రింది అంతస్తుల వారికి ఆ వీధి ఊపిరి తీసుకోనిచ్చే చోటు. శ్రీమంతు లక్కడ ముక్కులకు చేరుమాళ్లు అడ్డంచేసుకుని ఊపిరి తీసినా తెలీనీకుండా చేసే వీధి.

ఆ వీధిలో ఒక మారుమూల గదిలో ఒక కుర్చీలో కూర్చుని, సంజవెలుగూ, విద్యుద్దీపపు మసక వెలుగూ కలిసిన

కాంతి దగ్గిర ఏదో పుస్తకం చదువుకుంటున్నాడు హరి. కొంచెంసేపట్లో విసుగ్గా పుస్తకం మూసి, టేబిల్ మీద వుంచి లేచాడు.

కిటికీలోనించి బయటికి చూశాడు హరి.

సముద్రానికి పోయేరోడ్డు అది... చాలామంది యువకులూ, యువతులూ ఒంటరిగానో జంటలుగానో రోడ్డు మీద నడుస్తున్నారు...సామాన్యులు సముద్రదర్శనం ముగించుకునీ, శ్రీమంతులు దానిని ప్రారంభించేందుకూ సైకిళ్ళమీద కొందరూ, కార్లలో కొందరూ, త్వరత్వరగా మనుష్యులను తప్పించుకుని సాగిపోతున్నారు.

కొద్ది నిమిషా లట్లానే పరీక్షగా చూసి, నెమ్మదిగా హరి కిటికీ తలుపులు మూసి, టేబిల్ దగ్గిరికి వచ్చాడు... టేబిల్ మీద ఖరీదైన వస్తువులేమీ లేవు...బహుశా ఒక అద్దం తప్ప. అదికూడా ఖరీదైనది కాకపోవచ్చు...కాని చాలా పురాతన కాలంలో అది ఏ రాజకుమారి ముఖాన్నో తనలో ప్రతిఫలింపజేసి చూపి ఉంటుం దనిపిస్తుంది...ఆ చుట్టూ శిల్పంతో చెక్కిన అంచులు చూస్తే...ఆ అద్దమూ, ఇంటి యజమానిదే. "జమీందారులకు చెడ్డరోజులొచ్చాయ్!" అనేవా డతడా అద్దాన్ని చూసినప్పుడల్లా...కాని, దాని పూర్వోత్తరాలని గురించి అత నెప్పుడూ చెప్పలేదు...చెప్తానని మాత్రం అనేవాడు.

అద్దంముందు కూర్చుని, తన ముఖం చూసుకున్నాడు హరి...ముఖం పాలిపోయిందా?...దీపపుకాంతి తన ముఖం

మీద పడి, దానిలోని ఎత్తుపల్లాలన్నిటినీ స్ఫుటంగా ప్రతి ఫలింపజేస్తున్నది అద్దంలో... ఔను. ముఖం అంతా చాలా నీరసంగా కనిపిస్తూన్నది.

"నువ్వు—చిక్కిపోతున్నావ్ హారీ!"

సాయంత్రం నీల అన్న మాటలు ఒక్కసారి జ్ఞప్తికి వొచ్చాయ్ చల్లటి సముద్రతీరాన. మనుష్యులకు దూరంగా కూర్చుని, ఆమె వొడిలో తలపెట్టుకుని, హాయిగా ఆనందంలో తేలిపోతూ గడిపిన క్షణాలు జ్ఞప్తికి వొచ్చాయ్... తన జుత్తులో ఆమె మెత్తటి వేళ్ళని దూర్చి "నువ్వు—చిక్కిపోతున్నావ్ హారీ!" అని ఆమె అన్నప్పుడు ఆ కళ్ళల్లో ఎంత బాధా, వాత్సల్యమూ కనిపించాయి!

నీల!

నీ_ల!

తియ్యగా, ఆప్యాయంగా ఆ పేరుని మననం చేసుకున్నాడు హారి. ఎంత మంచి నీల! ఆమెదగ్గర కూర్చున్నంత సేపూ తన కష్టాలూ, తన జీవితమూ, ఏవీ జ్ఞప్తికే రావు! ఏదో అవ్యక్తమైన ఆనందం తనని చుట్టుముడుతుంది. ఆ క్షణాలలో, చక్కటి ఉద్యానవనాలు, నల్లటి మేఘాలు, గంధర్వులూ, చంద్రుడూ— అన్నీ అలాటి మధుర భావాలు తన మనస్సులో మెదులుతాయి. కళ్ళముందన్నీ ఎంతో మధురంగా కనిపిస్తాయి. నీల దగ్గర ఉంటే చాలు... దుఃఖమే ఆ చుట్టూ రాదు! నవ్వుముఖంతో "ఎందుకు హారీ, అలా

ఉన్నావ్?" అంటే చాలు—గూళ్లు కట్టుకున్న చీకట్లన్నీ మటు మాయం అవుతాయి. ఒక్కసారి వెన్నెలల్లే కాంతి విరుస్తుంది.

"నేనంటే ఎందుకు నీలా నీకంత అభిమానం?... ఎందుకు నన్నంతగా ప్రేమిస్తావు?"

అంతటి మాధుర్యం రూపు తెచ్చుకుని, తనతో మాట్లాడుతూంటే ఆమె చేతులకు తగులుతూంటే, తన కా మృదువైన కంఠంలోనించి ఈ మాటలన్నీ వినిపిస్తోంటే, అవన్నీ తనకోసమేనని హరి నమ్మలేడు— అంతా ఏదో కల లాగ ఉంటుంది...ఉద్రేకంతో అడుగుతాడు. ఒకసారి సైగ చేస్తే నీల వెనుక వందల యువకులు నిలవబడరూ? ఆమె నొక్కసారి స్పృశించి జీవితం ధన్యం చేసుకుందామని ఆశిం చరూ?... వా రందరినీ వొదిలి తనతో— ఒక దరిద్రుడితో— నీల ఎందుకని, తన జీవితాన్ని గడపజూడడం? ఆమె కెందు కంత అభిమానం?... అది తాను నమ్మలేడు చందమామని చూస్తోన్న పసివాడిలాగ బాధపడతాడు... అలా అడుగు తాడు.

నీల సూటిగా ఏ సమాధానమూ చెప్పదు. నవ్వు తుంది. లేతగా...తీయగా..."మరెవరికోసం బ్రతుకుతాను?" అంటుంది...నెమ్మదిగా.

ఆ క్షణంలో ఆమె కళ్ళల్లో అ [illegible] గతాయి.
అమృతాలు చిలుకుతాయి. తనకోస [illegible]
ఆమె చేతిని మరీ బలంగా నొక్క [illegible]
హత్తుకుంటాడు... ఈ ప్రపంచ [illegible]

అప్సరస ఉంది! ఆమె బంగారు హృదయంలో తనకు స్థానం ఉంది.

నెమ్మదిగా చెయ్యి విడిపించుకుంటూ "బొత్తిగా చిన్నపిల్లాడివై పోతున్నావ్ హరీ! ఇలా బాధిస్తే దూరంగా కూర్చోబెడతాను" అంటుంది నీల...నవ్వుతో.

ఆ అన్ని కదలికల్లోనూ అందాలే! బంగారురూపం... పువ్వులాటి మనసు_అన్నీ తనకోసం!

"నువ్వు—అద్దం చూసుకోవా హరీ?"

ఆ సాయంత్రం నీల సంభాషణ అలాగే ప్రారంభించింది...ఎన్నో నిముషాలు నిశ్శబ్దంగా గడిచాక.

"నీ కళ్ళల్లో చూసుకుంటున్నానుగా!"

"కాదు హరీ! ... నువ్వు — చిక్కిపోతున్నావ్. ఎందుకని?"

జాలిగా, బాధగా అడిగింది...తన ముఖాన్ని చేతితో స్పృశిస్తూ.

అవును—తాను చిక్కిపోతున్నాడు...కళ్ళు లోతుకు పోతున్నై. వాటి చుట్టూ గీతలు చాలా ప్రస్ఫుటాలౌతున్నై. బుగ్గలు ఎండిపోతు[illegible]య్. అన్నీ తనకి తెలుసును— కాని, ఏమని [illegible]

[illegible]శ్శబ్దంగా ఊరుకున్నాడు.

[illegible]దువుతున్నావా హరీ?"

"ఆఁ..."

ఆ సమాధానమూ ఆమె చెప్పుకున్నది— తన బాధ లన్నిటినీ స్వంతం చేసుకుని.

"ఎలానూ ప్యాసవుతావు హరీ. పరీక్షల కింకా చాలా వ్యవధి ఉంది. ఆరోగ్యం పాడుచేసుకుంటే ఎలాగ ? ప్రమాదం కదూ!...కొంచెం జాగ్రత్తగా ఉండు. ఏం ?"

కాదని తా ననగలడా ? ... "అలాగే నీలా ..." అన్నాడు. "కొంచెం జాగ్రత్తగా ఉంటానులే..."

ఆమె కళ్ళల్లోని వేదన చూస్తే ఎంతో బాధ అనిపిస్తుంది. మనసు గిలగిల కొట్టుకుంటుంది. ఆ కళ్ళల్లోని అమాయకత్వాన్ని చూస్తే, తనామెని మోసగిస్తున్నానే అనిపిస్తుంది...ఆ కళ్ళల్లోకి తిరిగి చూడలే ననిపిస్తుంది. అటు చూసినపుడల్లా నిజంగా తా నామె కేదో ద్రోహం చేసినట్లు బాధపడుతూ ఉంటాడు.

ఆరవుతుంది...అలా—అలా.

"పోదాం హరీ!" అంటుంది నీల.

"కొద్ది నిముషాలు కూర్చుందాం. ఈ సాయంత్రము ఎంతో బాగుంది!" అంటాడు తాను.

"నీకు బాగుండని సాయంత్రాలు ఉన్నాయా ?" అంటుంది—లేచే ప్రయత్నం మానుకుని నీల.

ప్రేమ - చీకటి

ను... ఆమె చెంతన ఉంటే, బాగుండని సాయం
ఉండదు. ఆమె సముద్రానికి అందం తెస్తుంది...
నికి భావనల నిస్తుంది.

కొంతసేపటికి ఇద్దరూ లేచి, రోడ్డుదాకా కలిసి
క్కడనించి ఆమె బస్సులో ఇంటికి వెళ్తుంది! తాను
వొస్తాడు.

గదిలో కూర్చుని, కొంచెంసేపు పుస్తకాలతో
డు... సముద్రతరంగాలలా, అనివార్యాలుగా,
తన అవధానాన్ని భగ్నం చేస్తూన్న ఆ జ్ఞాపకాలకి
స్తా ఒక్క నిట్టూర్పు విడిచాడు హరి.

పక్కన ఉన్న పాత కర్రపెట్టెలోనించి, చిరిగి మట్టి
లా అసహ్యంగావున్న ఒక చొక్కా తీసి తొడుగు
-...దానికి సరిపోయే ఒక చింకిరి పంట్లం నిక్కరు
న్నాడు.

అద్దంలో చూసుకున్నాడు హరి.

ఔను...చాలా విజయవంతమైన మారువేషం ...
లో తనని చూసి సైకిల్ రిక్షావాడు కాదని ఎవరనుకో
తాను కాలేజీ విద్యార్థినని, అక్కడ తాను గౌరవ
గా పరిగణింపబడతాననీ, నీలలాంటి ఒక దేవత తనని
స్తోందనీ, ఎవరనుకోగలరు.

చిన్నతనంలో తాను ఫ్యాన్సీ డ్రెస్సులకి చాలా బహు
ం సంపాదించేడు. ఆ బహుమతులన్నీ ఆనాడే అయి

పోయినా, ఆ నేర్పు మాత్రం మిగిలి ఈనాడు తన జీవనానికి సహాయపడుతున్నది.

అంత ఎక్కువగా చదువుతున్నావా హారీ?

మనసు చివుక్కుమన్నది హారికి ... అమాయకత్వం తొణికిసలాడే ఆ కళ్లు జ్ఞాపకం వచ్చి...ఎంత అమాయకత్వం, చదువుకే చిక్కిపోతారా? రోజూ నాలుగైదు గంటలు సైకిల్ రిక్షామీద పనిచేస్తే చిక్కిపోతారు... అని ఆమెకి తెల్సునా! కొత్తలో తాను ఒక్క మైలుకే అలిసిపోయేవాడు. అసలే ఎగుడూ, దిగుడూ...దానికితోడు యిద్దరేసి కూర్చొనేవారు. ఆ క్షణాలలో నరనరాలకీ పనిచెప్పి సైకిల్ తొక్కేవాడు... క్రమంగా అలవాటైంది... కాని, రక్తాన్ని పీల్చి, నరాలని ఎండవేసే పని...

ఇదంతా నీలతో తా నెలా చెప్తాడు?...తాను సైకిల్ రిక్షావాడుగా జీవితాన్ని గడుపుతున్నాడని తెలిస్తే, నీల తన అభిమానాన్ని చూపుతుందా ?· ఆమె తన నెంతగానైనా ప్రేమించవచ్చు. కాని దేనికైనా హద్దులున్నాయి. తాను బీద వాడనే సంగతి ఆమెకి తెల్సును ... ఏ చిన్న ఆస్తితోనో క్లిష్టంగా కాలం గడుపుతున్నాడని ఆమె అనుకొంటూంది. అయినా, తనని ప్రాణ సమానునిగా చూచుకుంటూంది... కాని తన నిజ జీవితం బయటపెడితే, తాను హద్దులు దాటి పోడూ ?

ఆ సంగతి హారికి బాగా తెల్సును...ఎంత ప్రేమించినా ఆమె స్త్రీ... తన ప్రేమికుడు చాలా గొప్పవాడయినా కాక

పోయినా, అధమం హీనుడైనా కాకూడదని అనుకోదూ?...
అది సహజం.

అందుకనే ఆ రహస్యాన్ని తాను చాలా జాగ్రత్తగా దాచాడు. పసివాడి కళ్ళల్లా అమాయకత్వం తొణికే ఆమె కళ్ళల్లోకి చూస్తూ అబద్ధాలు ఆడడం చాలా బాధాకరంగానే ఉంటుంది ... గులాబిని ముద్దుపెట్టుకుంటే ముల్లు గుచ్చుకున్నట్లు ఉంటుంది. ఆ బాధని ఏ ఒక్క క్షణంలోనూ తాను మరిచిపోలేదు. ఒక్క విషయంలో మాత్రమే ఆమెని మోసగించినా, ఆ విషయం తనని అంపశయ్యమీద ఉంచినట్లు బాధిస్తోంది...మనస్సు మాటిమాటికీ తిరుగుబాటు చేస్తోంది! స్వార్థం ఒక్కొక్కప్పుడు అంతరంగాన్నీ జయిస్తూంటుంది... చావు బ్రతుకుల సమస్యలలో మరీని...అందుచేతనే అంతటి అమాయికత్వాన్నీ తాను జయించగలిగాడు.

గోడని ఉన్న నీల ఫొటో అమాయకంగా చూసింది. హరికి గుండె జల్లుమన్నది.

తొందరగా దీపం ఆర్పి, గదికి తాళంవేసి హరి బయటికి నడిచేడు. వీధి దీపాలు చాలా ఎత్తులో ఉండడాన్ని వీధి అంతా అర్ధకాంతితో అస్పష్టంగా మాత్రం కనిపిస్తూంది. ఇళ్ళకి వొచ్చేసేవారందరూ వొచ్చేసినట్టుంది; జనసమర్ధమూ పలుచబడ్డది.

రిక్షాల షావుకారు ఇంటికోసమని, పార్కురోడ్డు పట్టాడు హరి... ఒక రూపాయి అద్దె ఇస్తే, అర్ధరాత్రిదాకా ఉపయోగించుకోవచ్చును. అదె మాత్రం ముందరే చెల్లించాలి. అంత

కన్న చాలా కఠినమైన విధులేవీ లేవు. అందరిలాగా రెండు రోజుల కొకసారి అద్దె తగ్గించమని తా నడుగడు; అందు చేతనే షావుకారు తరుచు తనకి మంచి రిక్షా ఇస్తూంటాడు.

రోడ్డువెంట నెమ్మదిగా నడుస్తూన్న హారికి మళ్ళా ఒకసారి నీలకళ్ళూ, ఆ అమాయకత్వమూ మనస్సులో మెదిలి ముళ్ళల్లే గుచ్చుకున్నాయి. రోడ్డుమీద ఆగి నిలబడి "ఈ పని మానేస్తేనో!...ఆమెని మోసగించ నక్కరలేదు;" అనుకున్నాడు హారి.

కాని, ఈ పని మాని, తానేం చేస్తాడు? ఎలా లేదన్నా, సగటున రోజుకి రెండు రూపాయలు తక్కువ దొరకదు...తన చదువూ, జీవితమూ గడిచిపోతున్నాయ్... ఒకరిచేత మాట పడనక్కరలేకుండా కొత్తలో తా నెన్ని వృత్తులకోసం ప్రయత్నించలేదు; ట్యూషన్లు చెప్తానన్నాడు; నెల కైదురూపాయి లిస్తామన్నారు. రోజూ పద్దులురాస్తే, నెలకి ఇరవై దొరకడం దుర్లభం అయింది. అవీ, షావుకార్లకి అణిగి, మణిగి, ఆత్మని చంపుకొని శ్రమిస్తేను. అప్పటి కన్న ఇప్పుడు నిరుద్యోగ సమస్య పెరిగిపోయింది. ఆ చిన్న ఉద్యోగాలుకూడా ఇప్పుడు దొరకవు. అయినా, ఆ ఉద్యోగాలని మాత్రం నీల గొప్పగా చూస్తుందని నమ్మిక ఏముంది?... ఈ పనిమాని తానేం చెయ్యగలడు?

తిరిగి కదిలాడు హారి యంత్రంలా. యజమాని ఇల్లు వొచ్చింది. హారి తన జేబులోని రూపాయి తీసి ఇచ్చాడు; షావుకారు చూపిన రిక్షా తీసుకుని బయటికి జాగ్రత్తగా

నడిపించేడు...రిక్షాని మోటుగా ఉపయోగిస్తే, మళ్లా రెండోనాడు ఇవ్వడు...షావుకారు. కనుచూపు దాటాక, సీటు ఎక్కి వెళ్ళసాగాడు బజారురోడ్డుపట్టి. మళ్ళా ఆలోచనలో పడ్డాడు హరి...నీల ఎందుకో పదేపదే జ్ఞప్తికొస్తూందీవేళ...తన అసత్యాన్ని ఈరోజు బలంగా వర్ణించడంవల్లనేమో! మనసంతా పాడైపోయింది.

ఈ ఊరొచ్చిన మొదటిరోజుల్లో తన కట్లాగే ఉండేది. ఆ దారిన వొచ్చినప్పుడల్లా ఆ కథ అంతా జ్ఞాపకం వస్తూ ఉంటుంది.

చిన్నప్పుడే తల్లీ దండ్రీ చచ్చిపోయినా, బాగా వయస్సు వచ్చేదాకా తాతయ్య పెంచాడన్న కష్టం అనిపించలేదు. ఇంటరు ప్యాసయేదాకా తాతయ్య చదువు చెప్పించేడు; ఓ రోజుని అతను హటాత్తుగా చచ్చిపోయేడు. బాగా జ్ఞాపకం...ఆ రోజునే తన కిక్కడ కాలేజీలో సీటు వచ్చినట్లు ఉత్తరంకూడా వచ్చింది.

తాను తెగ ఏడిచాడు; జీవితంలో తనకున్న ఒక్కడూ పోయాడు కాని, మీరునాడు అప్పులవాళ్ళందరూ వచ్చి ఇల్లూ ఆస్తీ స్వాధీనం చేసుకున్నాక, తనదికాని ఆ ఇంట్లోనించి తనని వెళ్ళిపొమ్మన్నాక మరీ ఏడిచాడు.

చేతిలోవున్న కొంచెం డబ్బుతో తా నీ వూరు వచ్చాడు. ఒకవైపు చదువు సాగించడం ఎలాగా అనే ఆతృత; ఇంకొకవైపు తిండికి గడిచే దెలాగ అనే బాధ, చేతిలోవున్న డబ్బు వారంరోజుల్లో అయిపోయింది.

అప్పుడు తా నెంతమంది దగ్గరకి తిరిగేడు; ఎన్ని రకాల మనుష్యులకాళ్లు పట్టుకున్నాడు; నెలకి ముప్ఫై రూపాయలిస్తే ఏమయినా చేద్దామనుకున్నాడు. కాని, దేశాన్నంతనీ పీడిస్తున్న సమస్యే నిరుద్యోగం! తనకి డిగ్రీ అయినా లేకుండా ఏం ఉద్యోగం దొరుకుతుంది?

వీధులన్నీ తిరిగాడు...కాళ్ళరిగేదాకా, ఓపిక తగ్గేదాకా, దారివెంటపోయే సైకిల్‌రిక్షాలనీ, వాటిని నడిపించే తన దేశదరిద్రంలాంటి ఆ శరీరాలనీ చూస్తే, తన కష్టానికి ఆలోచన కలిగింది. తనకే ఓ సైకిల్‌రిక్షా ఉంటే! ఒక సైకిల్‌రిక్షావాడిని కనుక్కున్నాడు. రిక్షా ఎలా దొరికేదీ, ఆ వివరాలన్నీ తెలుసుకున్నాడు.

ఆ రోజే, అలాగ, ఈ వృత్తి మొదలుపెట్టాడు. ఆ వీధికి మొదటిసారి అలాగ వచ్చాడు. అప్పట్నించీ ప్రతి రోజూ వస్తూనేవున్నాడు. మనస్సు బాగులేనప్పుడల్లా ఈ కథ అంతా జ్ఞప్తికివస్తూ ఉంటుంది...ఆ తరువాత తాను కాలేజీలో చేరేడు. కాని, రిక్షాపని చాలా కష్టంగా ఉండేది. ఒకొక్కరోజు ఏడుపువచ్చేది—కష్టం ఎక్కువయి. ఎందుకింత శ్రమపడుతూ జీవించడం అనుకున్నాడు. చాలాసార్లు చచ్చిపోవడానికే సిద్ధం అయాడు.

ఆ అవస్థలో నీలతో పరిచయం అయివుండకపోతే నిజంగా తా నలా చేసేవాడే! కాని ఆమెతో పరిచయం అయాక, తన ఎడారి జీవితంలోకి వసం[illegible]ంచినట్లయింది. తా నెలాగైనా డిగ్రీ తీసుకు[illegible]

వివాహానికి సమ్మతిస్తాడు అని తెలిశాక, జీవితంమీద తనకే అభిమానం కలిగింది...ఎందుకు జీవించాలో బోధపడింది... ఒక హద్దు తరువాతనైనా, తాను సుఖంగా జీవించగలడని తనకు తెలిసింది.

బజారుదగ్గిరి కొచ్చేడు హరి...ఆలోచించుకుంటూ ఆ దీపాలని చూచేసరికి, హఠాత్తుగా అతనికి జ్ఞాపకం వచ్చింది—మర్నాడు దీపావళి అని—నీలకి ఏదైనా చక్కటి బహుమతి ఇవ్వాలి...ఈ రోజు బేరం బాగా ఉంటే...

"ఏయ్ రిక్షా...!"

"బాబూ..."

హరి సైకిల్ దిగి, పిలిచినవారిదగ్గిరికి రిక్షా తీసికెళ్ళాడు.

"మాడరన్ కాలనీ..."

ఒక యువకుడు రిక్షాలో కూర్చున్నాడు...హరి సైకిలెక్కి తొక్కడం ప్రారంభించేడు...దీపాలకాంతుల మధ్య నించి. రోడ్డు కొంచెం ఎగుడు...బలంగా త్రొక్కాలి.

జంక్షన్ దగ్గర పాట్రల్ చేస్తున్న కాన్‌స్టేబిలు హరివైపు చూచి, వికటంగా చిన్ననవ్వు నవ్వాడు. హరి నవ్వుతూనే "సలాంబాబు!" అన్నాడు...అతని మామూలు ఇచ్చేస్తానని అది [illegible] .లేకపోతే, లైటు వెలగడంలేదనో, బెల్లు [illegible] పెడతాడు...

ఇరవై నిముషాలలో మాడరన్ కాలనీలోకి వచ్చాడు హరి. యువకుడు దిగి, ఇవ్వాల్సిన పన్నెండణాలూ ఇచ్చి, వెళ్లిపోయాడు. దగ్గరవున్న, జంక్షన్ ప్రక్కకి రిక్షాతీసి నిలబడ్డాడు హరి.

"బేరం తగిలిందా తమ్ముడూ ?"

ప్రక్కనే నిలబడివున్న వెంకాయ్ పలకరించాడు నవ్వుతూ, వాడికి హరి అంటే చాలా అభిమానం.

"ఆఁ...బజార్నించి."

"ఒకరా ఇద్దరా ?"

"ఒక్కరే"

"బాగుందిరా...నాకు ఇద్దరూ కలిసి స్టేషన్నించి అర్థరూపాయి ఇవ్వడానికి బేరం ఆడేరు... !"

హరి జవాబు చెప్పలేదు. అత నాక్షణంలో నీల తనని గుర్తించితే ఏమవుతుందో లెక్క వేసుకుంటున్నాడు.

"బీడీ ఉందా తమ్ముడూ ?"

"లేదురా—ఉండు—తెస్తాను"

హరి ప్రక్కనున్న షాపుకి వెళ్ళి బీడీలుకొని, తా నొకటి వెలిగించి, ఒకటి వెంకాయికిచ్చాడు.

"నువ్వు మంచోడివిరా తమ్ముడూ; ఎప్పుడడిగినా లేదనవ్ !"

"దానికేంరా !" అన్నాడు హరి నవ్వుకుని.

ఇద్దరూ బీడీలు కాలుస్తూ, కాంతిలో కరిగిపోతూన్న పొగలవంక చూస్తున్నట్లున్నారు...కొంచెంసేపు నిశ్శబ్దంగా గడిచిపోయింది.

ఇంతట్లో వెంకాయ్ నెమ్మదిగా "ఒరేయ్...ఒకటడిగేదా తమ్ముడూ ?" అన్నాడు.

"అడగరా !"

"మరి—నువ్వు పెళ్ళిచేసుకున్నావా ?"

హరి గుండె ఒక్కసారి ఝల్లుమన్నది...ఆ కళ్లు మరొక్కసారి అతనికి జ్ఞప్తికి వచ్చాయి.

"లేదురా..."

"మరి...ఇలా ఉండిపోతావురా ?"

"నేను ముసిలాణ్నయిపోయానా వెంకాయ్?" ఇద్దరూ నవ్వుకున్నారు.

"మరి—నువ్వో ?" అన్నాడు హరి.

"అదేరా...కొంచెం రోజుల్లో చేసుకుందామని..."

ఇప్పుడు తెలిసింది హరికి...వెంకాయ్ ఆ సంభాషణ ఎందుకు ప్రారంభించాడో.

"మరి—పిల్ల కుదిరిందా ?"

"ఆ—కుదిరినట్టే తమ్ముడూ...దానిమీద మన సుంది...ఆళ్ళ మనుసులూ ఒప్పుకున్నారు...దానికి నామీద ఇష్టమే...కాని..."

"ఊఁ...మరేం ?"

"మరి...నేను తాగడం మానేస్తేగాని పెళ్ళిచేసుకోడం ఇష్టంలేదురా."

"నువ్వు-తాగుతావా వెంకాయ్ ?" ఆశ్చర్యంగా అడిగాడు హరి.

"నువ్వంటే మంచోడివిగాని, ఈవృత్తిచేస్తూ తాగనోడెవడూ?" అన్నాడు వెంకాయ్.

"మరి...పోలీసోళ్ళు..."

"ఓస్...ఆళ్ళనోకే కష్టేమూ!...పొహిబిషను రాక మునుపు ఊరికో దుకాణం కాని తమ్ముడూ, ఆ తరువాత వీధికొక టనుకో..."

నవ్వి ఊరుకున్నాడు హరి.

"అదే సిక్కు తెచ్చింది తమ్ముడూ...దాన్ని మాయజేసి పెళ్ళిసేసుకున్నా ఏం సుఖపడతానూ?...అందుకని, ముందే జాగర్తపడి, తాగుడు మానేసి..." పట్టుదలగా అన్నాడు వెంకాయ్.

"చాలా మంచిపని" అన్న

"అంతేలే. . ." అన్నాడు వెంకాయ్—మెరుస్తోన్న కళ్ళతో. . .సంతృప్తిగా.

వెంకాయ్ మాటలు విన్నాక హరి కెందుకో, తానొక కొత్త అనుభూతిని పొందుతున్నాననిపించింది... వాడి ఋజువర్తనం చూశాక, తనకి తానంటేనే సిగ్గువేయ సాగింది. . .ఆ విద్యావిహీనుడు, లోకం లెక్క ప్రకారమూ 'అనాగరికుడూ' ఆ రెండూ కాని తనకన్న ఎంత నిర్మలంగా, నిశ్చితంగా వ్యవహరిస్తున్నాడు!

హరి ఒకసారి వెంకాయ్ వైపు చూశాడు...వాడు బీడీ కాల్చుకుంటూ, ఆలోచనల్లో కరిగిపోయినట్లున్నాడు.. వాడి కళ్ళలో ఆ పిల్లా, రాబోయే రోజులూ, ఆ సుఖాలూ అన్నీ ప్రతిబింబిస్తున్నాయ్...అనుకున్నాడు—హరి.

కొద్దినిముషాలయేక వెంకాయ్..."పద—పేరడైజ్ కి పోదాం. అక్కడ మంచిబేరాలు దొరుకుతాయి..." అన్నాడు.

పేరడైజ్ సినిమాహాలు అక్కడికి దగ్గరకూడా... ఇద్దరూ అక్కడికి దారితీశారు—దారిలో ఆరోజంక్షను బీటు కానిస్టేబిలు గురించీ, ఆంధ్రరాష్ట్రం గురించీ ఇద్దరూ మాట్లాడుకుంటూ.

"నీకు చాలా తెలుసు తమ్ముడూ!"

అంటూ ... ప... "కాని..." అని ఏదో అన

బోయి ...

ఇద్దరూ పేరడైజ్ థియేటరుకు వచ్చేశారు. సినిమా అయిపోయేవేళ కావొచ్చింది...ఒకరూ ఇద్దరూ బయటికి వచ్చేస్తున్నారు.

దీపాల మిరుమిట్లుగొలిపే వెలుగులో రిక్షాలు ఆపి మిగిలిన రిక్షాలవాళ్ళకి కొంచెం దూరంగా నిలబడ్డారు హరి, వెంకాయ్... "మంచి బేరం దొరికితే, దీపావళికి నీలకి బహుమతి ఇవ్వవచ్చు" అనుకుంటున్నాడు హరి.

"ఏయ్ రిక్షా!"

ఎవరో వచ్చి హరి రిక్షాదగ్గర నిలబడి పిలిచాడు; హరి వెంకాయ్‌వైపు చూసేడు— "నువ్వెళ్లు" అన్నాడు వెంకాయ్.

హరి ఆ యువకుడి దగ్గరికి రిక్షా పోనిచ్చాడు.

"ఎక్స్టెంషన్స్‌కి వస్తావా?"

"వొస్తాను బాబూ."

మంచి బేరం దొరికింది—అనుకున్నాడు హరి...నీల పేరు చెపితే అంతే. ఈ బేరం మూడు రూపాయలు తక్కువ దొరకవు.

ఆ యువకుడు వెనుదిరిగి ఎవరినో పిలిచాడు...ఇద్దరూ రిక్షా ఎక్కారు. హరి ఈలోపున ముందుచక్రం సరిచేసుకున్నాడు.

"ఈ తెర—దించీ..."

హరి నెమ్మదిగా తెర దించి, బొత్తాములు పెట్టేడు. ఆ అమ్మాయి చీరకొంగు కాళ్ళ క్రిందినించి తీసుకొని, ముసుగు వేసుకున్నట్లు కూర్చుంది. "ఎవరూ చూడకూడదు-కామోసు !" అనుకున్నాడు హరి. తెర దించాక సైకిల్ త్రొక్కడం కష్టమే-గాలివాలు ఉండదు. కాని...

పని ముగించి "సరేనా బాబూ ?" అన్నాడు హరి.

"సరే...తొరగా పోనీ..." అన్నాడు యువకుడు.

బలంగా రిక్షాని తోసి, ఎక్కి కూర్చున్నాడు హరి... రిక్షాల మధ్యనించీ, ఇతర వాహనాల మధ్యనించీ రిక్షా సాగి పోతూన్నది. సినిమాదీపాల కాంతిని వదిలేసి మ్యునిసిపల్ దీపాల కాంతిలో ప్రయాణం సాగించింది.

కొద్ది నిమిషాలలో నాలుగైదు మలుపులు తిరిగి, ఎక్స్టెంషన్స్ రోడ్డు పట్టేడు హరి. రెండు మైళ్లు పైచిలుకు, కొంచెం ఎగుడు...కాని మూడు రూపాయలు !

అమావాస్య ముందరి ఆకాశ నక్షత్రాలు ఆకాశాన్ని ఆవరిస్తూన్న చిన్న మబ్బులక్రింద దాగుంటున్నాయి... విద్యుత్కాంతి మందంగా రోడ్డుమీద పడి, ముద్దలు ముద్ద లుగా దారిని చూపుతున్నా, క్రమంగా పల్చబడి, తిరిగి రెండో దీపపు వెలుతురు వచ్చేలోగా రిక్షాకి కట్టిన నూనె దీపపు కాంతిని కొద్దిగా కనపడనిస్తున్నది...రోడ్డు ప్రక్కల ఉన్న చెట్లూ, చిన్నచిన్న రాతిగుట్టలూ, చీకటిలో కనిపించ డమే లేదు...

తిన్నగా ఉన్న రోడ్డుకి కాపలా కాస్తూ దీపాలు బారులు మాత్రం హరికి పదేపదే మరునాటి దీపావళిని తలపులోనికి తెస్తున్నది... రేపు అందరూ దీపాలతో ఇళ్ళని ఇలాగే అలంకరిస్తారు... నీల ఆ దీపాలమధ్య నిలువబడి తన బహుమతిని గర్వంగా చూసుకుంటుంది! తానా దీపాలమధ్య తన జీవితానికి దీపం చూపుతోన్న నీలని...

ఆలోచనలతో నిండిపోయిన హరికి ఆ నిర్మానుష్యపు రోడ్డులోని ఏకాంతత సహాయం చేస్తోంది... ఒకసారి వెంకాయ్ జ్ఞాపకం వచ్చాడు. ఆ 'పిల్ల' జ్ఞప్తికి వచ్చినపుడల్లా మెదిలే వాడికళ్ళలోని కాంతి అతనికి జ్ఞప్తికి వచ్చింది ఓరోజు తానూ అలాగ నీలతో వివాహానికి సిద్ధమై...

సైకిల్ చెయిన్ బలంగా లాగుతోన్న చప్పుడు చేస్తూంది... ఇంతవరకూ నిశ్శబ్దంగా కూర్చున ఆ ఇద్దరూ మాట్లాడుకోలేదో... లేక ఆ చప్పుడులో ఆ చిన్న శబ్దాలు కరిగిపోయాయో! ఇప్పుడు తాను ఆలోచనలనించి తేరుకున్నాక, వాళ్ళమాటలు తనకు వినిపించసాగాయి.

"చివరిపాట—చాలా బాగుందికదూ?"

యువకుడి గొంతుక... కొంచెం బిగ్గరగా...

"ఊఁ..."

"నాటకం మేనేజరు పాత్ర మాత్రం చాలా అసహ్యంగా ఉంది... నాకు నచ్చలేదు."

"అవును..."

ఆ కొద్ది అక్షరాలూ విన్నాక హారికి ఆ కంఠస్వరం ఎక్కడో విన్నాననిపించింది ... కాని మరుక్షణం నవ్వుకుని, వా శ్శైవరో—నే నెవరినో అనుకున్నాడు హారి...

ఈ రోజు తనని నీల వెంటాడుతోంది.

"నువ్వు—చాలా నిర్లిప్తంగా ఉన్నావు!"

ఫిర్యాదు చేస్తోన్నట్లు అన్నాడు యువకుడు. బహుశా ఆ మాటలంటూ, అతను ఆ యువతి గడ్డంకింద చెయ్యివేసి, ముగాన్ని తన వైపు...

"ఒంట్లో బాగా లేదు"

"మరి—ఇంతసేపూ..."

"ఇప్పుడే తలనొప్పి వస్తూంది"

ఒక్కసారి, నక్షత్రాలని కప్పి ఉన్న మేఘాలన్నీ నేలని పడి, ఆ అరక్షణంలోనే ఆకాశం అంతా విరిగి నేలని పడినంత ఆశ్చర్యంతో, వెనుదిరిగాడు హారి...ఎవరో చూసేందుకు... ఆ గొంతుక—నిజంగా తన నీల గొంతుకలా ఉంది! నీల...! ఈ యువకుడితో...

'కాదు...కాదు—కాదు. అది నా అనుమానం... అంతే' నని వాదించుకుంటూనే వెనుదిరిగి చూడబోయాడు హారి...కాని, ఆ క్షణంలో రిక్షా చీకటిలో ఉండడాన్ని ఆమెని చూడలేకపోయాడు...కాని—కాని ?

నీలేనా ?

అతనెవరు?...సినిమాకి వచ్చిందా?...తనతో చెప్ప లేదే!...అతనిని ప్రేమిస్తోందా?...అత నలా మాట్లాడు తాడు దేనికి?...అసలు...ఆమె నీలేనా? తన ఆలోచనలు తప్పుదారి పడుతున్నాయా?— అలా అయితే ఎంత బాగుండును!

ఆ గొంతుక—నిశ్చయంగా నీలదే...ఆమె నీలే... కాని కాదు — కాదు! పోలికలు అంతే...

కాంతికి దగ్గరగా వొచ్చింది రిక్షా — కాని హరి వెనక్కి చూడలేదు.

"వొద్దు—దూరంగా కూర్చో...చికాకుగా ఉంది..."

నీలే!—అక్షరాలా ఆమె గొంతుకే!...అనుమానం లేదు — నీల — కాని — గొంతుకలాంటి గొంతుక ఉండ కూడదూ?...ఉంటాయి— చాలా తరుచుగా ఉంటాయి. నీల ఎన్నడూ అలాచేయదు!...ఎన్నడూ...

రోడ్డు ఎగుడులో ఉన్నది...కాని ఉద్రేకంలో ఒళ్లు తెలియకుండా సైకిల్ తొక్కుతున్నాడు హరి ... చాలా వేగంగా రిక్షా సాగిపోతూంది... ముందర ఉన్న రోడ్డుని మింగేస్తూ ఒడలంతా ఆవరించిన ఈ కొత్త బాధ ఆదైహిక శ్రమని తెలియనివ్వడంలేదు.

"నువ్వు చాలా చిత్రమైనదానివి నీలా!"

నీ...లా!!

చేతిలోనించి హేండిల్ బారు జారిపోతుందనుకున్నాడూ హారి...కాని, అతని ప్రేళ్లు ఆ గ్రిప్స్‌చుట్టూ, చాలా గట్టిగా బిగుసుకున్నాయ్. రిక్షాలో ఉన్నది తన నీలా?...తాను తన జీవితంగా, ప్రేమమూర్తిగా, దైవంగా భావించుకుని, ఆరాధించుకొంటూన్న నీల !... తన సర్వస్వమూ...నీల !

అతని కాళ్లు పెడల్స్‌కి అంటుకుపోయినట్లు పనిచేస్తున్నాయి—రిక్షా ముందుకన్నా త్వరగా పరిగెడుతోంది. లాంతరు స్తంభాలు త్వరగా, త్వరత్వరగా ఒకటొకటే దూసుకుపోతున్నాయి కాలంతో పందెం వేసినట్లు రోడ్డు వెనక్కి పరిగెడుతూంది.

చుట్టూ చీకటి...ఆకాశంనిండా మేఘాలు, రోడ్డు ప్రక్కలని చెట్లు మార్గాన్ని మరీ అంధకారమయంగా చేస్తూన్నవి. చల్లగా వీస్తూన్న సముద్రపు గాలీ, సముద్రపు ఘోషా, ఏవీ హారికి తెలియడంలేదు...ఒక్కటే ఆలోచన... నీల తనకి ద్రోహం చేసింది; తనతో నటించింది; తనని మూర్ఖుడిగాచేసి, తన లోపానికి గాలం వేసి—తనని ఆడించింది !...దేవతనులాగ చూసుకున్న తన బంగారు నీల !

వాళ్ళింకా రిక్షాలో ఏమో మాటలాడుకుంటున్నారు. కాని ఆవేమి హారికి వినపడడంలేదు... తానేం చేస్తూన్నదీ కూడా అతను మరచిపోయాడు. శరీరంలో ప్రతీ నరమూ సెకనుకి కొన్ని వందల కదలికలు కదలుతోన్నది. రక్తం ఎని డిగ్రీల వేడితోనో మరిగిపోతూన్నది. అన్ని ఆలోచన

లనీ మింగి, ఒక్క ప్రశ్న రూపుదాల్చి తనని నిలబెడు తోంది...ఏం చెయ్యాలి ?

తన కీ ప్రపంచంలో ఉండిపోయిన ఒక్క ఆధారమూ, తనని సుఖంప జేసిన ఒక్క హృదయమూ—తాను నమ్మిన ఒక్క మనిషీ తనని మోసంచేసింది. బంగారం అని భ్రమిం చినదంతా ఇత్తడి అని తెలిసిపోయింది. నీల తానాడే... ఆటలకి తనని అడ్డం వేసుకోబోయింది...తానేంచెయ్యాలి ?

ఒక్కటే—ఒకటి జవాబు...ఒకే శిక్ష.

చీకట్లని చించుకుని, కోపంతో కాలుతోన్న కళ్ళల్లో త్రోసుకువస్తూన్న కారు హెడ్ లైట్లు హరి కళ్ళలోబడ్డాయ్. అతను త్వరగా నిర్ణయానికి వచ్చాడు...ఔను. ఆ కారు క్రిందికి వీళ్ళని త్రోసివేస్తే...అదే సరియైన శిక్ష. దానితో ఇద్దరూ మరణిస్తే—మంచిదే లేదా జీవితాంతం అయేదాకా, అంగవిహీనులుగా, అసహ్యించుకోబడుతూ కాలం గడుపు తారు...అది మరీ మంచి శిక్ష.

కాలమల్లే కారు దగ్గరికి త్రోసుకువస్తూన్నది. ఒకసారి రోడ్డుప్రక్కని ఉన్న రిక్షా హటాత్తుగా రోడ్డు మధ్యకి వచ్చే సింది...కాని, మరీ తొందరగా బ్రేకు వేసి, కారు దూసుకు పోయింది...అదృష్టం లోపలివాళ్ళకి అనుమానం అయినా కలుగకుండా రిక్షాప్రమాదం తప్పించుకున్నది.

ఆ ఉద్రేకంతోనే, ఆవేశంతోనే రిక్షాని పరిగెట్టిసు న్నాడు హరి. మరోకారు త్వరలోవస్తే బాగుండును...వాళ

రకం కనులచూసేవరకూ తనకి మనశ్శాంతి ఉండదు—ఆ ద్రోహులు...

హరి ఒడలంతా చెమటపోసింది...ఒడలంతా వర్షంలోలా తడిసిపోయింది...తానేం చేయబోతున్నాడు? వీళ్ళని చంపి...

"వాళ్ళేం తప్పుచేశారు!"

ఎవరో అడిగినట్లయింది...ఏం చేశారు?

ఇంతకన్నా ఇంకా ఏం చెయ్యాలి? తన జీవితంతో ఆడుకొన్నది నీల—తన నేడిపించి. అందుకు వాడు సహాయ పడుతున్నాడు...ఇంతకన్న ఏం చెయ్యాలి?

కాని...అనిపించింది హరికి. నీల తన భార్యకాదింకా. ఆమెమీద తనకేం అధికారముంది? తనని చేరనిచ్చినందుకు, ఆమెమీద అధికారం చెలాయించగలడా? ... మరోక రాస్థానంలోఉంటే, తాను క్షమించియుండును. కాని, హత్య చేసేంత నేరం, తనని ప్రేమించడంకన్న, నీల ఏం చేసింది? అందుకు...

మరోకారు వస్తూంది—రొదతో.

రిక్షా ఈసారి అనుమానంగానే రోడ్డుప్రక్క ఉండి పోయింది.

ఔను...వాళ్ళని చంపేందుకు తన కధికారంలేదు. అది ధర్మమూకాదు! న్యాయమూకాదు! ఆమె తనకి కొంత

ఆనందం ఇచ్చింది... అందుకు ప్రతిఫలంగా ఆ ఆనందం మరొకరికీ ఇచ్చిందని, తానామెని చంపలేడు ... ఆమె మూలంగా కొంత కాలమైనా సంతోషంగా గడిచింది ...

దాని అంతం ఏమైనాసరే—తానామెని చంపలేడు—.

తాను చేయవలసినదీ, చేయగలిగిందీ ఒక్కటే... ఇంక, జీవితాంతందాకా ఆమె ముఖం చూడడు. నమ్మించి ద్రోహంచేసినందుకు. అదే శిక్ష...జరిగినదంతా ఆమెతో వెల్లడిచేసి, ఆమె నిలువునా కృంగిపోయేలా తిట్టి ఆమెను పరిత్యజిస్తాడు,..అది చాలును.

తానామె నెంతగా ప్రేమించాడు! ఎంత అమాయికంగా ఆమెకి తన హృదయం ఇచ్చాడు! ఎంత తియ్యటి మాటలు చెప్పేది! తన జుత్తులో వ్రేళ్ళు దూర్చి ఎంత మెత్తగా మాటలాడేది! ఆ కనుల వెనుక అమాయికత్వమూ, నైర్మల్యమూ దాగిఉన్నాయనుకున్నాడు...కాని, ఆనైచ్యం తనకేం తెలుసు!

అంతే—తానామెని సిగ్గుపడేలా తిట్టి, ముఖంచూడడం మానివేస్తాడు... జీవితం అంతా కృళ్ళి, కుమిలేలా తిడతాడు...అదే శిక్ష.

రిక్షా మైలున్నరపైగా వచ్చేసింది...వేగంగానే పరుగెడుతోంది—ఇంకా మరి నాలుగైదు ఫర్లాంగులు.

ఇదంతా ఎప్పుడు చెయ్యాలి? రిక్షా దిగగానే నాలుగూ అని, ఈ విషయానికి అంతు చూసేస్తే? ఈ రాత్రితో అంతా సరి!

కాని...తన రహస్యం బైటపడుతుంది. ఇలా గూఢ చారిగా ఉండడానికే ఈ రాత్రి వచ్చేనంటే? అది మరీ నీచంగా ఉంటుంది. రేపు సాయంత్రందాకా తా నూరుకో గలడా?

ఆమెని దూషించి, ఆమె తలవంచుకుని వెళ్ళిపో యాక—వద్దంటున్నా హరి మనస్సులో ఆ విషయం బలంగా మెదలసాగింది.

ఆ క్షణంనించీ, తనకీ ఆమెకీ అన్ని సంబంధాలు విడి పోతాయి...ఒకరి నొకరు చూసుకోరు జీవితంలో. తనకోసం ఎదురుచూసే ఇం కెవరుంటారు? ఆ సముద్రం తనని పిలు స్తోంది—మోసంతో...క్రూరంగా...

తా నెవరి నలా ప్రేమించగలడు? నీలలాటి మనిషి—ఆ మోసం చెయ్యకుండా... తన కెవరు దొరుకుతారు?... తన నెవరలా ప్రేమిస్తారు?

ఒంటరిగా, దిగాలుగా, తనకి తానై కాలం వెళ్ళ బుచ్చగలడా? కాని, మరేం చేస్తాడు? నీలకి పూర్వపుస్థానం ఇవ్వలేడు...ఆ స్థానాన్ని ఎవరు పూరిచేస్తారు? ఎవరినీ, ఎలా నమ్ముతాడు? నీలే తనని మోసంచేసింది...ఎవరు చెయ్యరు?

నెమ్మదిగా కాలం గడుస్తోంది; త్వరగా రిక్షా గమ్య స్థానానికి దగ్గర అవుతూన్నది; కాలం సాగుతోన్నకొద్దీ హరి ఉద్రేకం తగ్గి ఆ స్థానం దుఃఖం ఆక్రమించుకోసాగింది.

ఈపైన తాను గడపాల్సిన జీవితం — దిగాలుగా జ్ఞప్తికి వస్తూంటే, హృదయం అంతా నీటితో నిండిపోసాగింది... ఎవరికోసం తా నిన్నాళ్ళూ ఇంత కష్టపడ్డాడు ?...ఎవరికోసం ఇంత కష్టపడతాడు ?

సమ్మెటపోటులాగ అనిపించింది.

లేదు...తాను నీలని పరిత్యజించి బ్రతుకలేడు. ఆమె మోసం చేసినందుకు తన జీవితాన్ని బలి యీయలేడు.

తాను చేయాల్సినదంతా, నీలచేత తప్పుని గుర్తింప జేయడమే. అప్పు డామె ఆశ్చర్యపడుతుంది — సిగ్గుపడు తుంది_ఏడుస్తుంది. తన కాళ్ళమీద పడి క్షమించమని ఏడు స్తుంది...క్షమిస్తే ?

లాభంలేదు...తా నలాగ చెయ్యలేడు...నీల నలాగ చెయ్యలేడు...నీల నలా పరాభవించడం తనవల్ల కానిపని... ఆమె కన్నీళ్ళముందు తన హృదయంకన్న ముందుగా తానే కరిగిపోతాడు...తానలా ఆమెని అవమానించడానికశక్తుడు.

కాని...... ?

ఆమెచేత ఆ విషయమైనా గుర్తింపజెయ్యకతప్పదు... అనుమానమైనా కలుగజేసుకోక తప్పదు...ఆ అనుమానంతో ఆమె బాధపడాలి. ఏమీ తేలక, ఏమీతోచక మధనపడాలి.

రిక్షా కిరాయి పుచ్చుకోవడం మానేస్తే ?...ఒక్కసారి ఆమె కళ్ళల్లోకి తీవ్రంగాచూసి, కిరాయి తీసుకోకుండా వెళ్లిపోతే ?

ఔను ఈ ఆలోచన బాగున్నది. వాళ్ళు చాలా ఆశ్చర్యపడతారు. ఆలోచిస్తే ఏమీా తేలదు. కాని తన కళ్లు నీల హృదయంలో అవ్యక్తమైన బాధనీ, భయాన్నీ కలిగిస్తాయి...తన నేరం ఆమెని చాలా బాధిస్తుంది...అంతరంగాన్ని పిండి పిండి...

అదే తాను ఆమెకి కావాలని కోరే శిక్ష....

ఆ ఆలోచన నచ్చింది హరికి...నీలకి తానుచేసిన సేవ కిరాయిలేని, స్వచ్ఛమైన సేవగానే ఉండిపోతుంది. ఆమెని ప్రేమించినందుకు తానామెకి కొంచెమైనా సహాయపడతాడు!...

అయినా, అసలు తానెందు కామెని శిక్షించాలి?

రిక్షా మామూలు వేగంతో సాగుతూన్నది... కను చూపులో గమ్యం—ఇళ్ళ దీపాలు అక్కడా అక్కడా కనిపిస్తున్నాయి.

హరి మనస్సులోని దుఃఖం ఇప్పుడు తన తీవ్రతని వెల్లడించసాగింది...తాను—మోసగింపబడ్డాడు! అందరూ కాక—నీల—తనని మోసగించింది...

అతని కళ్లు నీటితో నిండిపోయాయి...రిక్షా నెమ్మదిగా, లయబద్ధంగా నడుస్తోంది...

తన కార్యక్రమం గురించి మరోసారి ఆలోచించుకొన్నాడు హరి...తాను కిరాయి పుచ్చుకోకుండా వెళ్లిపోతే

ఏమౌతుంది ? నీల బాధ పడుతుంది—ఎందుకు తా నలాగ చేశాడో తెలియక...బహుశా, తనని పిచ్చివాడని అను కుంటే ?...ఏమో !...

ఆమెని శిక్షిస్తేమాత్రం తన కేమిటి లాభిసుంది ? తా నామెని శిక్షించకపోవడమే ఆ పరిస్థితుల్లో గొప్ప శిక్ష కాదూ ?

అసలామె తనకి చేసిన ద్రోహం ఏమిటి ?

ఇంతసేపూ, స్వార్థంక్రిందనీ ఈర్ష్యక్రిందనీ, బలంగా అణచిపెట్టిన ఈ ప్రశ్న బలవత్తరంగా తల ఎత్తింది... ఆమె తన ఆనందంకోసం ప్రయత్నించుకోవడం ద్రోహమా? తా నామెనుండి పొందే ఆనందంలో ఒక వంతైనా తిరిగి ఈయగలిగాడా ? ఏ అధికారంతో తానామెని శిక్షిస్తాడు ?

"రిక్షావాలా !... అలా ఆపు !"

నీల లోనుంచి గట్టిగా కేక వేసింది...అవును. ఆమె ఇల్లు వచ్చేసింది. ఒక్కసారి తెలివి తెచ్చుకొని రిక్షా ఆపాడు హరి.

తాను నీలని—చివరిసారి చూడబోతున్నాడా ? ఆ క్షణంలో నీలకీ తనకీ మధ్య కొన్ని యోజనాల దూరం ఉన్న ట్లనిపించింది హరికి.

దిగి, తెర బొత్తాములు తీశాడు హరి...లోన ఒదిగి కూర్చున్నది చీకట్లో తెల్లని మేఘంలా...నీల.

బయటికి ఉరికి నీల చకచకా గేటు తీసుకుని ఇంట్లోకి వెళ్ళిపోయింది—అనుస్తూ ఎదురొచ్చిన కుక్కపిల్లని లెక్క చెయ్యకుండా.

యువకుడు ఆమె వెళ్ళినవేపే చూసి చూసి, పర్స్ తీసి మూడు రూపాయలు హరికి యిచ్చి, రోడ్డువెంట సాగిపోయాడు.

ఆ గ్రుడ్డి వెలుగులో, సముద్ర ఘోషామాత్రం వినిపించే ఏకాంతంలో, హరి ఒక్కడూ మిగిలాడు...చేతిలోని రూపాయలవేపు చూశాడు...ఆ రూపాయలకోసం తాను—నీలని పోగొట్టుకున్నాడు!... తన జీవితమే పాడుచేసుకున్నాడు!

అసలు తా నెందుకు రావాలి ఈ బేరానికి? ... ఆ యువకుడు తననే ఎందుకు పిలిచి ఉండాలి! కాకుంటే ఎంత బాగుండును!

రిక్షాలో కూలబడ్డాడు హరి ఎన్నో వేలమైళ్ళ వేగంతో ప్రయాణంచేసి ఎన్నో సంవత్సరాల తర్వాత ఆగినట్లు ఉందతని పరిస్థితి.

కొన్ని క్షణాలలో అత నేడువసాగాడు... కన్నీరు పొంగి పొరలి రాసాగింది...తా నింక నీలని ప్రేమించగలడా?

కాదు...నీల_తన నింకా ప్రేమిస్తోందా? కట్లు తెంచుకున్న చెరువులా కన్నీరు పారిపోతోంది హృదయం అంతా ఎండిపోయేలా...

ఎంతసేపలా ఏడిచాడో హరి... ఎప్పుడో నిద్రపట్టి నట్లుంది బహుశా ఒక అరగంట-గంటైనా కావొచ్చును... రెండు గంటలు కూడా అసంభవం కాదు.

లేచేసరికి హరికి హృదయం అంతా తేలిక పడినట్లుంది. చుట్టూ చూశాడు...అంతా చీకటి... చిమ్మచీకటి—సముద్రంతో ఆడుకొంటూన్నది.

జరిగినదంతా ఏదో కలలాగ కనిపించసాగింది హరికి... నిజంగా...?

నీల !

అప్యాయంగా తల్చుకున్నాడు హరి ... అమాయకత్వం తొణికిసలాడుతూ, తనని ఎక్స్-రే చేసే ఆ కళ్లు— బలంగా జ్ఞప్తికి తెచ్చుకున్నాడు.

ఆ చీకట్లో, ప్రశాంతత ఏకాంతంలో, నిజంగా నీల తన కళ్ళని ఎత్తి తనతో మాట్లాడుతోందా ?

హరి నవ్వుకున్నాడు...ఎంత పిచ్చి ఆలోచన !

కాని...

మళ్ళా మళ్ళా ఆ కళ్లు జ్ఞప్తికి వస్తున్నాయ్ హరికి— ఆ చీకటిలో మెరుస్తోన్నట్లు — తనని పిల్చుతోన్నట్లు ... కళ్లు...ఎక్స్-రే చేస్తోన్నట్లు...

కొద్ది క్షణాలు...

జరిగినదంతా ఒక్క క్షణంలో అతని ముందర కది లింది—ఏదో కల వొచ్చిపోయినట్లుగా...

మళ్ళీ—ఆ కళ్ళు... .

అవును—అవి తెల్లగా ఉన్నాయి. అంతే! నిజంగా—అవి తనని ఇంక ఎక్స్-రే చెయ్యవు! నీలని తానింక దేవతగా గాక, మానవ కన్యనిగానే ప్రేమించగలడు.

ఒకసారి నవ్వుకున్నాడు హరి—ఇంక ముళ్లు గుచ్చుకో కుండా గులాబిని ముద్దుపెట్టుకోవచ్చును.

చేతిలో నలుగుతోన్న రూపాయి కాగితాలు జాగ్ర త్తగా జేబులో పెట్టుకున్నాడు హరి...రేపు దీపావళి—

అతను వెనక్కి బయలుదేరేడు.

చిక్కటి చీకట్లని రిక్షాదీపం తరుముతోంది.

సాంద్ర నిశ్శబ్దాన్ని అతని ఈలపాట భంగం చేస్తోంది.

— ఆంధ్రప్రభ, 25-8-54.

# భర్తలూ - భార్యలూ

"నువ్వో మనిషివేనా అని అడుగుతున్నాను.

నీకు ఓ డిగ్రీ ఉంది...కాని, సంస్కృతి ఉందా అని అడుగుతున్నాను...బుద్ధిఉంటే, నోరుమూసుకొని కూర్చో... జరిగినదానికే సిగ్గుపడు. మనుషులంటే రెండు కాళ్ళూ, రెండు చేతులూ అని అర్థంవుంటే నిజంగా నువ్వో మనిషివే... గుండెకాయే కాకుండా హృదయం కూడా కావాలంటే, నువ్వు మనిషివికావు! రాక్షసివి..."

మూర్తి ఉద్రేకంగా అన్నాడు...కోటు వేసుకుంటూ. కుర్చీలో కూర్చుని ఉన్న రమ చివాలున లేచి, "ఏమిటీ మీరంటున్నది?" అన్నది.

"నిన్నింక నోరుమూసుకోమని .... ఇప్పటికి నువ్వు చెయ్యగలిగినది చాలూ అని..."

"నాకు చెముడేమీ లేదు లెండి... అయితే, ఇదే చివరి మాట అన్నమాట. .కదూ?"

"అక్షరాలా..."

"నా గౌరవం అంతా మంటకలసినా సరేనంటారు."

"ఓ మనిషి జీవితంకన్న నీ గౌరవం ఎక్కువ కాదులే!"

"మీకు—నా గౌరవం..."

మూర్తి మాటలాడకుండా తల దువ్వుకుని బయటికి పోవడానికి సిద్ధపడ్డాడు. అడుగు వెయ్యగానే రమ అడ్డంగా నిలబడి, "ఒక మాట వినిపొండి", అన్నది.

"చెప్పు".

"మీ సంస్కృతీ, మీ విజ్ఞానమూ ఏ పోకడలు పోతున్నాయో నాకు తెలుసు. శ్యామలనే మీ రెందుకు ప్రిఫర్ చేస్తారో కూడా నాకు తెలుసు. గుండెలుంటే, నిజం వొప్పుకుని, మీ ఇష్టంవచ్చినట్టు చెయ్యండి, లేదా, మీకు తెలుసును—"

మూర్తి కళ్ళు ఎర్రబడ్డాయ్.

"ఏమిటి నువ్వనేది?" అన్నాడు.

"శ్యామల గురించి. అయినా, మీ రింక ఆ విష యంలో కార్యక్రమం మారిస్తే, నేను ప్రెస్ చెయ్యను, ఆలోచించండి__"

"స్టుపిడ్!"

కటువుగా మూర్తి అనడమూ, అతని చెంపమీద రమ వేళ్లు వేడిగా అంటుకోవడమూ ఒక్కసారే జరిగాయి.

"పొండి."

రమ త్వరగా తన గదిలోకి వెళ్ళిపోయింది. మూర్తి చకచక మెట్లుదిగి వెళ్ళిపోయాడు.

ఉదయంనించీ జరుగుతోన్న వాదన అనేక సార్లు హద్దులుదాటింది... కాని, అది ఇలాగ పరిసమాప్తి అవుతుం దని మూర్తి అనుకోలేదు. ఎన్నడూ లేనిది రమ ఈ వ్యవహా రంలో మరీ మొండిగా పట్టుపట్టింది. ఆ టైపిస్ట్ ఉద్యోగం కుమారికి ఇవ్వాలని ఆమె పట్టుదల.... శ్యామలకివ్వాలని తా ననుకున్నాడు.

మొదట రమ మామూలు మాటలతో చెప్పింది కాని, త్వరగానే ఆమె హద్దులు దాటిపోయింది. ఆమె శ్యామలను ఎందుకని తిట్టాలి? అప్పటికీ తాను సహించాడు__కాని... చివరి ఆమె మాటలలోని ధ్వనితో తాను భరించలేక పోయాడు. తాను తిట్టడం పొరపాటయితే...ఆమె...

"గుడ్ మార్నిగ్, మూర్తీ!"

విసురుగా వెడుతూన్న మూర్తిని చెయ్యి పట్టుకుని ఆపాడు వెంకట్రావు.

"ఏం, అంత ఉషారుగా ఉన్నావ్?"

"మామూలేలే నువ్వేం?"

"అది జన్మానికోసారి లే...కొంచెం కాఫీ తాగుదాం పద."

వాదించే ఓపిక ఉన్నట్లూ కనిపించలేదు మూర్తికి. యాంత్రికంగా హోటల్‌లోకి నడిచాడు.

"టూ స్ట్రాంగ్ కాఫీ..."

ఆర్డర్ చేసి వెంకట్రావు మూర్తి వేపు తిరిగి, "రోజులూ బాగాలేవా, భాయ్?" అన్నాడు, నెమ్మదిగా.

"ఏం?"

"బుగ్గమీద రాసి ఉందిలే."

తృళ్ళిపడి, యాంత్రికంగా తడుముకున్నాడు మూర్తి... స్టుపిడ్...స్టుపిడ్...

సర్వరు కాఫీ తెచ్చి పెట్టడంలో కొంచెం టేబిల్ మీదికీ, మూర్తికి బట్టలమీదికీ తృళ్ళింది.

"స్టుపిడ్!"

గట్టిగా అన్నాడు మూర్తి.

"షటప్..."

సర్వారు కోపంగా మీదికి లేచాడు. మూర్తి మొదట తెల్లబోయి, తరువాత తెలివి తెచ్చుకుని మరీ కోపంగా లేవడమూ, ఈసరికి హోటల్ మేనేజరూ, చుట్టూ ఉన్న మనుషులూ అందరూ కూడడమూ జరిగింది.

"జరిగింది పొరబాటే...కాని, మాటలు తిన్నగా రాకపోతే, నెత్తిన మరి కొంచెం కాఫీ పోస్తాను—" అంటూ లేచాడు సర్వారు.

చుట్టూమూగినజనంలో ఈ మాటలు విని చాలా మంది త్వరగా తమ సీట్లకి వెళ్ళిపోయారు. మిగిలిన వాళ్ళలో మేనేజరు జరిగిన సంగతి విచారించాడు. మిగిలినవాళ్లు వింటున్నారు.

"బట్టలు పాడుచేస్తే ఆఫీసుకి పొయ్యేదెట్లా? అంత కేర్లెస్‌గా సర్వ్ చేస్తే ఏమైనా అంటాము", అన్నాడు మూర్తి.

"ఐరన్ చెయ్యడానికి డబ్బులిచ్చుకుంటాను. అంతే గాని, మర్యాద విడిచి మాటలాడితే తిరిగి వాచ్చేపీ అవే" నన్నాడు రెట్టించి సర్వారు.

మేనేజరు ఇరకాటంలో పడ్డాడు.

"ఆఫీసర్లనిలాగ అవమానం చేస్తే హోటలెలాగ రన్ అవుతుందయ్యా?" అన్నాడు చివరికి.

"ఆఫీసరైతే?— ఎవరికి గొప్ప? ఎవరి వృత్తి వాళ్ళది. అందరమూ పనిచేసేది డబ్బుకోసమే", నన్నాడు సర్వర్.

"వొట్టి కమ్యూనిస్టు", గొణిగాడు వెంకట్రావు.

"డిస్మిస్ చేస్తాను", అన్నాడు మేనేజరు.

"మూడునెల్ల జీతం పడెయ్ వెంటనే వెళ్తాను", అన్నాడు సర్వర్— పైకి మడిచిన చొక్కా చేతులు తిరిగి క్రిందికి దింపుతూ.

ఎలాగో వెంకట్రావూ, మూర్తీ ఆ మధ్యనించి బయట పడి కౌంటర్ దగ్గరికి వచ్చేడు. బిల్లు చెల్లించి బయటికి నడవ బోతూండగా, "సార్! ఈ సారికి ఎక్స్క్యూజ్ చేసుకోండి...వాడి పని నేను పడతాను" అన్నాడు మేనేజరు— సర్వరు వినకుండా.

"సరేలే".

చికాకుగా అని మూర్తి విసురుగా బయటికి నడిచాడు. రెండడుగులు వేసి, "అంతా నీ మూలంగానే వొచ్చింది", అన్నాడు వెంకట్రావువైపు తిరిగి.

"నే నేం చేశాను భాయ్?" అన్నాడు వెంకట్రావు నిజంగా అమాయకుడిలాగ.

"నా దారిన నన్ను పోనిస్తే ఈ గొడవ అంతా వొచ్చేది కాదు. నీ మాటలు వింటే బాగయ్యే వ్యవహారం అంటూ ...గడ దనుకుంటాను".

ఇద్దరూ నిశ్శబ్దంగా నడిచారు. కొంతదూరం పోయాక, "ఒకసారి లోనికిరా...శ్యామల నిన్ను రెండుసార్లడిగింది", అన్నాడు వెంకట్రావు.

హఠాత్తుగా గ్రహించాడు మూర్తి—తాను వెంకట్రావు ఇంటిముందుకే వొచ్చాడని. అవతలి రోడ్డు వెంబడి వెళ్ళకపోతే, ఈ యింటినించి తప్పించుకోవడం అసంభవం.

"నమస్కారం సార్!"

నవ్వుతూ నమస్కరించింది శ్యామల. ఆమె తనని హేళనచేస్తోన్నట్లు అప్పుడప్పుడు మూర్తికి అనుమానం కలుగుతూండేది—ముఖ్యంగా అట్లా నమస్కరించినప్పుడు. ఇప్పుడా విషయంలో అన్ని అనుమానాలూ తీరిపొయ్యాయ్. తనని శ్యామల ఏడిపిద్దామని...

"లోపలికి రారూ?... రండి!"

భుజంమీద చెయ్యివేసి లోనికి తీసికెళ్ళాడు వెంకట్రావు. త్వరగా రెండు కప్పులతో కాఫీ తెచ్చి ఇద్దరికీ ఇస్తూ, "మూర్తిగారు చాలా సీరియస్‌గా ఉన్నారు", అంది శ్యామల.

"రోజులు బాగుండలేదులే", అన్నాడు వెంకట్రావు.

"ఆయనకేనా?" అన్నది శ్యామల రెట్టించి.

"ఆయనకే. మనలాటివాళ్ళ కింక పాడయే దాని కేముంది? అందులో ఈ రోజు..."

"మూర్తి ఎర్రగా చూడడంతో తగ్గి, ఒక్కసారి ఆగి పోయాడు వెంకట్రావు. వింటోన్నదల్లా ఈ కుట్రని గ్రహించి నట్లు శ్యామల, "అసలు సంగతి చెప్పరా ?" అంది వెంకట్రావుని.

వెంకట్రావు కాఫీ త్రాగడంలో నిమగ్నుడయిపోయి, మాట్లాడలేదు. శ్యామల మూర్తిదగ్గరికి వొస్తూ, "అసలేం జరిగిందండీ ! చెప్పరూ ?" అన్నది ప్రాధేయంగా.

"అది మీకు అనవసరం", అన్నాడు మూర్తి.

"పోనీండీ...అరే ! ఆ దెబ్బ ఎవరుకొట్టారు?"

మూర్తి చేతులోంచి కప్పు క్రిందని పడింది కాని బ్రద్దలు కాలేదు. శ్యామల త్వరగా తేరుకుని, అసలేం జరిగిందండీ ! ఏవరితోనైనా దెబ్బలాడారా ?" అన్నది బాధగా.

"అవన్నీ విని సంతోషించాల్సి ఉంటే మరోసారి చెప్తాను. ఇప్పుడు టైమ్‌లేదు."

ఒక్కసారి లేచాడు మూర్తి. కోపంతో నల్లబడిన అతని ముఖమూ, ఆకృతీ చూసిన శ్యామల, పోనీండి... చెప్పవద్దు. క్షమించండి-కూర్చోండి" అన్నది.

"అడగడం మీ ఇష్టం. చెప్పకపోవడం నా యిష్టం. క్షమించాల్సిం దేమీ లేదు", అన్నాడు మూర్తి తలుపు దగ్గర నిలబడి.

"నావి కాని విషయాలలో కలుగజేసికోడం నాదే తప్పుగా!" అంది శ్యామల.

మూర్తి ఒక్కసారి రమ మాటలు జ్ఞప్తికివచ్చి అలాగే నిలబడి శ్యామల కళ్ళల్లోకి చూశాడు. నిజంగా, శ్యామల ఎంత అందంగా ఉంది! కళ్ళనిండా వెల్లివిరిసే కాంతి; ముఖాన చిందులాడే అందం...

"మళ్ళీ వస్తారా ?"

జాలి కలిగించేలాగ అడిగింది శ్యామల. మూర్తి హఠాత్తుగా రెండడుగులు వెనక్కి వేసి, "ఇప్పుడే కూర్చుంటాను", అన్నాడు.

తెల్లబోయి, "నిజంగా క్షమించారా ?" అన్నది శ్యామల.

మూర్తి మరేమీ మాటలాడలేదు. ఇంత చక్కటి అమ్మాయిలోని సౌందర్యాన్నీ అందాలనీ, ఇన్నాళ్ళ నుంచి ఎంత అంధత్వంతో విస్మరించగలిగాడో ఆలోచిస్తున్నాడు. శ్యామల... శ్యామల...

రమ చెప్పినది నిజం... అధమం ఆమె ఆలోచించిన విధం.

"ఆ దెబ్బలు ఎవరు కొట్టారో తెలుసునా ?"

శ్యామల తల ఊపుతూ, "ఆ విషయం చర్చించాలని లేదు", అన్నది.

"అక్కర లేదు. రమ ఇలాగ కొట్టగలదనీ మీకు తెలియడం మంచిది", అన్నాడు మూర్తి.

"రమా ?" అన్నారు ఆశ్చర్యంగా వెంకట్రావూ, శ్యామలానూ.

"ఆఁ" అన్నాడు మూర్తి.

శ్యామల చిలిపిగా నవ్వి, "ఎంత ఘాటు ప్రేమయో!" అంది.

వెంకట్రావూ, తానూ నవ్వుకున్నారు. మూర్తి ఏదో ఆలోచిస్తూ ఉండిపోయాడు. గ్రహించి శ్యామల మళ్లా తగ్గింది. కొంచెంసేపు అయాక మూర్తి ఆఫీసుకి వెళ్ళిపోయాడు.

అక్కడికి ఆరోజు జరిగినవన్నీ మరిచిపోదామని అనుకున్నాడు మూర్తి. అయినా, ఆ రెండు సంఘటనలూ తాను ఎన్నిసార్లు దాచుదా మనుకున్నా అన్నిసార్లూ బలంగా బయటికి వస్తున్నాయి. "ఒకరిని అనడానికి తనకేమి హక్కుంది? భార్య తన మాట పడదు—— ఎందుకు పడాలి ?... అప్పుడు సర్వారే తీసిపొయ్యాడా ?"

వీళ్ళంతా మనుషులు... ఇప్పు డిప్పుడే మేలుకుంటున్న మనుషులు—అనిపించింది మూర్తికి. అంతరాంతరాలలో ఈ మేకువ వస్తూన్నందుకు తాను చింతించవలసినదీ, కోపగించవలసినదీ కన్న సంతసించదగినదీ ఎక్కువ ఉందనే విషయాన్ని అతను పదేపదే మననం చేసుకోసాగాడు. కాని, తన ఆత్మగౌరవానికీ, గర్వానికీ తగిలిన దెబ్బ మరీ బలంగా ఉంది. ఇల్లాలు కొట్టింది...సర్వారు తిట్టాడు. ఇంక ఏమిటి జరిగి బ్రతు

కుని మరీ విలువ లేకుండా చెయ్యగలదూ? అనిపించింది మూర్తికి.

కాని...తన ఎక్కువ ఏమిటీ?

ఆ ప్రశ్న మళ్ళా రావడంతో, జరిగినవన్నీ ఒక క్రొత్త దృక్పథం నిలిచి కనబడసాగాయి. వీళ్ళంతా తనకన్న ఏవిధంగానూ తక్కువవాళ్ళు కారు. తాను వాళ్ళందరికన్నా ఏమీ అధికుడు కాడు. ఒకరిని తిట్టడమైనా, నిందించడమైనా వాళ్ళమీాద అధికారం చెలాయించడం అయినా చెయ్యడానికి తనకేమీా అధికారం లేదు ... ఉదయం రెండుసార్లు తాను హద్దులు మీారేడు...రెండుసార్లూ పూర్తి అయిన మానవగర్వం తలయెత్తి తనకి నిజం చెప్పింది.

అవును...అవును—ఇప్పుడు తనకి నిజం తెలిసింది.

ఇంటికి బయలుదేరేడు మూర్తి...ఉదయంనించీ కారు మేఘాలతో నల్ల చీకటిగా ఉన్న మూర్తి హృదయంలో ఏదో వెలుగల్లే ప్రవేశించింది ఈ నిజం. ఒక్కసారి చిరునవ్వు నవ్వుకున్నాడు—దవడ తడుముకొని, జీవితంలో ఇలాంటి అనుభవాలే లేకపోతే ఇంక ఈ జ్ఞానం కలిగేదెట్లా? అనిపించింది ఆ క్షణంలో మూర్తికి. తనకి ఈరోజు నిజమైన మనుషులు కనిపించారు. అది చాలు. మానసికంగానూ, దైహికంగానూ, తనకి కలిగిన బాధ ఈ గుర్తు కలిగిందనడానికో గుర్తు...అంతే.

ఆలోచించుకుంటూనే ఇల్లు చేరేడు మూర్తి.

రమ ఏదో చదువుకుంటూన్నది. నెమ్మదిగా తలుపు తోసి వెళ్ళి గదిలో బట్టలు మార్చుకున్నాడు.

"కాఫీ !"

అనబోయి నాలిక కొరుక్కున్నాడు...తన కెవరి మీద, ముఖ్యంగా రమమీద అధికారం లేదు అని జ్ఞాపక మొచ్చి బయటికి వచ్చాడు. "సారీ! డిస్టర్బ్ చేస్తూన్నం దుకు. కాని, కాఫీ ఏమన్నా ఉందా? అన్నాడు. మూర్తి రమవంక చూస్తూ.

"ఆఁ, ఫ్లాస్కులో ఉంది."

చిరాకుతో అలా అని తిరిగి పుస్తకంలో నిమగ్న మయింది రమ. మూర్తి కాఫీ కప్పులో పోసుకుని రూమ్ లోకి వెళ్ళాడు. అయిపోయింది. రేడియో పెట్టుకుంటే పాకీస్తాన్ రికార్డులు వినొచ్చు...

నెమ్మదిగా ట్యూన్ చేసాడు. వ్యాపారం ప్రకటనలూ, తలనొప్పి అనౌన్సుమెంట్లూ లేకుండా ఏవో పాటలు వొస్తు న్నాయి. రెండు పాటలు వినేదాకా ఆ సంగీతాస్వాదనలో పడిపోయి, తరవాత జ్ఞాపకం తెచ్చుకుని రమ గదివైపు చూశాడు. ఆమె చదువుతోన్న పుస్తకం క్రిందని పడేసి ఏదో ఆలోచిస్తూన్నది.

సారీ...అనుకున్నాడు మూర్తి. ఈ యింట్లో రమని డిస్టర్బ్ చేసే పని తా నెందుకు చెయ్యాలి? రేడియో కట్టేసి బయటికి బయలుదేరాడు. రమ అట్లా ఆలోచిస్తూనే ఉంది.

క్రిందనిపడ్డ పుస్తకంతీసి చేతికందించి తెల్లబోయి చూస్తూన్న ఆమెవైపు తిరిగి చూడకుండా వీధిలో పడ్డాడు మూర్తి.

బీచ్‌కి పోయాడు. కొంచెంసేపు తిరిగి మూర్తి. వేసవి కావడాన్న అంతా మరీ సమ్మర్దంగా ఉంది. చాలాదూరం అట్లానే నడిచాడు — కొంతవరకూ తక్కువమంది ఉన్న ప్రదేశం దొరుకుతుందేమోనని.

"నమస్తే!"

శ్యామల నవ్వుతూ దారిప్రక్కన నిలబడ్డది.

"నమస్కారం!"

మూర్తి నవ్వుతూ అన్నాడు. ఆమె చిరునవ్వులో అతనికి అందాలు మరీమరీ ప్రస్ఫుటంగా కనిపించ సాగాయి.

"మరీ త్వరగా వెళ్తున్నారు పని ఉందా?"

"ఉంటే అంత త్వరగా నడవడం ఎందుకూ!"

ఇద్దరూ నవ్వుకున్నారు.

"మరి......?"

"ఈ మనుషుల్ని భరించలేక దూరంగా పోదామని."

"అరే, పాపం! నే నడ్డగించానా? వెళ్ళండి."

వింతగా చూశాడు మూర్తి. శ్యామల ప్రక్కకి తప్పుకున్నది. తా నన్నమాటలలో ఆ ఒక్కదానిమీదా బరువు వేస్తుందేం ఈమె?

"నాతో వస్తారా ?"

"రానిస్తారా ?"

"సంతోషంగా..."

శ్యామల మాటలాడకుండా బయలుదేరింది. రోడ్డు వెంబడి పోతున్నారిద్దరూ. క్రమంగా జనం పలచబడు తోంది. అస్తమిస్తోన్న సూర్యుడి కాంతులూ క్రమ క్రమంగా మందగిస్తున్నాయి.

"ఇక్కడ కూర్చుందాం."

మూర్తి ఓ ఇసుకతిప్పని సూచిస్తూ అన్నాడు. శ్యామల కూర్చుంది. మూర్తీ కూర్చున్నాడు తరువాత.

"ఇప్పుడు మిమ్మల్ని ఒక టడగాలని ఉంది", అన్నాడు మూర్తి సంశయిస్తోన్నట్లుగా.

చిరునవ్వుతోనే "కానీండి", అన్నది శ్యామల.

"ఉదయం... మూర్ఖంగా ప్రవర్తించానా ?

మళ్ళా నవ్వి, "ఆ ప్రశ్న నేనడగాల్సింది... మీరింత సెన్సిటివ్‌గా ఆలోచిస్తారనుకోలేదు", అన్నది శ్యామల.

"కాదులెండి—ఆ తప్పు నాదేనని నాకు దృఢంగా తెలుసు. నన్ను ఓ దృక్పథంనించి చూడడానికి మీరు అల వాటు పడ్డారు. వ్యక్తిగతంగా నా బాధలూ, నా అనుభూ తులూ, మీకు బాధ కలిగించే మూడ్స్ రూపాన మీమీద

రుద్దడం తప్పు అని నాకు తెలుసు...ఆ విషయం కొంచెం ఆలస్యంగా తెలిసింది. అంతే."

శ్యామల తల వొంచుకుని ఆలోచిస్తూన్నది.

"ఏమిటి ఆలోచిస్తున్నారు?"

మళ్ళా అడిగాడు మూర్తి.

"ఏమీ లేదు లెండి — అయినా, జరిగిన దంతా విచిత్రంగా కనిపిస్తోంది. ఆలోచించడానికి ఓ క్రొత్త దృక్పథం...

మూర్తి నెమ్మదిగా విని, "మీ పరిస్థితి గురించి మీ రెప్పుడూ ఆలోచించుకోరూ?" అన్నాడు.

"ఆలోచించి ఏం లాభం? బాధపడడంకన్న..."

"ఆలోచించినంత మాత్రాన వీటిని తప్పించుకో లేంగా!"

"అందుకని, ఎలాగూ తప్పని వీటినిగురించి ఆలోచించి మన సెందుకు పాడుచేసుకోవాలి?"

"వేదాంతం చెప్తున్నారు!" అన్నాడు తేలికగా మూర్తి.

"వేదాంతం కాదు లెండి—డిస్ [illegible]షన్. ఇంతకన్న నేనేం చేసేది?"

"వెంకట్రావు కే ఉద్యోగ [illegible] గా?"

"లేదు—వాడికి దొరక [illegible]

మూర్తి ఏదో అనబోయి ఊరుకుని, "మరి మీ జీవితం..." అన్నాడు సందేహిస్తూనే.

"అదిమాత్రం అడగకండి", అన్నది శ్యామల.

మరి కొంతసేపు కూర్చుని ఇద్దరూ లేచారు, వెనక్కి వెళ్ళడానికి. చీకట్లు పడుతున్నాయి. శ్యామలని ఇంటిదగ్గర విడిచి మూర్తి ఇంటికి బయలుదేరాడు. లోనికి వెళ్ళేసరికి రమ రేడియో దగ్గర కూర్చుని సంగీతం వింటోంది. చప్పుడు కాకుండా వెళ్ళడానికి ప్రయత్నించినా రమ వెనుదిరిగి చూసి, వాల్యూం తగ్గించి, అలానే కూర్చుంది. మూర్తి నిశ్శబ్దంగా క్రిందికి వెళ్లి భోజనం చేసివచ్చి, తన గదిలో పడుకుని ఏదో పుస్తకం తీసుకున్నాడు.

రాత్రి పన్నెండు దాటేదాకా వివిధ సంగీతాలు వినవస్తూనే ఉన్నాయి...కొంతసేపు సంగీతంతో కాలక్షేపం చేయగలిగినా, క్రమంగా మూర్తి కది బాధాకరం కాసాగింది.

కాని—అతను మాట్లాడలేదు. జరుగుతోన్నదంతా కొంచెం విచిత్రంగా కనిపిస్తోంది...రమకి.

సంగీతం అ[illegible] ఇంత అభిమానం ఎలా పుట్టుకొచ్చిందో అత[illegible]ం కాలేదు. తానెప్పుడు రేడియో పెట్టినా [illegible] రమ...

[illegible]ోందా ?

నవ్వుకున్నాడు మూర్తి. ఇంకా తనమీద పగ ఎందుకూ? చేసినదంతా ఆమె ఆయె అందులో. తాను తెలుసుకున్న విషయాలని తెలుసుకున్న తరవాత తన నెవరు ఏం చెయ్యగలరు? దేనికయినా తాను సంసిద్ధుడే!

అద్దంతీసి ముఖం చూసుకున్నాడు మూర్తి. ఆ నాలుగు వ్రేళ్ళ చాయలూ ఇంకా లేతగా కనిపిస్తూనే ఉన్నాయి; పలకమీద వారవడి దిద్దినట్లు. ఈ నాలుగు రేఖలూ; ఈ నాలుగు వ్రేళ్లూ...జీవితంలో ఒకటోపాఠం చెప్తూ చెప్తూ—రమ ఉంగరం తీసేసిందేమో!

నిద్రొస్తూంది. లైటు ఆర్పి పడుకున్నాడు మూర్తి.

♦ ♦ ♦ ♦

ఉదయంలేచి ముఖం కడుక్కునేసరికి మూర్తి ఓ వార్తని గమనించాడు; వంటమనిషి రాలేదు...రానేలేదు! అందుకని, కాఫీ సిద్ధంగాలేదు. మరికొన్ని క్షణాలకీ సిద్ధం కాకపోవచ్చునుకూడా.

బద్ధకంగా లుంగీ కట్టుకుని, క్రిందికి నడిచాడు. మెట్లు దిగేసరికి మరో సత్యం అతనికి జ్ఞాపకం వొచ్చింది—బోయ్ ఎనిమిదిలోపున రాడు కాని, రమ ఏడులోపునే లేస్తుంది!

తిరిగి మీదికి వెళ్ళి ఫ్లాస్కు తీసుకుని హోటలుకి నడిచాడు. హోటల్లో తాను కాఫీత్రాగి, ఫ్లాస్కులో పోయించి బయటికి వచ్చేసరికి ఏడుదగ్గర అవుతూంది. త్వరగా ఇంటికి చేరుకున్నాడు మూర్తి.

వెళ్ళేసరికి రమ గదిలో చికాకుగా పచారు చేస్తోంది. మూర్తి వెళ్ళి కాఫీ ఫ్లాస్కు టేబిల్ మీద పెట్టాడు. వెళ్ళి పోతూండగా రమ, "ఆ కప్పులో పోసినా, చాలా తప్పు లేదు..." అన్నది.

నెమ్మదిగా వెనుదిరిగి మూర్తి టేబిల్ దగ్గరికి వచ్చి, "సారీ...నిజంగా ఆ ఆలోచనే తట్టలేదు—" అని, కప్పు తీసాడు. సాయంత్రంనించీ అక్కడ ఉండడాన్న దానిలో ధూళిపడినట్లుంది. అది చూసి, రమ లేవబోయింది— త్వరగా నీళ్లుపోసి దాన్ని శుభ్రంచేసి అందులో కాఫీ పోశాడు మూర్తి. తరవాత కప్పు పట్టికెళ్ళి రమ చేతికి ఇచ్చి, "ఇంక వెళ్ళవచ్చునా?" అన్నాడు.

"వెళ్లండి."

తన గదికి వెళ్లి కూర్చున్నాడు మూర్తి. రమ అంత ఆశ్చర్యంగా ఒక్కసారి ఎట్లా మారిపోగలిగినదీ అతనికి అంతు పట్టలేదు... ఈ ఆత్మోత్కర్ష ప్రపంచం అంతటిలోనూ ఏక సమయంలో ఎట్లా ఉద్భవించినదీ తెలీలేదు.

"గమ్మత్తుగా ఉందిలే!" అనుకున్నాడు మూర్తి.

ఒకవేళ ఇవాళ వంటమనిషి రాకపోతే?...రమ వంట చెయ్యడం జరగదు— జరిగితే, దాని ఫలితాలూ చాలా ప్రమాదకరంగానూ ఉండొచ్చు. హోటల్‌నించి... రమకి పనికిరాకపోవచ్చును. అందులో ఆమె రుచులు మరీ ప్రత్యేకత— తాను ఒకటి రెండుసార్లు వంటమనిషి పనిగురించి ఏదో

అంటే, "ఏదైనా సరే — విమర్శించమంటే సిద్ధం. మీకు అసలు రుచులే తెలీవు," అన్నది రమ.

"హుం! నేను వండితే..."

రమ నవ్వి ఊరుకునేది అప్పుడు... భగవాన్! అనుకున్నాడు మూర్తి తరువాత ఆలోచనలకి తన పాకశాస్త్ర ప్రావీణ్యతని గురించి తానెందుకు వెల్లడి చేసుకోవాలి? ఇవాళ గరిటె పుచ్చుకోమంటుంది రమ—తప్పదు.

వే అవుట్! వెళ్ళిపోవడం...తనకి చాలా ఆఫీసు పని ఉంటుంది. క్రిందన బోయ్ ఉంటాడు కనక ఏ పరిస్థితుల్లోనూ రమ ఉపవసించక్కర లేదు.

లేచి బట్టలు వేసుకున్నాడు. పర్సు జేబులో వేసుకుని బయటికి వెళ్తోంటే, "వెడుతున్నారా?" అంది, చదువుకుంటూన్న రమ ఓ సారి తల ఎత్తి.

"ఆఁ..." అన్నాడు, సంశయిస్తూ, మూర్తి.

"వంటమనిషి రాలేదు."

"అవును, పోయి కాఫీ తెచ్చాను అందుకనే."

"కాఫీతాగితే సరిపోదుగా!"

"టిఫిన్ తెచ్చేదా?"

"ఒద్దులెండి..."

"మరి,"

"మధ్యాహ్నం భోజనంకూడా చెయ్యాలికదా!"

"చెయ్యాలి."

"మరి, మీరు వెడుతూన్నారు!"

"బోయ్ ఉన్నాడు."

"వాడికి వంటేం వచ్చునూ?"

"నడవటం వచ్చుగా! కేరేజీ పట్టుకుని తిన్నగా నడిచి వెళ్ళిపోతాడు!"

"ఆ హోటల్ తిండి నన్ను తినమంటారా?"

"మరి?"

"మీకు వంట బాగా వచ్చునుగా?"

"కొంచెం వొచ్చు—కాని..."

"ఈ ఒక్కరోజూ కొంచెం గడపండి— నేనా తిళ్ళు తినలేను. మరేం చెయ్యగలమూ?"

"నేనే వంట చెయ్యడమా!"

"మరేలాగా?"

మూర్తికి ఏడుపు రాలేదు; కోపమూ రాలేదు– నవ్వు వొచ్చింది.

"అలాగే!"

"నిజంగా?"

అని, నాలిక కరుచుకున్నది రమ.

"ఆఁ. అబద్ధం కాదు—"

"మరి, త్వరగా పదండి."

మూర్తి తిన్నగా వంట ఇంట్లోకి వెళ్ళాడు. మూడు నిమిషాల్లో తిరిగొచ్చి, "అక్కడ ఏం చెయ్యాలి?" అన్నాడు.

"వంట...పదార్థాలని తినేలాగ తయారు చెయ్యడం."

"అది సరే—అక్కడ ఏ గిన్నెలో ఏంవేసి ఏం చెయ్యడం? అని."

"బలే!... చాలా బాగుందండీ!... అదంతా నేను చెప్పేస్తే మీరు చేసేదేమిటీ?"

"వంట—"

"కబుర్లు చెప్పమంటే తయారు! పని దగ్గరికివొచ్చేసరికి, పనా ఇట్లా ఉంటుంది ..ఇవాళ భోజనం మానుకుంటాను లెండి—మీరు ఏ హోటల్లోనో హాయిగా తినండి."

"పోనీ—నీకూ తెస్తాను."

"ఉపకారం! ... వొద్దులెండి. అంతశ్రమ మీకెందుకూ?"

విచిత్రంగా అన్నది రమ—మళ్లా పుస్తకంలోకి వెళ్ళిపోతూ. విచిత్రంగా చూశాడు మూర్తి. "ఏమిటీ రమ ఉద్దేశం?" అని. తాను వంటచేసినా, శ్రమ కాదు కాని...

వంట మనిషి వచ్చి ఆలశ్యానికి కారణం వర్ణిస్తూంటే, మూర్తికి పెద్ద గండం గడిచినట్లుంది. వంటమనిషి మాటలేవీ అతనికి వినిపించలేదు గాని, "నయమే! ఈ పూట ఏకాదశీ వ్రతం అనుకున్నాను," అన్న రమ మాటలు మాత్రం వినిపించాయి.

"మనుషులు చిత్రం అయినవాళ్లు!" అనుకుని, తన గదిలోకి నడుస్తూ, "కాదులే! ఆడవాళ్లు విచిత్రం అయినవాళ్లు," అనుకున్నాడు మూర్తి. రమ అట్లా ఎందుకని ప్రవర్తిస్తూందో అత నెంతో ఆలోచించసాగాడు; కాని అంతుపట్టలేదు. "రమ మరీ చిత్రంగా తయారౌతూంది!" అనుకున్నాడు చివరికి.

♦ ♦ ♦ ♦

ఆఫీసునించి తిరిగి వస్తూన్న మూర్తి అనుకోకుండా వెంకట్రావుతో కలిశాడు. తప్పించుకుందామన్నా వీలులేని పద్ధతిలో మూర్తికి ఎదురుగావచ్చి వెంకట్రావు, "దయామయుడివి భాయ్! నన్నూ, చెల్లెల్నీ రక్షించావు,"అన్నాడు.

"నేను చేసిన దేముందిలే!...వచ్చిన అప్లికేషన్లలో ఆమెది ఉత్తమంగా ఉంది; ఆ విషయమే డైరక్టరుకి తెలియజేశాను," అన్నాడు మూర్తి.

"అది కాదులే! ... నీ మాజెస్టీగాని, ఏ అప్లికేషన్ ఉత్తమమో నిర్ణయించడంగాని ఈ రోజుల్లో మహా కష్టం—

అదంతా తరువాత ఆలోచిద్దాం కానీ, ఓ సారి ఇంటికిరా," అన్నాడు వెంకట్రావు.

"ఒద్దులే ... ఇంటిదగ్గర పని ఉంది," అని, అడుగు ముందుకు వేశాడు మూర్తి.

"చంపేస్తావు. శ్యామల నాతో మరీ మరీ చెప్పింది నిన్నోసారి రమ్మనమని. నువ్వు వెళ్ళకపోతే నాకు రాత్రి తిండి పెట్టదు," అన్నాడు వెంకట్రావు.

ఎవరినీ కాదనడం మూర్తికి చేతగాని పనుల్లో ఒకటి. ఇష్టంలేకున్నా, శ్యామలని చూడాలనిపించి, మూర్తి వెంకట్రావుతో నడిచాడు. వెళ్ళేసరికి శ్యామల జడ వేసుకుంటూన్నది; సగంలో ఆపి, మూర్తికి స్వాగతం ఇచ్చింది.

"మీపని కానివ్వండి," అన్నాడు మూర్తి.

"అది ఎప్పటికీ పూర్తికాదు లెండి—" అని, చిన్న నవ్వుతో, మీరు వస్తారని మొన్నటినించీ— ఆర్డరు వొచ్చిన దగ్గిరనించీ—చూస్తున్నాను," అన్నది శ్యామల.

"ఎందుకనీ?"

"ముందర కృతజ్ఞత చెప్పుకోడానికి...తరువాత..."

"ఊఁ..."

"ఎప్పుడు జాయిన్ అవమంటారో అడగడానికి."

ఆమె ఏదో దాస్తోందని మూర్తికి అనుమానంగానే ఉంది. అయినా, అతను ఆలోచించేలాగ లేడు. కొంచెంసేపు

లోపలికి వెళ్ళి శ్యామల టీ తెచ్చిఇస్తూ, "మేం చూపే కృతజ్ఞత ఇంతకన్న ఏముంటుంది?" అన్నది, ప్రశ్నిస్తోన్నట్లు.

మరీ దగ్గరగా ఉన్న శ్యామల ఆ జవాబునీ చెప్తోన్నట్లే కనిపించింది మూర్తికి— ఆ టీ కన్న...

మాటలాడకుండా టీ ముగించి, వెడతానని లేచాడు మూర్తి.

"ఇంకా విషయాలు చెప్పాల్సి ఉంది," అన్నది శ్యామల.

"కానీండి—" అన్నాడు మూర్తి. అక్కడ గడపబోయే ప్రతీ క్రొత్త నిమేషమూ అతన్ని క్రమంగా పాడు ఆలోచనల లోనికి, క్రొత్త ఉద్దేశాల దగ్గరికే లాగుకుని పోతుందని అతని భయం.

"నా డ్యూటీ మీ దగ్గర ఉండేదని అనుకున్నాను. మరో సెక్షన్‌లో వేశారుటగా!" అన్నది శ్యామల.

"అదెవరు చెప్పేరూ?" అనుమానంగా అడిగాడు మూర్తి.

"నిజం అయ్యాక ఎవరు చెప్తేనేం?... కాని, అలాగ ఎందుకు జరిగిందీ?" అన్నది శ్యామల.

నిజానికి ఆ విషయం తనకే తెలీదు — జరిగినదంతా డైరెక్టరు తనని పిలిచి స్టెనోలని మార్పు చెయ్యమని చెప్పడం...అతనిని ప్రశ్నించే అలవాటూ, అధికారమూ కూడా

మూర్తికి లేవు. అయినా, ఆ క్రొత్త ఏర్పాటూ కొన్ని విధాల ఎస్కేపిస్టు మూర్తికి మంచిగానే కనిపించింది. సరే నన్నాడు. డైరెక్టరుస్టెనో మూర్తి దగ్గరకీ, క్రొత్త స్టెనో డైరెక్టరు దగ్గరికీ మారారు.

"అది నాకూ తెలీదు—నేను ఆలోచించనూ లేదు," అన్నాడు మూర్తి. "అయినా, అందులో నష్టం ఏముందీ?"

"లాభ నష్టాలకోసం కాదు లెండి, నే నడుగుతోన్నది. మీరు విషయాలు ఇంకోలా ఆలోచిస్తారనుకున్నాను. అయినా నేను విన్నదానిని బట్టి, మీ జోక్యము లేదనే అనుకోవాలి..." శ్యామల నెమ్మదిగా చెప్పుకుపోతూ ఆగింది.

"మీరు విన్నది ఏమిటీ?"

"రమ డైరెక్టరుగారి భార్యతో మాట్లాడి, మీ టైపిస్టునీ, ఆ స్టెనోనీ మార్పించారని."

ఒక్క క్షణం దిగ్భ్రాంతుడయాడు మూర్తి.

"అదెవరు చెప్పేరూ?"

"నిజం అయ్యాక ఎవరు చెప్తేనేం లెండి."

అలవాటల్లే అన్నది శ్యామల.

"ఇది నిజం అని అంత నిశ్చయం ఏమిటీ?"

మీకూ తెలుస్తుంది—కొద్దిరోజుల్లో, ఒక్కటే—నేను మీతో అబద్ధాలాడాల్సిన దేమీ లేదు. నేను బాధపడు

తోన్నది రమకి ఇలాటి భయం కలుగజేశానసే. నేను చెయ్యబోయే ఉద్యోగానికి ఈ సూచన చాలా శుభకరమైన ప్రారంభంగా కనిపించలేదు. మీతో చెప్పకుండా ఉండలేకపోయ్యాను——"

హఠాత్తుగా లేచి "సరే మీ ఇష్టంవచ్చినట్లు చెయ్యండి, మరి వెళ్తాను." అన్నాడు మూర్తి.

తెల్లబోయి, "కోపం వచ్చిందా?" అన్నది శ్యామల.

అసహ్యంగా కనిపించింది ఆ ప్రశ్న అతనికి. జవాబివ్వకుండానే, త్వరగా రోడ్డుమీదకివచ్చి, ఇంటిదారి పట్టేడు.

రమ ఏమని చెప్పి ఉంటుందీ? డైరెక్టరు భార్యకీ, రమకీ ఎప్పుడూ మంచి స్నేహం లేదు. ఆవిడ వయస్సులో బాగా పెద్దదవడమూ, రమ కన్న అనేక విషయాలు భిన్నంగా ఆలోచించడమూ వాళ్ళ స్నేహానికి అడ్డువచ్చాయి. ఇప్పుడు రమ వెళ్ళి ఆవిడతో ఏం చెప్పింది? తనని చాలా గౌరవంగా చూసే డైరెక్టరు ఈ మార్పు చేయాలని సూచించినప్పుడు మూర్తి కొంచెం బాధపడినా, రొటీన్ లే అనుకుని సరిపుచ్చుకున్నాడు. కాని, ఇదంతా విన్నాక, తన పరిస్థితి తనకే చాలా సిల్లీగా కనిపించసాగింది. తానేదో అందరికళ్ళూ కప్పి మహా నేరం చేస్తోన్నట్లూ, దానికి రమకి కావాల్సిన రక్షణ ఆ ముసలమ్మ ఇచ్చేట్లూ...చాలా సిల్లీగా కనిపించసాగింది.

అప్పటిదాకా రమ ప్రవర్తనని, ముఖ్యంగా, తనని చెంపకాయ కొట్టాక, అతను కోపంతోకన్న వింతగా పరి

కించసాగాడు—ఆ ప్రవర్తనలో కోపం కలిగించడానికే ఎక్కువ కారణాలు ఉన్నా, తనకి సహజంగా కోపం త్వరగా రాదు; అది త్వరగా వొచ్చిన ఒకటి రెండు సార్లూ క్షణాలలో దానికి ప్రతిక్రియలూ, శిక్షలూ వచ్చేశాయి. తాను కళ్లు తెరిచాడు; తన తప్పు గ్రహించాడు. రమ తొందరపడ్డది; నిజంగా. కాని, అది తాను పట్టించుకోలేదు. సాధ్యమైనంతవరకూ, తన సౌఖ్యంకోసం ఆమె ఎలాగ పాటుపడాలని అనుకుంటున్నాడో అట్లానే తానూ, ఆ హద్దులదాకా సాగుతూనే ఉన్నాడు.

కాని...ఇదేమిటి ?

ఏ గౌరవం తాను రమకి ఇయ్యజూచాడో ఆ గౌరవాన్ని రమ దక్కించుకోలేక తనని ప్రపంచం కళ్ళలో ఎందుకని ఎక్స్పోస్ చెయ్యాలి ? తన ప్రవర్తనా, సహనమూ, రమలో ఉండే వ్యక్తిత్వంపట్ల తనకి ఉన్న గౌరవంమీద ఆధారపడి ఉంది; ఆ వ్యక్తిత్వాన్ని ఆమె కోల్పోయాక, ఈ సహనానికి ఆమె అర్హురాలు అవుతుందా ?

తాను చేతగానివాడు కాదు—అధమమూ, ఏ పరిస్థితుల లోనూ తన అశక్తతనించి తప్పించుకోలేని చేతగానివాడు కాదు. అవసరం అయితే, తన నిండుగర్వాన్నీ అతిశయాన్నీ, రమ మీద చూపించగలడు. తనలో మిగిలిపోయిన సంస్కృతీ పూర్తిగా మాసిపోని సహనమూ మాత్రం తన ప్రవర్తనని అలా చేయకుండా మార్చాయి...

అలాగ ఆలోచిస్తూన్నకొద్దీ మూర్తికి రమమీద కోపం ఎక్కువకాసాగింది. శ్యామల అనడం మూలాననేమో అని అతని కొకక్షణం సందేహం కలగకపోలేదు—కాని, శ్యామల చెప్పినదానిలో కోపం కలిగించేదానికన్న ఆలోచనకే, పరిస్థితిని అర్థంచేసుకోడానికే అవసరం కలిగించేది ఎక్కువ ఉందని అనిపించింది.

ఇంటిదగ్గరికి వచ్చేసరికి మూర్తికి రమమీద కోపం పూర్తిగా వచ్చింది — ఏ స్వోత్కర్షతో ఆమె తనని ఎదురొ్కందో, ఆ స్వోత్కర్షమీదనే తీవ్రంగా దాడిచేయ్యడానికి కావలసినంత కోపమూ వచ్చింది— ఇంక అది కార్యరూపం దాల్చి, పొంగల్లే వొచ్చి మీదని పడడమే—ఇచ్చిన ఒక్క అవకాశాన్నీ జారవిడుచుకొన్నది రమ. ఇంక ఆమె అనుభవిస్తుంది.

లోపలికి వెళ్ళేసరికి ఈ వరద అంతా బయటికి వెల్లుబికే అవకాశం కలుగలేదు—రమ ఎవరో అమ్మాయితో మాట్లాడుతోంది. ఒక్కసారి వీరివుబురివైపూ చూసి, అనాలోచితంగా తన గదివైపు కదిలాడు మూర్తి.

"మీ కోసమనే చూస్తున్నాను; రండి—నా స్నేహితురాలు కుమారిని పరిచయం చేస్తాను..."

మొరుపు దెబ్బలాగ తగిలింది మూర్తికి... ఈ పరిస్థితిని అతను ఎన్నడూ ఊహించుకోలేదు! ముందు నుయ్యా...

"నమస్కారం, మూర్తిగారూ!"

కుమారి చేతులు జోడించింది—వినయం ఉట్టిపడేలా, ఎంతో భక్తి ఉన్నదానిలా.

"నమస్కారమండి—" తేల్చి తేల్చి అన్నాడు మూర్తి.

"కూర్చోండి——కాఫీ తెస్తాను," అని, అతను జవాబు చెప్పేలోగానే లోపలికి వెళ్ళింది రమ.

"మీ దర్శనం చేసుకుందామని వచ్చాను," అన్నది, త్వరగా సంభాషణని ప్రారంభిస్తూ కుమారి.

ఈ గొయ్యిని తాను చాలా జాగ్రత్తగా గెంతకపోతే, అందులోపడి బయటికి రావాల్సి ఉండదని మూర్తికి తెలుసును. అయితే, ఆగొయ్యికి తాను దగ్గరగా వొస్తూన్నాననే విషయం తప్ప మరేమీ తెలీదు. కుమారి మరీ అంత వికారంగా లేకపోయినా, ఒకసారి చూశాక మరోసారి చూడాలని అనిపించే మనిషిమాత్రం కాదు...సంభాషణ మరీ కష్టంగా ఉంది.

"చాలా సంతోషం," అన్నాడు పొడి జవాబుగా మూర్తి.

"అంటాముగాని, మిమ్మల్ని చూస్తే, ఎంత చికాకుగా ఉన్నారో తెలుస్తోంది," అన్నది కుమారి.

"మీరు చాలా గొప్ప మనస్తత్వశాస్త్రజ్ఞులనే విషయం నాకు తెలీదు లెండి," అన్నాడు వ్యంగ్యంగా మూర్తి.

"అంత పొగడ్తకి నేను అర్హురాలినీ కాదు."

బోరింగ్‌గా ఉంది— అనుకున్నాడు మూర్తి.

"మీరు మరీ మాడెస్ట్!" అన్నాడు ఆ గొంతుతోనే.

"థాంక్స్... " అని, కొంచెం ఊరుకుని, "మీతో ఒక మనవి చేసుకుందామని వచ్చాను," అన్నది కుమారి.

"కానీండి," అన్నాడు మూర్తి.

కాఫీ తెచ్చి టేబిల్ మీద ఉంచుతూ, "ఆమె మీ ఆఫీసులో ఏదో ఉద్యోగానికని ప్రయత్నిస్తుందట," అన్నది రమ.

తననేదో ఇరుకులో పెడుతున్నారని గ్రహించి, "మంచిదే!" నన్నాడు మూర్తి.

మీరు కొంచెం సహకరిస్తే..."

మాట్లాడకుండా కాఫీ కప్ తీసుకున్నాడు మూర్తి.

"ఏదో స్టెనో పోస్ట్ ఒకటి ఖాళీగా ఉందటగా!... దానికి మీరు రికమెండ్ చెయ్యాలి నన్ను", అన్నది కుమారి.

"అది ఫిలప్ అయింది—మరో అమ్మాయిని వేసుకొన్నారు", అన్నాడు మూర్తి. ఈ నిజం అంతటినీ తానే ఎందుకు వెల్లడిచేయాల్సిన అవసరం వొస్తూందో అతని కర్థం కాలేదు. నిజంగా వీళ్ళకి శ్యామలని ఆ స్థానంలో వేసిన సంగతి తెలీదా?

"అది సరేలెండి—మళ్ళా మరో ఖాళీ రావొచ్చుగా!"

"నాకు తెలిసినంతవరకూ ఏవీ రావాల్సి లేవు— నాకు తెలీనివి వొచ్చే పరిస్థితులు వచ్చినప్పుడు నేను చేసేదీ ఏమీ ఉండదు," అన్నాడు చికాకుగా మూర్తి.

"పోనీండి—మీ చేతిలోకి వస్తే, మీరు రికమెండ్ చేస్తారా?"

ఆ క్షణంలో రమా, కుమారీ కూడా తనవైపు వింతగా చూసేరు.

"అట్లాగే లెండి," అన్నాడు మూర్తి.

"దీన్ని ప్రామిస్‌గా..."

విసుగుగా కప్పు టేబిల్ మీద ఉంచి, "మీరు చాలా ప్రమాదకరంగా ఉన్నారు," అన్నాడు చిరునవ్వు వెనకనించి మూర్తి.

రమ నవ్వుతూ, "అందుకనే మిమ్మల్ని ఆశ్రయించడం," అన్నది.

"మరి నేను వెళ్తాను," అని, ఒక్కసారి లేచి తన గదిలోకి వెళ్లిపోయాడు మూర్తి. వీళ్లేం చేస్తున్నారు? ఏం చేయబోతున్నారు? ఆ ఉద్యోగంకోసం ఈమె ఇంకా ఎలాగ ప్రయత్నిస్తుంది? ముఖ్యంగా ఇదంతా తెలిశాక. తన ద్వారా కుమారికి జరిగినదంతా తెలుసునా, తెలీదా?

కథ అడ్డం తిరిగింది—అనుకున్నాడు. ఏం జరుగుతోంది ఏం జరగబోతూంది?

కొలది నిముషాలయాక కుమారి వెళ్ళిపోయింది. రమ తన గదివైపు రాలేదు; అతనూ అటు పోలేదు. ప్రశ్నల్లోనే ఉండిపోయాయ్.



"ఓ స్టెనో కోసం అడ్వర్టైయిజ్ చెయ్యాలి," అన్నాడు డైరెక్టర్.

తెల్లబోయాడు మూర్తి. ఇంత త్వరలో కొత్త స్టెనో...

"మీరు అపాయింట్ చేసిన అమ్మాయి జాయిన్ కానని తెలియజేసింది—ఏవో వ్యక్తిగత కారణాలున్నాయిట," అన్నాడు తేలికగా డైరెక్టరు.

"శ్యామల?" అన్నాడు పిడుగుపడినట్లు మూర్తి.

"అదేకాబోలు పేరు!" అన్నాడు డైరెక్టరు.

అరే! అనుకున్నాడు మూర్తి. శ్యామల జాయిన్ అవక పోవడం ఏమిటీ? తనతో ఏం చెప్పలేదే. ఉద్యోగం కోసం చూసి చూసి——చివరికి జాయిన్ కాకపోవడం ఏమిటని?

చిత్రంగా ఉంది అంతా. ఉద్యోగంరాని కుమారి వొచ్చే ఉద్యోగంకోసం తన రికమెండేషన్ అడిగింది—ఉద్యోగం వొచ్చిన శ్యామల ఎందుకనో తనతో చెప్పకుండానే వొదులుకుంది.

ఆ సాయంత్రం ఆఫీస్‌నించి అతను తిన్నగా శ్యామల ఇంటికే వెళ్ళేడు. వెళ్ళేసరికి శ్యామల ఏదో చదువుకుంటూ కూర్చున్నది.

"చిరకాల దర్శనం," అన్నది నెమ్మదిగా.

"అవునులెండి—మీరు ఉద్యోగం వొద్దనడానికి కారణం ఏమిటీ?" అన్నాడు మూర్తి చిరాకుగా కూర్చుంటూ ఒక్కసారి.

"ఎందుకనో జాయిన్ కావాలనిపించలేదు!" అన్నది శ్యామల.

"మీకు ఉద్యోగం కావాలని అనుకున్నాను," అన్నాడు కటువుగా మూర్తి. కొంచెం మారిన గదిలో పరిసరాలని చూస్తూ.

"కావాలి— కాని, మిమ్మల్ని ఇరుకునపెట్టి కాదు," అన్నది శ్యామల.

"అదేమిటి?"

"ఉన్న కథే. మీరూ రమా పడుతోన్న అల్లరి నాకు తెల్సును. కుమారి భర్త సర్వరుగా పనిచేసి వాళ్లు బ్రతుకుతున్నారు. ఆమెకే ఆ ఉద్యోగం ఇవ్వడం న్యాయం..."

తెల్లబోయి వింటున్నాడు మూర్తి.

"అదీకాక, నాకూ కొంచెం మంచిదే మరో ఉద్యోగం దొరికింది", అన్నది శ్యామల.

"ఎక్కడ?" త్రుళ్ళిపడి అడిగాడు మూర్తి.

"మీ డైరెక్టరుగారి దగ్గరే — ఆయనకి ప్రైవేట్ సెక్రటరీ—"

"ఆ ఉద్యోగం ఇంతకుముందు లేదే."

"పర్సనల్..."

ఇప్పటికి పూర్తిగా అర్థం అయింది మూర్తికి. తనని వీళ్ళంతా ఎలా ఆడించారో తెలిసొచ్చింది ... విసుగ్గా లేచి ఇంటికి నడిచాడు.

రమ రేడియోదగ్గర కూర్చుని ఏదో రాస్తూంది. అతని రాక గమనించి నవ్వుతూ, "చాలా సీరియస్‌గా ఉన్నారు?" అన్నది.

పుండుమీద కారం జల్లినట్లనిపించింది మూర్తికి. "ఈ నాటకం అంతా జాగ్రత్తగా ఆడించావ్?" అన్నాడు కోపంగా.

"నాటకం?" అన్నది రమ నవ్వుతూనే.

"వెళ్ళి ఆ డైరెక్టరు భార్యతో ఇదంతా చెప్పి చేయించావుగా."

"నాకు చేతనవునో కాదో మీకు తెలియొద్దూ."

మాట పూర్తవకుండానే చెళ్లున కొట్టాడు మూర్తి, తెల్లబోయింది రమ.

"అది ఫ[illegible] తెలుసుకో?"



విసురుగా తన గదిలోకి నడిచాడు మూర్తి. ఈ నాటకానికి ఇక్కడితో అంతం వొచ్చిందా అని అతను ఆలోచించసాగాడు జరిగినదంతా...

♦ ♦ ♦

కొద్ది నిముషాలలో మూర్తి తాను జేసిన దానికి పూర్తిగా పశ్చాత్తాప పడసాగాడు ... రమ తన నొకనాడు కొట్టినందుకు వేచిఉండి తానీనాడు పగతీర్చుకున్నట్లు కనిపించదూ అంతా? అయినా, తనకి రమని శిక్షించాల్సిన అవసరం మాత్రం ఏముంది ఇప్పుడు?...తన ఉద్దేశం తాను నెరవేర్చ జూచాడు. ఆమె కూడా అలాగే ప్రయత్నించింది. అందుకు ఇద్దరికీ హక్కు ఉంది. తన జ్ఞానం ఏమైపోయి, తన పశుత్వబలాన్ని ఆమెమీద ఉపయోగించాడు?

ఎలాగ ఆలోచించినా అది అంతా చాలా అనాగరికంగా కనిపించసాగింది. ఇప్పుడు తాను చేయగలిగినదీ, చేయాల్సినదీ ఒకటే—రమని క్షమాపణ కోరడం.

ఒక్కసారి లేవలేక పోయాడు మూర్తి. అంతరంగం జయించి అతను లేచేసరికి రమ అతని గదిలోకి వొస్తూంది... కాఫీ కప్పుతో.

తృప్తిపడ్డాడు మూర్తి. రమలో కొద్ది నిముషాల క్రిందటి దుఃఖపు చిన్నెలూ, ఆ కన్నీళ్లూ ఏమీ లేవు. ఇప్పుడే టాయిలెట్ అయి...

"కాఫీ చల్లారుతుంది—తీసుకోండి."

నెమ్మదిగా అన్నది రమ. మూర్తి అత్యాశ్చర్యంతో అలానే చూస్తూ ఊరుకున్నాడు— నిజానికి, ఇంకేమీ చెయ్యలేక.

"అలా చూస్తారేం?" అన్నది తట్టుకోలేక రమ.

కొంచెం ఆగి, "ఏమిటిది రమా?" అన్నాడు మూర్తి—కాఫీకప్పు తీసుకుంటూ.

"ఏమిటి ఏమిటి?" అన్నది, మందంగానే రమ.

"నీ ప్రవర్తన...ఎంత విచిత్రంగా ఉంది! నిజానికి ఇప్పుడు నేను నీకు క్షమాపణ చెప్పవలసి ఉంది..."

రమ కళ్లు ఎర్రబడ్డాయి. ఒక్కసారి మూర్తి ఆగి పోయాడు. ఏమిటీ మార్పు?

"నన్ను క్షమించు రమా!..."

ఒక్కసారి అతని చేతులు పట్టుకున్నది రమ.

"కాదండీ...క్షమాపణ నేనే చెప్పాలి."

వింతగా చూశాడు మూర్తి.

"అవును. ఆరోజు మీమీద చెయ్యి చేసుకున్న క్షణం చాలా చెడ్డది. చాలా ఉద్రేకంలో అలాగ చేశాను. మరు క్షణం చాలా విచారించాను కాని, ఉదాసీనంగా ఉండి పోయాను. మీరు దానిని చాలా తప్పుగా అర్థం చేసు

కున్నారు. మీా కేలాగైనా కోపం తెప్పించాలని అప్పటినించి ప్రయత్నించాను—ఇన్నివిధాల...నేటికి—"

రమ ఊరుకుంది, మూర్తి అలాగే చూస్తూన్నాడు. ఈ నాటకంలో తనదేరకం పాత్రో అతనికి బోధపడలేదు. జరిగినదంతా చిత్రనాటకంలాగ కనిపిస్తూంది.

అతనూ ఊరుకున్నాడు. కొద్దిక్షణాలు అలాగే గడిచాయి. తరువాత చిన్నగా నవ్వుతూ మూర్తి, "చిత్రంగా ఉంది...ఇలాగ ఆలోచిస్తావని అనుకోలేదు," అన్నాడు.

రమ నిశ్శబ్దంగానే ఉండిపోయింది. చిరునవ్వూ నవ్వ లేదు. బహుశా, మనస్సులో అతనిమీాద జాలిపడుతూ ఉటుంది.

— ఆంధ్రప్రభ, 16_6_54

# నిరూపకమ్

రైలు రావడానికి ఇంకా గంటవ్యవధి ఉన్నది సక్రమంగా రైలువస్తే. నన్ను స్టేషనుకి తీసుకొచ్చిన బండీ తిరిగి వెళ్ళిపోయింది కూడా. అనవసరంగా త్వరగా వచ్చేశా ననిపించింది.

నమ్మకం చాలక మరొకసారి నా గడియారం వేపూ, స్టేషను మాస్టరు గడియారంవేపూ చూశాను. పాడు గడియారాలు- నా భయాలన్నిటినీ నిజంచేస్తూ సరిగానే ఉన్నాయి.

స్టేషనుమాస్టరు కునికిపాట్లు పడుతున్నాడు. ఓ గుమాస్తా కిటికీ దగ్గర కూర్చుని హిందూపేపరంతంత ఫారాలు నింపుతున్నాడు. నాలుగురోజులనించి పల్లెలో గడిపి గడిపి,

విసిగి ఉన్న నాకు ఈ మానవద్వయం మరీ అధ్వాన్నంగా కనిపించింది. అయినా బధ్రకంగా గుమస్తా దగ్గరకి వెళుతూ, "పాసింజర్ వొచ్చేది ఎన్ని గంటలకండీ?" అన్నాను.

"అయిదూ ఇరవైమూడు," అన్నాడు గుమస్తా తల ఎత్తకుండానే.

మనిషి చూడడానికి విచిత్రంగా ఉన్నాడు. దువ్వ నవసరంలేని మోటుజుత్తు, చిరుగులను దాచడానికి వేసిన కోటూ, దానితో చాలా సంబధంలేని పేంటూ, రాత్రంతా నిద్రలేనట్లు ఎర్రబడిన కళ్ళూ మనిషి వెనకాల చాలా కథలు ఉన్నట్లు కనిపించాడు.

"కరెక్టుటైమా?" అన్నాను ఎలాగైనా సంభాషణని పొడిగించాలని. ఈ మారుమూల స్టేషనులో ఈ వింత విగ్రహం వెనకాల ఉన్న కథని దేన్నయినా వ్రాసి లోకానికి అందించగలిగితే, ఎంత సంతృప్తిగా ఉంటుంది! అతని కళ్ళల్లో మెదులుతూన్న అనుమానాలూ, చీకట్లూ తప్పక ఏదో ఒక గాథని దాచుకునే ఉంటాయి. ఎలాగైనా సంభాషణని పొడిగిస్తే...

"అవును", అన్నాడు గుమస్తా, తన కలపడాలూ, కూడికలూ, కొట్టివేతల సముద్రంలో ఈదులాడుతూ. ఓడిపోయాను మొదటి ప్రయత్నంలో. పాసింజర్ ఆలస్యం అయినా బాగుండును— ఆ ...మైనా ఇతనిని మాటలాడించవొచ్చునని.

"ఈ దగ్గరగా కాఫీ దొరుకుతుందండీ?" అన్నాను ఇంకా నా ప్రయత్నం సాగిస్తూ.

"దొరకదు", అన్నాడు గుమాస్తా. అని ఓసారి తల ఎత్తి చూశాడు నావైపు. కొంచెం విజయం కలిగింది కనుక సంతృప్తిపడి, "రైల్వే స్టాల్ లేదా?" అన్నాను దాన్ని గురించి అయినా ఉపన్యాసం ఇస్తాడేమోనని ఆశిస్తూ.

"లేదు", అని పూర్వంకన్న తీవ్రంగా తన గణిత పరిజ్ఞానం పరీక్షచేసుకుంటూన్నట్లు సాగిపోయాడు గుమాస్తా. ఎంత ప్రయత్నించినా ఇంక ఈ మానవుణ్ణి సంభాషణలోనికి లాగడం అసంభవం అని నిరారణ చేసుకున్నాను. కథలు రాసుకొనేందుకు పనికివచ్చే మనిషి అయితే, నన్ను చూడగానే రైళ్ళ రాకపోకలని గురించీ, పూర్వ ప్రస్తుత ప్రయాణాల విభేదాలని గురించీ, జోనల్ సిస్టమ్ బాగోగులని గురించీ, బెంగుళూరు ఫాక్టరీ అభివృద్ధిని గురించీ తప్పకుండా ఉపన్యాసం ప్రారంభించి ఉండును...

పూర్తిగా ఓటమిని అంగీకరించి బయటికి నడిచాను. అయిదారుగురు పోర్టర్లూ, నా మల్లేనే త్వరగా వొచ్చిన పది పన్నెండూ మంది ప్రయాణీకులూ, ప్లాట్‌ఫారమ్‌మీద కొంచెం సందడి చేస్తున్నారు. అందరివైపూ చూశాను. నాకు పని కొచ్చే జీ... రూ కనిపించలేదు.

...కున్నాను. ఈ మధ్య వాస్తవికతనించి ...రం అవుతున్నాను. ఇట్లా కథలు

వినీ, కనీ రాసేస్తే, అది కథారచన కాదనీ, న్యూస్ రిపోర్టింగ్ అనీ...

అట్లా ఆలోచిస్తూ ప్లాట్‌ఫారమ్ కొసనివున్న పెద్ద చెట్టు క్రిందికి వెళ్లి కూర్చున్నాను. స్టేషనుచుట్టూ కొండలు ఉండడాన్న ఎండ మందంగా వొస్తూంది. ప్రయాణీకులంతా అవతలికొసకి ఉన్నారు. ప్రశాంతంగా కూర్చుని, మనసుకి సుఖం కలుగజేసే ఇలాంటి ఆలోచనలు సాగించుకున్నాను.

అయితే, ఈ ఆలోచనల ప్రవాహం చాలాసేపు సాగలేదు. నేను కూర్చున్న చెట్టుకి అవతలవైపునించి గాజుల చప్పుడు వినిపించి, ఉలిక్కిపడి అటుచూశాను. చారలచీర కట్టుకుని, ఓ అమ్మాయి నిజంగా అక్కడ కూర్చుంది.

మొదట కలయేమో ననుకున్నాను. ఈ మధ్య నిజంగా కనిపించేవాళ్ళూ, కథల్లోని కన్యలూ కలిసిపోతున్నారు. అట్లాగ...

నన్నూ ఆ అమ్మాయి అప్పుడే చూసినట్లుంది. ఓసారి తల ఎత్తిచూసి, తిరిగి చదువుతూన్న పుస్తకంలో లీనం అయింది. ఈమెతోనైనా కాస్త సంభాషణ సాగిద్దామని ఆశించాను. కాని, చల్లగా ఆమె తన పుస్తకంలో కలిసిపోవడంతో ఈ ఆశా కరిగిపోసాగింది.

సంచీలోనుంచి నాపుస్తకం తీసుకుని, క్రమంగా నేనూ ఆ నల్లటి అక్షరాల మధ్య పరిగెత్తడం ప్రారంభించాను—ఉన్న ఒక్కదారీ అదే కాబట్టి. కథలు వినడమూ, వాటిని వ్రాసు

కోవడముకన్న చదువుకోవడం చాలా సులువు; సంవత్సరాల తరబడి ఆలోచించి, ఉద్రేకాలు అనుభవించి మానవజీవితాన్ని తరిచి, మనస్సుని మధించి వ్రాసిన గ్రంథాలు రెండురూపాయిల ఖరీదుకు వొచ్చి, రైలు ప్రయాణంలో తలనొప్పి రాకుండానూ, మాటలాడడాని కెవ్వరూ లేనప్పుడు మాటలాడడానికీ పనికివస్తాయి.

అయిదారు నిమిషాలు చదివాననుకుంటాను.

ఒక కర్రకాలు శబ్దంచేసుకుంటూ ఒక ముష్టివాడు మావైపు వొస్తున్నాడు స్టేషన్నించి. ఆ శబ్దానికి నా దృష్టి అటుపోయింది. నవలలో నాయకుడు చెట్లమధ్య కుర్చీలో కూర్చుని సిగార్ కాల్చుకుంటూ ఆలోచిస్తున్నాడు. కొద్ది నిముషాలు నేనూ నాయకుడితో అట్లా ఆలోచిస్తూంటే ఈ ముష్టివాడు...

వాడిమీద నాకు పూర్తిగా కోపం వొచ్చేలోగా వాడు దగ్గరికి రానే వచ్చేశాడు. వాడిని పరీక్షగా చూడకుండా నేను వుండలేక పోయాను— నా ప్రశాంతతని పాడు చేశాడన్న కోపంలో.

"బాబూ," అన్నాడు వాడు నెమ్మదిగా.

"ఏం?" అన్నాను.

"బీదవాడిని బాబూ!..."

వాడిమాటలు జాలికన్నా కోపం ఎక్కువ కలుగజేస్తున్నాయి. ఈ మాటలని నేను వింటోన్నట్లే అనిపించకుండా, "అలాగా!" అన్నాను.

"ఇల్లు కాలిపోయింది బాబూ!"

"పాపం!"

"ధర్మప్రభువులు..."

"అడిగేవరూ?"

వింటోన్నట్లుంది అమ్మాయి పక్కన నవ్వింది. చికాకుగా నేనన్నమాటల్లో ఉన్నది హాస్యం కాదనీ, వ్యంగ్యం అనీ ఈమెకి ఎలా తెలుస్తుందీ?

"తమరే బాబూ!"

"నీకేలా తెలుసు?" అన్నాను నిరభ్యంతరంగా చెప్పిన వాడి ఉద్దేశానికి కొంచెం నవ్వుకుని.

"మిమ్మల్ని చూస్తే తెలుస్తుందండి."

ముష్టివాడు నవ్వలేదు కాని అమ్మాయి నవ్వింది. వాళ్ళకోసం కానప్పుడు ఆడవాళ్లు అన్నిటికీ నవ్వుతారు— వాళ్ళని నవ్వించదలచుకుంటే మాత్రం...

"ఎలాగా?" అంది, ఆమెకూడా సంభాషణలో ప్రవేశిస్తూ. ఈ కథాగమనం మొదట అయితే నాకు సంతోషంగా ఉండి ఉండును. కానీ, నా నాయకుణ్ణి అట్లానే వొదిలిపెట్టి

ఈ వ్యవహారాన్ని సాగించడం నాకు యిష్టంలేదు. అమ్మాయి సంగతంతా, స్టేషన్‌లోని మానవులని గురించి నేనేదో ఒక అభిప్రాయం ఏర్పరచుకొనే ఉన్నాను. ఆమెతో పరిచయం చేసుకోవాల్సిన అవసరంకూడా ఏమీలేదింక.

"వారినిచూస్తే తెలుస్తుందండీ", అన్నాడు ముష్టివాడు—కొంచెం గట్టివాడల్లేనే ఉన్నాడు.

"నేనూ నీకొక దమ్మిడీ ఇవ్వను. నన్నింక గోల చెయ్యక పో — ఈ చుట్టూ కనిపించక, త్వరగా పో..." అన్నాను.

"ఇల్లు కాలిపోయిందండి... ధర్మప్రభువులు..."

మళ్ళా మొదలెట్టాడు. అమ్మాయి నవ్వుతూనే ఉంది. ఒక అణా ఇచ్చి వొదిలించుకుందామా అనుకున్నాను. కాని ఆత్మగౌరవం అడ్డువొచ్చింది.

కసురుకున్నాను. వాడు తెల్లబోయి "పోనీండి బాబూ!" అని వొచ్చినదారినే వెళ్లిపోయాడు.

హఠాత్తుగా వచ్చిన నా కోపానికి కొంచెం ఆశ్చర్య పడినట్లుంది... ఆ అమ్మాయి వింతగా మళ్లీ నా వైపూ, నా పుస్తకంవైపూ చూడసాగింది. ఆ చూపులమధ్య సుఖువుగా నా పనిమీదికి తిరిగి దృష్టిసారించడం కష్టంగానే కనిపించింది.

కొద్ది క్షణాలు గడిచిపోయాయి — నిశ్శబ్దంగా. బహుశా ఇదుపురమూ రెండోవాళ్ళ భావాలని — తెలీని

లోతులదాకా తరిచి ఆలోచిస్తూ గడుపుతున్నా మను కుంటాను.

"మీ రెక్కడిదాకా వెడుతున్నారు ?" అన్నాను— మిగిలిన ప్రశ్నలన్నిటినీ అడిగివేసినట్లు, ఎలాగో సంభాషణ సాగించడం అవసరంకనుక.

"మీరు?" అన్నదామె.

"బెజవాడ..." అన్నాను.

"నేను కొంచెం ఎక్కువలెండి", అన్నదామె—సరిగా గమ్యస్థానం పేరుచెప్పడం ధర్మసూత్రాలకి విరుద్ధం అన్నట్లు.

ఆమె నవ్వడంలేదు... ఏదో ఆలోచిస్తున్నట్లు రైలు పట్టాలకేసి చూస్తూ కూర్చుంది. నీలమేఘం కాకపోయినా మొత్తంమీద నలుపులోకి వచ్చేరంగు ఊదారంగు చారల చీర కట్టుకుని, జాకెట్ వేసుకున్నది. లక్షణాలన్నీ చూస్తే ఎక్కడో పనిచేస్తోన్నదల్లేవుంది.

మీరేం చేస్తూంటారు?" అన్నది, కొన్ని సెకెండ్లయాక ఆమె— తిరిగి సంభాషణ ప్రారంభించడానికి ప్రయత్నం చేస్తోన్నట్లు.

నిరుద్యోగిహోదా వెల్లడించుకోవడం ఇష్టంలేక, "కథలు రాస్తూ ఉంటాను", అన్నాను.

"నిజంగా?" అందామె— నాలాంటి మనిషి ఏ జన్మానా కథలు వ్రాయడం అసంభవం అయిన ... చేసేపని అది తప్ప మరేమైనా అవొచ్చు నన...

"మీతో అందరూ అబద్ధాలాడుతుంటారేం ?" అన్నాను కొంచెం కటువుగానే.

"అదికాదులెండి— కథలు రాసేవాళ్ళని చూడాలని చాలా రోజులనించి అనుకుంటున్నాను. వాళ్లిలాగ ఉంటారని నే నెప్పుడూ అనుకోలేదు—" అన్నదామె.

"వాళ్ళకి నాలుగు చేతులూ, రెండు తలకాయలూ... ఇవన్నీ ఉంటాయనుకున్నారా!" అన్నాను నవ్వుతూ.

"పెద్ద తలకాయి ఒక్కటీ, ఒక చెయ్యిమాత్రం ఉంటుందనుకున్నాను", అంది అమ్మాయి—తనూ నవ్వుతూ.

"మీరూ కథలు రాయడం మొదలు పెట్టండి," అన్నాను—సంభాషణ ఎట్లాగైనా పొడిగించడానికి.

"అదొక్కటే తక్కువ నాకు!... మీ కథలకి డబ్బు ఇస్తారనుకుంటాను పత్రికలవాళ్లు ... నా కథలు వినడానికే మనిషి దొరకడు!" అందామె ఒక నిట్టూర్పు విడుస్తూ.

౧౭ "మీరు చాలా కష్టాలు అనుభవించిన మనిషిలాగా మీ ఆకృతినిబట్టి చెప్పడం కష్టం," అన్నాను, ఇక్కడేదో కథకి విత్తనం ఉందని తెలీగానే.

"అదే మరీ దురదృష్టం!" అని వాపోయిందా అమ్మాయి.

కష్టపరి ... ంచెం జాలిపడ్డాను. ఈ నటన అంతా చివరికి ఫ ... నాకు తెలుస్సను. ఆ అమ్మాయి

తన కథని నాకు చెప్పడానికి ఆత్రుతపడుతోందని తెలిసి పోతూనే ఉంది!

"మీకు అభ్యంతరం లేకపోతే మీ కథని వినాలని ఉంది," అని నేననలేదు—మరీ కన్వెన్షనల్‌గా ఉంటుందని...
"బహుశా మీరు మీ ఇంటికి తిరిగి వెడుతున్నారు," అన్నాను ఆమెని చూసి గ్రహించినట్లు.

ఆమె ఆశ్చర్యపోయింది. "ఎంత బాగా కనిపెట్టేరండీ! ...నిజంగా అంతే," అన్నది.

ఆ క్షణంలో కథకుడుగా నా గౌరవం, గొప్పతనమూ, కొన్ని రెట్లు అయాయనుకుంటాను. కొంచెం డిటెక్టివ్ పవర్ కూడా కథకుడికి ఉండాలని ఎవరో అనేవుంటారు. అది నా విషయంలో సార్థకం అయి ఊరుకుంది.

ఆ తరవాత ఆమె కథని రాబట్టడానికి నాకేమీ శ్రమ కలగలేదు.

♦ ♦ ♦ ♦

ఇందిర ఇద్దరు పిల్లలలో రెండోది తల్లిదండ్రులకి. చిన్నప్పటినించీ విపరీతంగా పెంకితనమూ, పట్టుదలా అలవాటు పడ్డాయామెకి—తల్లీ, తండ్రీ మరీ గారాలు చెయ్యడం వల్ల. చిన్నప్పుడు ఆమెకి ఈ పద్ధతుల్లో [illegible], కష్టమూ ఏమీ కనిపించేదికాదు. వాళ్ళు స్వతహ [illegible] వాళ్ళు. ఆమె తండ్రికూడా ఉద్యోగంచేసి [illegible]

ఆ గారాబంతోనే, పెంకితనంతోనే, ఇందిర క్రమంగా పెద్దదైంది. కాలేజీలో ప్రవేశించేసరికి ఆమెలోని స్వోత్కర్ష మరీ హెచ్చయింది...తనేదో ఘనకార్యం చేసేస్తూన్నట్లు, మిగిలినవాళ్లు తనకి జోహారు చెయ్యాలన్నట్లూ ఆమె భావించి ప్రవర్తించేది. క్రమంగా ఆమె తన స్నేహితులందరికీ దూరం కాసాగింది.

బి. ఏ., లోకి వచ్చేసరికి ఇందిరకి స్నేహితులు మిగలనేలేదు—రామస్వామి తప్పిస్తేను. అతను ఇందిర అంటే ప్రాణాలుపెట్టేవాడు. ఆమె చెప్పినదానికల్లా "ఊ"కొట్టేవాడు. ఏం కావాలన్నా చేసేవాడు.

ఇందిర బీ. ఏ., ఒక్కపార్టుకూడా పేసవలేదు. రామస్వామితో సినిమాలకీ, షికార్లకీ తిరగడానికే ఆమె కాలం సరిపోలేదు! రామస్వామికూడా యథాశక్తి, రెండుపార్టులు పోగొట్టుకున్నాడు.

చదువులో ఆమె ప్రగతి చూసి, తల్లిదండ్రీ ఆమెకి పెళ్ళిచేసేద్దా మనుకున్నారు. సరియైన వరుణ్ణిచూసి పెళ్ళి కుదిర్చారు.

మిస్ ఇందిర బి. ఏ., కి అక్కడ గొప్పకోపంవచ్చింది. తాను రామస్వామిని తప్పిస్తే మరెవరినీ పెళ్లిచేసుకోనని భీష్మించుకుని కూర్చుంది. ఆమె రామస్వామిని పెళ్లిచేసుకొనేంతలాగ [illegible]ంచలేదుగాని, ఈ పెళ్లికి అంగీకరించడం మాత్ర[illegible]కన ఉద్దేశంలో రామస్వామి ఉన్నట్లు తె[illegible]

ఇందిరతండ్రి ఆమె అన్నదానికి చేసికీ అడ్డుపెట్టక పోయినా, ఈ విషయంలో మరీ పట్టుదలగా ఉండిపోయాడు. దానికి కారణం లేకపోలేదు–రామస్వామి తండ్రి బ్రతికిఉన్న రోజుల్లో ఇందిర తండ్రితో గొప్ప పేచీపెట్టుకున్నాడు–ఇందిర తండ్రి అతన్ని దుంపనాశనంచేసి వొదిలిపెట్టేడు.

"ఇవన్నీ నిజమేనా?" అని రామస్వామిని ఓనాడు అడిగింది ఇందిర.

"అక్షరాలా", అన్నాడు రామస్వామి.

అయితే అతన్ని పెళ్ళాడడం తప్పదనుకుంది ఇందిర–ఎప్పుడో జరిగిన అన్యాయం కొంతైనా తగ్గిద్దామని.

ఏమైనా తానన్న పెళ్ళి జరగాల్సిందేనన్నాడు ఇందిర తండ్రి.

ఏమైనా తానన్న పెళ్ళి జరగాల్సిందే నన్నది ఇందిర.

చివరికో శుభోదయం చూసి ఇందిరా, రామస్వామీ లేచిపోయారు. ఇందిరకి లోకంమీద పగతీర్చుకున్న సంతోషం మిగిలింది. కాని త్వరలోనే ఈమెకి కొత్తకొత్త విషయాలు తెలియసాగాయి.

"పెళ్ళి చేసుకుందాం," అంది ఇందిర.

"పెళ్ళెందుకూ?" అన్నాడు ఆశ్చర్య[illegible]స్వామి.

ఇందిర తెల్లబోయింది.

క్రమంగా రామస్వామి ఇందరమీద కోపంగా అసహ్యంగా ప్రవర్తించసాగాడు. ఇందిరకి ఇది అంతా యేమీ బోధపడలేదు. ప్రేమ మిఠాయి ఆమె ఇలాంటి కర్తీనూనె సరుకని కలకూడా కనలేదు.

"నువ్వు నన్ను ప్రేమించడంలేదు," అని ఓనాడు వాపోయింది చివరికి.

"సత్యం గ్రహించావు," అన్నాడు.

"మరి నన్నెందుకు లేవదీసుకొనివచ్చావు?" అన్నది ఇందిర.

అప్పుడు ఉన్న రహస్యం కాస్త బయటపడింది.

రామస్వామి ఇందిరని లేవదీసుకొచ్చింది ఆమెని ప్రేమించడానికీకాదు, పెళ్ళి చేసుకోడానికీకాదు. తన తండ్రి మీద ఆమెతండ్రి చేసిన నేరానికి ఈ విధంగా—ఆమెని లేవదీసుకొనివచ్చి—అతను ప్రతీకారం చేశాడు. అంతే.

మర్నాడు ఇందిర బయలుదేరింది ... ఇంటికికాదు, మరో బంధువు ఇంటికి. అతను ఆమె తండ్రికి ఉత్తరం రాసి, ఆమెని ఇంటికి పంపేడు.

ఇంటికి వెడుతూ ఆ స్టేషనులో ఆమె రైలుకోసం ఎదురుచూస్తోంది.

ఆ [illegible] ఇందిర వేడినిట్టూర్పు విడిచింది.

[illegible] పోయారు!" అన్నాను.

"తప్పు నాదేలెండి. చివరికి చేతిలో పైసాలేకుండా వచ్చాను. అతన్ని ఎలాగా అడగను—చుట్టాలని అడగలేను. చూడండి!" అని వాపోయి మరో నిట్టూర్పు విడిచింది సుదతి.

"పాపం!" అని, "కావలిస్తే నాదగ్గరనుండి కొంత డబ్బు తీసుకోండి," అన్నాను.

"మీదగ్గరనుంచా! మీకు శ్రమ అవుతుందేమో?" అంది సంకోచిస్తోన్నట్లు నటించడానికి ప్రయత్నిస్తూ.

"బాధ లేదులెండి", అని, పర్సులోనించి ఐదు రూపాయిలు తీసి ఇచ్చాను.

"చాలా థ్యాంక్స... మీ అడ్రసుకూడా ఇవ్వండి. ఇంటికి చేరగానే డబ్బు పంపేస్తాను," అన్నది.

"శ్రమ ఎందుకులెండి! స్వల్పమేగా..." అంటూ నా అడ్రస్ ఇచ్చాను.

ఇదంతా అయేసరికి రైలు వొచ్చేసింది.

ఆమె తనని లేడీస్ కంపార్టుమెంట్‌లో ఎక్కించ మన్నది. నేను ఆలాగ చేసి, ప్లాట్‌ఫారం మీద నిలబడ్డాను వెడతానని చెప్తూ.

ఇందాకటి ముష్టివాడు కర్రచప్పుడు చేసుకుంటూ వచ్చి, "ధర్మంబాబూ!" అన్నాడు. మాఇద్దరి ప్రక్కా నిలబడి.

చేతిలో ఉన్న అయిదు రూపాయిల నోటు వాడికి ఇచ్చేసింది ఇందిర.

"అదేమిటి," అన్నాను నిజంగా ఆశ్చర్యపడి.

"ఏమిలేదు లెండి...మీరు వాడిని బాధించిన దానికి, చిన్న కాంపెన్‌సేషన్..మీరు కథలు రాస్తారు. డబ్బువొస్తుంది. నేను కథ చెప్పి, డబ్బు ఆర్జించి, వాడికిచ్చాను. అదంతా ఓపికగా విన్నందుకు ధన్యవాదాలు...కొంచెం జాలీ, ధర్మమూ అలవాటు చేసుకోండి...సెలవు."

రైలు కదులుతోంది. ముష్టివాడు తెల్లబోయి చూస్తున్నాడు. ఒక్క-క్షణం తెల్లబోయి, నేను కదులుతూన్న మరో కంపార్టుమెంట్ యెక్కి-పోయాను. స్టేషన్ దాటేదాకా ఆ ముష్టివాడి ఆశ్చర్యాన్ని గమనిస్తోనే ఉన్నాను.

ఇందిర తెలివైనదే-కాని తన కల్పనలో కథ వుందనీ, దానిని ఉపయోగించుకోవచ్చుననీ ఆమెకి తెలీదు. ఆమె అజ్ఞానానికి నేనూ, నా అజ్ఞానానికి ఆమే బహుశా ఇలాగ జాలిపడుతూ ఉంటామని అనుకుంటాను. అయితే జరిగిన అంతటిలోనూ నాకు ఒకటే అసంతృప్తి—ఇందిర ఎవరూ? అని.

— తెలుగు స్వతంత్ర, 14-5-54

# "శిరసి మా లిఖ"

"ఈ ఇంటివా రెవరండీ?"

"ఎవరూ?"

"ఈ ఇంటివారు—సొంతదారులు..."

"అది సరేలెండి— మీా రెవరూ అనీ అడగడం..."

"నే నెవరని చెప్పుకోను లెండి! అయినా మీారేనా ఇంటివారు?"

"కాకపోతే మీారెవరో చెప్పరా ఏం?"

"ఎందుకు చెప్పాలో నాకర్థం కావడంలేదు."

"గౌరవంగా ఎవరని అడిగితే ఇం[illegible] తెలియక పోడాలూ ఎందుకో! పాడుకాలం—"

"నా ఒక్కణ్ణి గురించి కాలాల నన్నిటినీ తీర్పేయడం ఎందుకులెండి గాని, ఈ ఇంటివారు ఎవరూ?"

"తెలీక అడుగుతానూ–వారంటు ఏమైనా తెచ్చావా నాయనా?"

"వారంట్లు తెచ్చే ఉద్యోగం దొరకలేదుగానీ, అసలా సందేహం ఎందుకు వచ్చింది దొడ్డమ్మగారూ?"

"ఆహాఁ...అసలు నువ్వు ఇంటివారిని ఏజన్మలోనైనా చూశావా అని—"

"ఈ ఇంటివారిని నిజంగా చూడలేదు లెండి."

"పోనీ–ఏ ఇంటివారినైనా—"

"చాలామందిని చూసేను."

"అదిగో! అచ్చు అలాగే అంటూఉండేవాడు మా రెండోపిల్ల సవితి తమ్ముడు మేనమామ...నలభై ఏళ్లు నిండాయో లేదో—గుటుక్కు మన్నాడు...పాపం. ఆపిల్ల అదృష్టం."

"దురదృష్టం అనండి."

"ఎందుకనాలీ? బ్రతికున్నన్నాళ్లు కాల్చుకు ని తిన్నాడు."

"పోనీండి...ఆవిడ అదృష్టవంతురాలు."

"అదృష్టం!...నువ్వెవరోగానీ, నువ్వే అనాలి. అయిదుగురు దాన్ని లోకానికి వప్పజెప్పి హరీమని ఊరు

"ఎంత కష్టం!"

"అదేం మాటయ్యా! సాలీనా పదేనువొందలొచ్చే భూములూ పది వేల ఇంసురెంసూ.. అన్నీ గాక డాబాతోటలో సినీమాలాంటి ఇల్లు...అన్నీ దానికే వచ్చాయిగా!"

"ఏ సంఘటనకేనా రెండురకాల ఫలితాలు ఉంటాయి లెండి."

"అన్నావా...అచ్చం కథలు రాసేవాడిలా అన్నావు. ఐతే, నువ్వూ కథలు రాస్తావేమిటి?"

"ఏదో_అప్పుడప్పుడు."

"ఇంకేం! అయితే సరేనన్నమాట! మా మూడోవాడి బావమరిది తోడల్లుడూ కథలు రాస్తూనే ఉంటాడులే."

"ఆయనకి చాలా పేరుంది కాబోలు."

"ఉండకేం! సుబ్రహ్మణ్య సోమయాజీ సత్యనారాయణమూర్తిగారు_పెద్దదే!"

"చాలా పెద్దదేనండి."

"అన్నావా! వాళ్ళమామగారి రెండో అల్లుడి ఇల్లు నువ్వుచూస్తే ఆ మాట అనవ్. అది మరీ పెద్దది."

"వాటికి సామ్యం ఏమిటి లెండి_వేటి కవే."

"అలా అనకు. ఒక్కొక్కళ్ళకి మహాయోగం ఉంటే అన్నీ పెద్దవే వొస్తాయి ... జాతకాలంతే. మా ఆయన ఎప్పుడూ అలాగే అంటూ ఉండేవారు."

"అది నిజమేనేమో లెండి."

"నిజంకాక, అబద్ధం నేనెందుకాడతానయ్యా? నాకు ఆడపిల్లలున్నారంటే, అది మగాళ్ళాడిన అబద్ధాలు. నేను అక్కడికే ప్రతిదినం ప్రాయచిత్తం చేసుకుంటూనే ఉండేదాన్ని."

"ఈ ఇంటి......"

"ఆఁ...అసలు సంగతి వొదిలేశాను. ఇంటివాళ్లెలా ఉంటారో ఎప్పుడైనా చూశావా అని అడుగుదామనుకుంటూ, ఇన్నిదార్లు పట్టేను... మందమతి. ఆయన బతికున్న రోజుల్లో ఒక్కపనికూడా ఎన్నడూ తారుమారు చెయ్యలేదు. ఓసారి మా యింటిప్రక్క పురాణంచెప్పే శాస్త్రులుగారు పతివ్రతకి ఉదాహరణగా..."

"వారిప్పుడు..."

"చచ్చారులెండి. ఇంకా ఎలా ఉంటాడూ ?"

"జబ్బుకాబోలు."

"మగాళ్ళందరికీ ఒకటే జబ్బు—త్వరగా చచ్చిపోడం."

"మీరు మరీ అన్యాయంగా మాట్లాడుతున్నారండి."

"కొడుకులాటి వాడవ్..వెయ్యేళ్ళు బ్రతుకు నాయనా. అంతేగాని, నేను చేసేదీ చెప్పేదీ అన్యాయం అని మాత్రం అనకు. పుణ్యముంటుంది."

"పోనీండి—మీరు చాలా నిజంగా చెప్పేరుగానీ—అలాంటి..."

"అదేనయ్యా! అసలు విషయానికొస్తూంటే అడ్డమైన పెడదారులూ పట్టించి వాగిస్తున్నావు. ఇంటివారికుండా, ఆ గర్వం, దర్పం..."

"మీరు ఈ ఇంటివా రనుకుంటాను."

"గర్వం, దర్పం, మా వంశంలో పుట్టుకొచ్చా యయ్యా! చూశావా! చక్కగా గ్రహించావు... చాలా చదువుకున్నావా నాయినా?"

"ఇలాటివాటికి చదువులెందుకులెండి."

"నీకడుపు చల్లగా—నిజం చెప్పేవుబాబూ...నువ్వెవ్వరివోగాని,.. ఎందుకూ చదువూ? మా నాలుగో కోడలు ఇంటరు పేసయిందో లేదో నువ్వెరుగుదువా?"

"నా కెలా తెలుస్తుందండి?"

"అలా అనకు— కొన్ని విషయాలు ఎలాగేనా తెలుస్తాయి. ఈ విషయం ఈ వీధి వారందరికీ తెలుసును. అసలు దాన్ని చూడగాన్నే చెప్పేవొచ్చును—అది ఇంటరు పేసవలేదని."

"అలాగేనండి."

"మరి, నీకేం తెలుసూ?"

"మీరు చెప్తున్నారు కాదా?"

"చెప్తే అంతే?...ఇంకోగంటపోయాక నువ్వు చాలా మంచివాడివని అందరితోనూ చెప్తాను. అంతే?"

"మనం వాదించడం అనవసరం. ఇంతకీ—"

"ప్లీడరీకిమాత్రం నువ్వు పనికిరావు. మరో పని చూసుకో. అంతేగాని, అనవసరమేమిటి ఈ ప్రపంచంలో?... ప్రతీచెత్తా అవసరమే. అందుకని ఏడేళ్లుదాచమని ఇంగ్లీషులో గోలపెడుతూ వుంటాడు మా పెద్దదాని మొగుడు."

"మిమ్మల్ని ఏడేళ్ళూ తప్పకుండా జ్ఞాపకంలో దాచుకుంటానులెండి."

"బాగుపడతావు...నీ కథల్లోమాత్రం నన్ను రాసేక... మా కోడళ్ళూ కొడుకులూ అందరూ అవి చదివేవాళ్ళే ... చంపేస్తారు. ఓ రామాయణం భారతం ఎవరికీ అక్కర్లేదు."

"ఈరోజుల్లో అవెవరికి కావాలిలెండి!"

"అన్నావా?...ఆమాటే నేనంటే మా వెంకటలక్ష్మి, మనోహరి, మాణిక్యం, రాజరత్నం, గోపాలస్వామీ, మోహనుడూ, రామచంద్రమూర్తి, సత్యం, సరితా, వసూ— అందరూ కలిసి నా మీద దండెత్తుతారు."

"కష్టమేనండి."

"అంతకష్టంకాదులే!... నేనూ కొలది నిముషాలుండి వాళ్ళతో కలిసిపోతాను. దాంతో ఎక్కడివాళ్ళక్కడ ఖిన్నులై ఊరుకుంటారు."

"ఇంతకీ నేను వొచ్చినపని..."

"చేసుకో నాయనా! చేసుకో!...చదువుకున్నవాడివి. సంపాయిస్తున్నట్టున్నావు ... అన్నట్టు — ఉద్యోగం ఏంటి బాబూ?"

"జూలాజికల్ స్పెసిమెన్ కలెక్టరు."

"అంతా ఉద్యోగమే?"

"అవునండి."

"మరి అలాగ ఉన్నావేం?"

"నేనసలు ఇంతేన్లెండి."

"బాగు బాగు...ఇంత పెద్దకలట్రువిగదా! సూటైనా వేసుకోలేదేం నాయనా?"

"ఇవి జాతీయదుస్తులు లెండి."

"మహాబాగు...మా మూర్తోకుఱ్ఱాడికి సెలవు దొరికి ఇవాళ మెయిల్లో వస్తే నిన్ను చూపెట్టి కొంచెం బుద్ధిచెప్పను... వాడు చేసేది మేష్టరుగిరియే కాని, వేసేసూట్లు మనకందవు!"

"అలాటివి ఎవరియిష్టం వారిది లెండి!"

"సరిగ్గా అన్నావు. మా సౌమిత్రికి కాఫీ స్ట్రాంగ్‌గా ఉండాలి; సరోజకి టీ తప్ప పనికిరాదు..."

"మీా జానకికి..."

"సారీ! మా జానకిని నువ్వేరుగుదువన్నమాట."

"అబ్బే, నాకు తెలీదులెండి."

"సిగ్గుపడుతున్నావుగాని, అది తెలీకపోడం ఏమిటి? కథలురాసే అబ్బాయిలంతా తనమీదే రాస్తారని అది అంటే ఏమో అనుకున్నాను. అయినా, దానికేం! రాణీ!...నీకు బాగా తెలుసునన్న మాట!"

"నిజంగా నాకామె ఏమీ తెలీదండీ!"

"మరి దాని పేరు యెలాగ తెలిసిందయ్యా, విచిత్రం?"

"మీరు వర్ణిస్తూన్న పేర్లన్నీ విన్నాక ఆ పేరు ఉండదని అనుకోలేకపోయాను."

"బాగు బాగు! ఏం విడ్డూరం మనుషులూ!"

"ఏదోరకం మనుషులంగానీ— ఈ ఇంటివారు మీరేనా చెప్పండి...గంటనించి అడుగుతున్నాను."

"ఏం అమాయకుడివి బాబూ! అలా అనుకోగూడదు గానీ, కిందటి ఖరసంవత్సరంలో పోయినవాడు తిరిగొస్తాడా ఏమైనానా— సరిగ్గా మా ఛాముండేశ్వరరావులాగే మాట్లాడుతున్నావు. వాడు బతికి బాగుంటే——"

"నేను చచ్చి ఉండేవాణ్ని—వెడుతున్నాను."

"అంత అశుభం కోరుకోకు నాయనా!... తథాస్తు దేవతలు తథాస్తు అనేస్తారు. మా మూడోకోడలు పెదతండ్రి తోడ..."

"దొడ్డమ్మగారూ! మీ కోడళ్ళనీ, వారి బంధువుల్నీ, వారి బంధువుల బంధువుల్నీ వొదిలేయండి. నాకు ఓ గది కావాలి. ఈ ఇంట్లో దొరుకుతుందా?"

"పెళ్ళయిందా నాయినా?"

"అయింది."

"అత్తారిదేవూరూ?"

"రాజమండ్రీ."

"నియ్యోగులా ఏమిటీ?"

"అవును."

"అయితే...అయ్యో! వెళ్ళిపోతున్నావేం?"

"వొద్దుబాబో వొద్దు... నాకిక్కడ వొట్టినే ఇచ్చినా గది వొద్దు."

"అయ్యో...రాజమండ్రీ అయితే, సురవరపువారి... అదేం పరుగే! అవ్వ!...హవ్వ! అంతపరుగు! వెళ్ళిపోయాడే!"

— తెలుగు స్వతంత్ర, 30-4-54

# తిరిగివచ్చిన దీపావళి

సన్నగా వినిపిస్తూన్న సంగీతానికి క్రమంగా తెలివి వచ్చింది శ్యామలకి. ఒకసారి బద్ధకంగా వత్తిగిల్లి కళ్లుమూసుకుని అలాగే పడుకున్నది మంచంమీద. కళ్లు విప్పాలని అనిపించలేదు... బాధకలిగించే ఈ వాస్తవికతని చూడాలని శ్యామలకి అనిపించలేదు.

సంగీతం బాగుంది...వీణానాదంలో ఎంత సౌందర్యం ఉందని!...ఉదయం మరీ కోమలంగా అందంగా ఉంటుంది సంగీతం. ఉదయం మరీ సౌందర్యవంతంగా, దేవత్వంలా ఉంటుంది వీణానాదం...అలా అనుకుంది శ్యామల.

పచ్చటిపొలాల ఒడ్డున కూర్చుని, గట్లు కనిపించకుండా పెరిగిన [illegible] వంక చూస్తూంది తను...కళ్ళు

చూడగలిగినంత మేర, మనసు ఊహించుకోగలిగినంతదూరం. ఆ పచ్చదనం ఎంతో హాయిగా ఉంది...చిన్న చిరుగాలులకి తలలు వూపుతూ నృత్యంచేస్తూన్న ఆ మొక్కలతో తానూ కలిసి ఆడితే!...

కరిగిపోయింది కల. మళ్ళీ వీణానాదం...

మళ్ళా కరిగిపోయింది నిజం, మళ్ళా శ్యామల కరిగి పోయింది తన కలల్లోకి.

ఈసారి తాను సముద్రపు వొడ్డున కూర్చున్నది. ఇసుకలో బొమ్మలు గీసుకుంటూ ... కెరటాలు పందేలు వేసుకుని వచ్చినట్లు వస్తున్నాయి. తాను బొమ్మలుగియ్యడం మానేసింది_వాటిని చూసేందుకని. అవి తననిచూసి చిరు నవ్వునవ్వినట్లనిపించింది...తానూ నవ్వింది లేతగా.

కెరటాలు మళ్ళీ నవ్వాయి. తానూ నవ్వుతున్నది. కెరటాలతో ఆడుకోవాలనిపించింది శ్యామలకి.ఆ నీలిరంగులో ఏముందో తెలుసుకుని, కొంచెం తెచ్చుకోవాలనిపించింది. తాను చేతులు చాచింది. కెరటాలు వెనక్కి పోయాయి. తనూ వాటి వెనకాల పరుగు పెట్టాలనిపించింది. ఎవరో ఆపారు. ఎవరో...

సముద్రం త్వరగా కరిగిపోయింది. అంతా కల. సంగీతం మాత్రం వినిపిస్తూనే ఉంది.

నెమ్మదిగా కళ్లు తెరిచింది శ్యామల. ఒక్కసారి ఆ మగత అంతా వొదిలిపోయింది. ఎదురుగా ఆయన నిల బడి ఉన్నాడు-తనకళ్ళల్లోకే సూటిగా చూస్తూ-

ఆ చూపు కిరణాలలాగ తనకళ్ళలో పడుతూన్నది. శ్యామల కొద్దిక్షణాలు నిద్రకీ, తెలివికి మధ్యన ఉన్న లోకాలలో ఉండిపోయింది.

తెల్లటి పంచె, తెల్లటి కళ్ళీచొక్కా, శుచిగా తలంటుకున్న శరీరం. ముఖాన లేత చిరునవ్వు, సత్యం అలాగే ఆమెకి ఎదురుగా నిలబడి చూస్తున్నాడు.

"దీపావళి వొచ్చింది శ్యామలా!"

అవునన్నట్లు ఎక్కడో టపాకాయి పేలింది.

"చూశావా? సాక్ష్యంకూడా!"

అతను చిరునవ్వు నవుతూ ఆమె ప్రక్కన కూర్చుని, రెండువైపులా రెండుచేతులూ వేశాడు కళ్ళల్లోకి సూటిగా చూస్తూ.

తనకళ్ళని మరల్చుకోవడానికే ప్రయత్నిస్తూంది. అతనుమాత్రం వాటిని పట్టుదలగా వెంబడిస్తున్నాడు.

"లేవాలని-లేదుకదూ?"

ముఖంమీది ముంగురులని సున్నితంగా వెనక్కితోస్తు అన్నాడు సత్యం.

ఆమె మాట్లాడలేదు.

"దీపావళి - శ్యామలా!... ఈ చీకట్లో దీపాలు పెట్టి వెలుతురు తెస్తారు. నక్షత్రాలతో పోటీచేస్తూ ఈ దీపాలు... ఎంత ఆనందంగా ఉంటాయి!...కదూ?"

అతను చూపు త్రిప్పడు—ఆమె కళ్లు మరల్చుకోలేదు.

"మనఇంట్లో...దీపాలు ఉదయమే పెట్టేరు!"

శ్యామల తెల్లబోయినట్లు చూసింది_ఒక్క_క్షణం.

"నిజం. ఈ గదిలో దీపాలు చూపనా?"

అర్థంకానట్లు చుట్టూ చూడబోయింది శ్యామల.

"వొట్టి మంచిదానివి!" ఆమెకళ్ళని వెంటాడుతూనే అన్నాడు సత్యం చిరునవ్వుతో.

ఆమె మాట్లాడలేదు—అలానేచూస్తూ...

"ఏం తెలీనిపిల్ల... దీపాలు నీకళ్ళలోనే ఉంటే నీకెలా కనిపిస్తాయి? అద్దం తేనా?"

అప్పటికి శ్యామలకు అతని ఉద్దేశం బోధపడింది. అతని కళ్ళల్లోని వెలుతురు కనిపించింది. ఆ కాంతీ, అతని అంతరంగంలోని ప్రశాంతతా ఒక్కసారి ఆమెకి తెల్లవారిందనే విషయాన్ని జ్ఞాపకం తెచ్చాయి. సిగ్గుపడి లేవబోయింది.

"మాట్లాడవ్ శ్యామా!"

అవును... తాను మాటలాడలేదు... మాటలాడదు— అతనికళ్ళ మెరుపులోకిచూస్తూ తానేమని మాటలాడగలదు?

తనకి కనిపించేది ఇక్కడా అక్కడా, అంతటా చీకట్లే. ఆ దీపాలు తనకేమి కనిపిస్తాయి ?

"నేనలా అనుకోలేదులే."

నెమ్మదిగా అని, అతను చేతులుతీశాడు. లేచి త్వరగా అవతలిగదిలోకి వెళ్ళిపోయింది శ్యామల. అతను చివర అన్న మాటలు పదేపదే మననం చేసుకుంటూ.

అద్దంతీసి, ఒక్కసారి వెలుతురులో చూసుకున్నది.

కళ్లు... కళ్లు— అంతే. అందులో అతనికేమిటి కని పిస్తాయి? దీపాలు... దీపాలు...

అద్దం నెమ్మదిగా క్రిందను ఉంచి బ్రష్‌తీసుకుని వరండా లోకి వచ్చింది శ్యామల... అక్కడక్కడా దీపావళివొచ్చిన విషయానికి గట్టిసాక్ష్యాలు వినిపిస్తున్నాయి.

వొద్దనుకొన్నకొద్దీ శ్యామలమనస్సులో దీపాల వరు సలూ, మెరిసే బాణసంచా పదేపదే మెదలసాగాయి. అతని మాటలూ, ఆ కళ్ళలో తాను గమనించిన ఉత్సుకతా, ఆప్యాయమూ, పదేపదే ముళ్ళలాగ గ్రుచ్చుకుంటున్నాయి.

రెండేళ్ళక్రితం ఆ దీపావళినాడు తాను తలంటి నీళ్ళు పోసుకున్నది... తెల్లటి చీర కట్టుకున్నది... నీలిబ్లౌజు వేసు కున్నది... తల అంతా విరియబోసుకుని ఆర వేసుకుంటూ...

చేతిలో బ్రష్ నెమ్మదిగా ఆగిపోవడంతో శ్యామలకి తెలివి వొచ్చింది. వొద్దు... వొద్దు... అనుకున్నది. ఆ కథ

అంతా ఎందుకు ప్రశ్నించుకుని విచారించడం? ఆ రోజులు తిరిగి వొస్తాయనా? తొందరగా పళ్ళుతోముకుని, ముఖం కడుక్కుని, తిరిగి గదిలోనికి వెళ్ళిపోయింది శ్యామల. ఆలోచనలని బలవంతాన ఆపుచేసుకుంటూ.

సత్యం నిలబడి కిటికీలోనించి చూస్తున్నాడు. శ్యామల నెమ్మదిగావచ్చి టేబిల్ దగ్గర కూర్చుంది. కుక్ కాఫీ తెస్తే...

"రేడియో కట్టేసేదా?"

"మీ ఇష్టం."

తేలికగా అంది శ్యామల. అతను రేడియో కట్టేసివచ్చి తనదగ్గర నిలబడ్డాడు. వంటవాడు కోపాతో కాఫీ, కప్పులూ టేబిల్ పైన పెట్టి వెళ్ళాడు.

ఆమె కోపా తీయబోయింది.

"ఇవాళ నాది", అన్నాడు సత్యం.

కప్పులో కాఫీ పోస్తూ, "ఒకటడగనా శ్యామలా?" అన్నాడు నెమ్మదిగా సత్యం.

"ఏమిటి?"

"మనని గురించి..."

నిశ్శబ్దంగా కాఫీతాగడం ముగించి పేపరుతీసుకుంది శ్యామల...ఏం జవాబు చెప్పడానికీ ఆమెకి పాలుపోలేదు.

"అడగనా శ్యామా?"

నెమ్మదిగా మళ్ళా అడిగాడతను.

"ఊఁ..."

"నిన్ను సుఖపెట్టడానికి నేనేం చేసేది శ్యామా?"

"ఏమీ వొద్దు...నాకు సుఖంగానే ఉంది."

శ్యామల యాంత్రికంగా అన్నది... ఈ రోజు లన్నిటి లోనూ ఆ ప్రశ్న సుమారుగా రానేవొచ్చింది ఎన్నోసార్లు. ఇవాళ మరికొంత స్పష్టంగా వచ్చింది—అంతే.

"అయితే, మనకింక మార్గాంతరం లేదంటావు..."

"లేదు..."

"ఇలాగే, పొడిగా బ్రతుకుదామా శ్యామా?"

"అది మనచేతుల్లో లేదులెండి... మనం చేసుకున్నదే మన చేతిలో ఉండదు! చెయ్యనిది ఎలా ఉంటుందీ?"

అతను నెమ్మదిగా బయటికి వెళ్ళాడు. అతను తిన్న దెబ్బ ఆమెకి తెలుసు...ఎందుకో జాలి అనిపిస్తుంది కూడా. కాని, నిజాన్ని దాచినకొద్దీ నిప్పులాగ అది రగిలి బాధించడం కన్న ఫలితం ఉండకపోవచ్చు. నిజాన్ని దాచడమూ తన ఉద్దేశం కాదు.

రెండేళ్ళ క్రితం...

తను తల ఆరవేసుకుంటూ, గార్డెన్‌లో కూర్చున్నది. అంతా పండగ హడావుడి. తనకే మనస్సులో ఏవో ఆలోచ

నలు సాగుతున్నాయి. ఆ పచ్చటి చెట్లూ, రంగురంగుల పూవులూ తన మనస్సులో ఏవో గిలిగింతలు పెడుతూ తనని ఆలోచనల్లో ఊగులాడిస్తున్నాయి—జోకొడుతూ.

ఆ క్షణంలో తాను కొంచెం మగతలోకి జారిందన్నట్లనిపించింది. అతని చక్కని విగ్రహం తన కళ్ళల్లో నాట్యం చెయ్యసాగింది.

అతను దైవమూర్తి అనుకున్నది తాను.

ఆ క్షణంలో తనకెందుకో అత నెన్ని రేఖల్లో దైవత్వాన్ని దాచుకున్నట్లు కనిపించాడు.

అప్పటికి తాను ఆరు నెలలనుంచి చూస్తూన్నది. అత నెన్నడూ గట్టిగా మాటలాడలేదు. అనవసరంగా ఎవరితోనూ జోక్యం కలుగజేసుకోలేదు. వచ్చి నాన్నగారి లైబ్రరీలోకి వెళ్ళేవాడు. తనకు కావాల్సిన పుస్తకాలు తీసుకుని, చదివి, నోట్సు వ్రాసుకొనేవాడు. టైమ్ అయాక లేచి ఫైలుతీసుకుని వెళ్ళిపోయేవాడు.

తాను తోటలో కూర్చుని ఉండేది; ఉదయం సాయంత్రం గేటు తీసుకుని లోపలికి వచ్చి తన ముందరినించే లోపలికి వెళ్ళిపోయేవాడు——ఎన్నోసార్లు అతను ఆగి, ఒక్క మాట ఆడతాడని తాను ఆశపడేది.

ఊహూఁ ఎన్నడూ—ఆర్నెల్లల్లో, రోజూ ఈ కార్యక్రమం సాగుతూన్నా, అతను తనముందు ఆగలేదు. తిన్నగా వచ్చి వెళ్ళిపోయేవాడు.

ఒకసారి నాతో మాటలాడితే! అనుకునేది తను. ఎందుకని తన ఆత్రుత గ్రహించడు? అనుకొనేది. మొదట కోపం వచ్చింది. తరవాత అసహ్యంవేసింది—కాని తరవాత అణచినకొద్దీ తన ఓటమి తనని మరీ కరిగించాక తాను అలా జరుగుతుందని ఆశించేది. ఏదో అందరాని గొప్ప విషయంలాగ కనిపించేవాడతను. గంభీరంగా, ప్రశాంతంగా తానెన్నాళ్లో కలగన్నట్లు.

ఆనాడు అతనురాడు—దీపావళికైనా సెలవుతీసుకోడూ? ఎందుకో అతను రాడనుకుంటేనే తనకి కష్టం అనిపించింది.

అలానే తాను కూర్చున్నది, ఇవన్నీ ఆలోచించుకుంటూ.

కొద్దినిముషాలు గడిచాయి. చిన్న నిద్రనించి మెలకువ వొచ్చినట్లైంది. ఎదురుగా అతను నిలబడి ఉన్నాడు.

ఆ క్షణంలో తాను ఎంత ఆశ్చర్యపడ్డదో శ్యామల ఎప్పటికీ మరిచిపోలేదు. కలలన్నీ నిజమై, కలలోని ఆశలు నిజమై....

తాను తెల్లబోయి చూసింది.

"క్షమించండి," అన్నాడతను.

"ఎందుకు?" అనబోయింది శ్యామల. కాని...

"మీ నిద్ర పాడుచేశానా?" అని అడిగాడతను.

"లేదు," అన్నది తాను.

"కళకోసం మీ నాన్నగారి లైబ్రరీ ఆరునెలలనించి గాలిస్తున్నాను. ఎన్నో విషయాలు తెలుసుకున్నా ననుకున్నాను, కాని..."

"ఏమిటి? ఏమిటి?"

"ఇవాళ క్రొత్తగా నేను చిత్రించాల్సిన దేమిటో గమనించగలిగాను. మీరు నిద్రిస్తూన్నప్పుడు ఆ సౌందర్యం-నేనెన్నడూ ఊహించలేకపోయి ఉందును. ముఖ్యంగా ఆ తెల్లటి ఫాలభాగంమీద పడుతూన్న ఆ ముంగురుల సౌందర్యం... క్షమించండి—అతిగా మాట్లాడుతున్నానా?"

ఏమిటోలా ఉంది శ్యామలకి. తాను కలగంటూన్నదా?

"వీటన్నిటినీమించి ఆ కళ్లు. మీరు దేవతా స్వరూపులు. కళ్ళని నేను కుంచెతో తేగలిగితే ధన్యుణ్ణయాననుకుంటాను."

తాను తన్మయురాలై వింటూన్నది.

"ఒక్క కోరిక ఉంది శ్యామలాదేవీ!"

తన పేరుకూడా అతనికి తెలుసును. ఆ క్షణములో తానెంత గర్వపడింది!

"ఒక్క గంట...మీ నాన్నగారి స్టూడియోలో నా కోసం కూర్చుంటారా?"

"అలాగే లెండి."

తేలికగా అన్నది తాను. అతను వెళ్ళిపోయాడు కొండలమీదనించి కొండలమీదికి గెంతుతూ ఆడుకోవా లనిపించింది తనకి. అద్దం చూసుకున్నది. తన కళ్ళలో అంత సౌందర్యం ఉందా? అతని మెప్పుని పొందేంత సౌందర్యం?

ఆ రోజంతా పువ్వులమీద గడిపింది తను.

చీకటిపడేక తాను బాల్కనీమీద నిలువబడి ఊరిలోని దీపాలమధ్యకి చూస్తూ ఆలోచించసాగింది. తనచుట్టూ దీపాలు, ఊరిలో దీపాలు, ఇంటింటా బారులుతీర్చిన దీపాలు, వరుసలుదిద్దిన జ్యోతులు, తన మనస్సులో ఉన్న దీపాలకి అది వాస్తవిక ప్రతిబింబాలలా అనిపించింది శ్యామలకి.

ఇంట్లో అందరూ పనుల్లో ఉన్నారు. తాను అలాగే ఆలోచించసాగింది. ఈ దీపాలిలాగ ఉండిపోతే! ఎప్పుడూ కాలం కదలకుండానే ఉండిపోతే!

"నమస్కారం శ్యామలాదేవి!"

త్రుళ్ళిపడింది తాను. అతను మళ్ళా, అప్పుడు!

అతను కొద్దిదూరంనించి తనవైపు అలాగేచూస్తూ నిలబడ్డాడు. తనకెందుకో శరీరంఅంతా కాంతిగామారిపోయి, పైన కాంతిలో కలిసిపోతూన్నట్లనిపించింది.

"దీపాలు చూస్తున్నారా?"

"అవును. బాగున్నాయికదూ?"

"చాలా...కాని, మీ కన్నుల్లో కాంతి మీద ప్రశాంతంగా, ప్రకాశవంతంగా ఉంది. ఊరంతా తిరిగాను చక్కటి బొమ్మకి ఐడియా దొరుకుతుందని. చివరి కిలాగ వచ్చాను. నామూర్ఖత్వం ఇప్పటికి తెలిసివచ్చింది. ఈ దీపాలన్నీ, చీకటి ఉంటేనే ప్రకాశిస్తాయి. మీకళ్ళు ప్రకాశానికే అందాన్నిస్తాయి."

అతను మరేమీ మాట్లాడలేదు. కొద్దిక్షణాలు అలాగే తానూ అతనూ ఉండిపోయారు.

"సెలవు శ్యామలాదేవి! మళ్లా మనం త్వరలో కలుసుకుంటాం అనుకోను, రేపు వెళ్తున్నాను."

చెంపదెబ్బలాగ తగిలింది... రేపు...

"ఇవాళ ఇంటినుంచి ఉత్తరం వచ్చింది. మా అమ్మాయికి చాలా జబ్బుగా ఉందని, వెళ్ళాలి. నా పనీ ఇక్కడ అయిపోయింది. ఇంటికి వెళ్ళి బొమ్మలు వేస్తాను. మీకు కాపీ పంపుతాను."

కాలిక్రింద ఉన్న సిమెంటు కట్టడం కరిగిపోతూన్నట్లయింది. అతను ఆ చీకట్లోకి వెళ్ళిపోతున్నాడు.

ఎన్నాళ్ళనించో కంటూన్న కలలు, నిజమైనట్లు కల, చీకట్లో కలిసింది.

తరువాత అతను వెళ్లిపోయాడు. బొమ్మలువేశాడు. తనకి అటు చూడాలనిపించలేదు.

దీపావళి పేరు చెప్పినప్పుడల్లా అదంతా జ్ఞాపకం వస్తుంది. దొంగాటలో దొంగ నిజంగా మాయమయిపోయి నట్లనిపిస్తుంది.

అదే, రెండు సంవత్సరాలక్రితం, అతను...

అద్దంలో చూసుకునేసరికి తన తెల్లటి నుదురూ కళ్ళూ తననే వెక్కిరించినట్లనిపించింది శ్యామలకి. భర్తా, సంసారమూ, ఇవన్నీ తన కెప్పుడూ హేళన చేస్తోన్నట్లే అనిపిస్తూంటాయి.

దీపావళి మరీని, ఆ దెబ్బలన్నీ జ్ఞప్తికి వస్తాయి.

సాయంత్రం అట్లాగే ఆలోచిస్తూ బాల్కనీమీద నిలబడి చీకటినీ, దానిని అలంకరిస్తూన్న చిన్నచిన్న దీపాల వరుసల వందలనీ చూస్తోంది శ్యామల. మధ్యమధ్య టపా కాయలూ, తారాజువ్వలూ, ఆమె అవధానాన్ని బలంగా లాక్కుపోతూన్నా, ఆ దీపాలమధ్య, ఈ చీకట్లలో తన జీవి తాన్ని గురించి ఆమె ఆలోచించుకుంటూన్నది.

ఎక్కడో నిలబడి తనని తను చూస్తున్నాడని శ్యామల అనుకున్నది.

అవును. సత్యంకి కావల్సినదీ తన సౌందర్యమే. అందుకే తానింత హాడిగా జీవితం గడపాల్సి వచ్చింది. కొంచెం ఈ మెరుగు పోయాక తానెవరికి కావాలి?

ఆ మాటే ఆమె పదేపదే ఆలోచిస్తుంది.

ఈ సౌందర్యం కాకుండా, ఆ కళ్లుకాకుండా ఆ నుదురు, ముంగురుల అందంకాకుండా, తా నెవరికి కావాలి?

సత్యానికి కనిపించేవీ అవే. తనని తనెవ్వడూ చూడడు ... చూడలేదు.

చీకట్లు చిక్కబడినకొద్దీ దీపాలు కాంతులుప్రస్ఫుటాలు అవుతున్నాయి. తగిన గమ్యస్థానంగురించిఆలోచించుకుంటూ శ్యామల అలానే నిలబడింది.

తనచుట్టూ చీకటినిండా దీపాలు.

నెమ్మదిగా వొంగి, క్రిందనున్న దీపాల వరుసలు చూడబోయింది శ్యామల. చేతికి చుట్టుకున్న చెంగు చిన్న ప్రమిదని రాసుకుని అంటుకుంది. మంట ఒక్కసారిలేచి నుదురుకి తగిలింది.

ఛర్రున వొచ్చిన మంటనించి శ్యామల త్వరగా తప్పించుకోలేకపోయింది. నుదురంతా కాలేదాకా చీరని ఉన్నమంటా ఆరలేదు. తరువాత—

బాధగా కళ్లు తెరిచింది శ్యామల. నుదురు అంతా విపరీతంగా బాధిస్తూన్నది. కట్లు కట్టారులా ఉంది.

"ఎలా ఉంది శ్యామా ?"

సత్యం నెమ్మదిగా అడిగాడు. శ్యామల తెల్లబోయి నట్లు చూసింది. ఆ ఆప్యాయం ఇంకా...

"ఎలా ఉంది?"

మళ్ళీ అడిగాడు.

"ఆ అద్దం ఓసారి..."

అతను తెచ్చి ఇచ్చాడు.

"కట్టు విప్పండి."

"ఎందుకు?"

"ఒక్కసారి విప్పండి."

"వద్దు శ్యామా చాలా బాధ పెడుతుంది. వొద్దు."

"కాదు—వెంటనే కట్టుకుంటానుగా!"

నెమ్మదిగా ఆ కట్టు విప్పాడు సత్యం. నుదుటి నిండా నల్లటిగాయం. ఒక కంటిక్రింద పెద్దమచ్చ అద్దంలో.

"అసహ్యంగా ఉందికదూ?"

"లేదు శ్యామా. ఏమిటా ప్రశ్న?"

"చెప్పండి."

"లేదు. ఏమీ అసహ్యంలేదు. కొద్దిరోజుల్లో అంతా పోతుంది."

"మచ్చలు ఉంటాయి."

"ఉండనీ."

అతను అద్దం తీసుకుని దూరంగా పెట్టేడు. ఆమె మళ్ళా మంచంమీద పడుకుని ఒకసారి కళ్ళు మూసుకుంది.

కళ్ళు తెరిచేసరికి అతను ఎదురుగా నిలబడ్డాడు, తన కళ్ళల్లోకి చూస్తూ.

"కట్టు కట్టేదా శ్యామా?"

ఆ ఆప్యాయంతోనే అడిగా డతను దగ్గరగావొస్తూ.

"ఒద్దు. అవసరంలేదు."

నెమ్మదిగా అతనిచేతులు తన చేతులలో తీసుకుంటూ అన్నది శ్యామల.

"ఏమిటా?"

"దీపావళి వొచ్చింది. అందుకనీ."

— తెలుగు స్వతంత్ర, 13-11-53

# నీతిపరులు

టికెట్ తీసుకుని ప్లాట్‌ఫారమ్‌మీదికి వెళ్ళేసరికి రైలు కదులుతూన్నది. త్వరగా ఒక కంపార్టుమెంట్‌లోకి ఉరికాను. కేవలం హేండ్‌బేగ్‌తో మాత్రం ప్రయాణం చేస్తూండడం వల్ల చాలా కష్టం లేకుండా ... తలుపుమీద తెల్లగా రాసిన "రిజర్వ్డు" గుర్తుమీదికి నా దృష్టిపోయేసరికి నేనేమి చెయ్య లేని స్థితిలో ఉన్నాను. రైలు త్వరగా సాగిపోతూన్నది.

లోపలికి చూశాను. సెకండ్‌క్లాస్ కంపార్టుమెంటు. ముగ్గురు నలుగురుకన్న లేరు. ఒక అమ్మాయీ, మరో యువకుడూ—కొంచెం వయస్సు ఉన్న ఒక పెద్దమనిషీ...దూరంగా ఎవరో ముసిలాయన.

నేను లోపలికివెళ్ళి ఖాళీగా ఉన్న ఒక కిటికీదగ్గర కూర్చున్నాను, నాకు నేనే క్షమాపణ చెప్పుకుని. యువకుడు నావంక చాలాసార్లు చూస్తున్నాడు. అతనే కంపార్టుమెంట్ రిజర్వు చేయించుకున్నాడనుకున్నాను.

"సారీ... మీకు అంతరాయం కలిగించను... వచ్చే స్టేషన్‌లో మారతాను", అన్నాను–యువకుడి సిల్కుబట్టలకీ, అతనిచేతిలోని త్రీకాసిల్స్ టిన్నుకీ కొంతగౌరవమిస్తూ.

అతను పెద్దగా నవ్వాడు. మిగిలినవాళ్లు ఏమీ అర్థం కానట్లు నా వంక చూశారు. నేనూ అలాగే...

అతను హఠాత్తుగా నవ్వుని ఆపి—"ఎందుకూ దిగి పోవడం?—టికెట్ లేదా?" అన్నాడు.

"మీరీ కంపార్టుమెంట్ రిజర్వు చేసుకోలేదూ?" అన్నాను.

"సరీ... అయితే నాటకం పనిచేసింది!" అన్నాడు యువకుడు. ఈసారి అందరమూ అతనివైపు చూశాము.

"అవతలిస్టేషనులో ఎవరో కుర్రాడురాసేడు".

అతను నవ్వుతూ అనేశాడు– నేను తర్వగావెళ్లి చెపుదా మనుకున్నాను. కాని అంత పరోపకారిపోజు ఒక్కసారి వెయ్యలేక కూర్చుని, ఇటు తిరిగి సంచీలోంచి ? జర్నల్ తీసుకున్నాను.

ఆ అమ్మాయిచేతిలో ఉన్న పు
ఓసారి చూశాను. అగాథాది.

టూన్నది. నేను నా పుస్తకంలో కొంచెంసేపుగడిపి, క్రింద పడేసి, కిటికీలోంచి బయటికిచూస్తూ కూర్చున్నాను.

"అయితే, ఒకే విశ్వం! ఎక్కణ్నించి వొస్తున్నావు, ఎక్కడికి పోతున్నావు?... చెప్పరా!"

పెద్దమనిషి యువకుణ్ని ప్రశ్నించాడు...ఆ గొంతుకని బట్టి వాళ్లు చిరకాల మిత్రులనీ, చాలాకాలం తరువాత ఇప్పుడే కలుసుకున్నారనీ తెలుసుకున్నాను.

"ఏం చెప్పేది బాబాయ్!... నీ ఆశీర్వచనంవల్ల నా పరిస్థితి అంతా మారిపోయిందనుకో. ఒకసాగి మన వూరు వొచ్చి అందర్నీ చూడాలని ఉంది. ప్రస్తుతం వైజాగ్ కొంచెం షిప్పింగ్ బిజినెస్మీద వచ్చాను. మద్రాసు వెళ్తున్నాను."

పెద్దమనిషి చాలా ఇంప్రెస్ అయ్యాడులా ఉంది. "అసలు నువ్వు చేస్తూన్న ఉద్యోగం ఏమిట్రా?" అన్నాడు.

"కమిషన్ వ్యాపారం బాబాయ్! కొన్ని వందల మందిని లక్షాధికారులుగా, కోటీశ్వరులుగా చేసిన వ్యాపారం. తెలివితేటలుంటే తిరుగులేదనుకో! ఇక్కడ సరుకు ఖరీదుచేసి షిప్ చేసేడమే...బిజినెస్...నూటికి రూపాయ్. నిన్న రెండు లక్షల సరుకు లోడ్ చేయించేనా?"

"రెండు... వే...లు..."

ఁదు వేలు_ రాకపోదునుగాని మొహమాటం
ాయ్! కట్, షైన్ అండ్ కో అని—
నప్పుడు చాలా పరిచయం అయి

పోయింది. అస్తమానం లండన్ రమ్మని ఉత్తరాలే! సిగరెట్ కాల్చు బాబాయ్."

"నాకు చుట్ట ఉందిలేరా."

"ఫరవాలేదులే. ఈ సిగరెట్లు మనకి చాలవు. చాలా మెల్లుగా ఉంటాయి. ఫూర్ వైజాగ్‌లో టిన్ ఆరుంబావలా కన్న పెద్దరకం దొరకలేదు."

"ఆరుంబావలా?"

"అంతే బాబాయ్! చవకరకం!"

పెద్దమనిషి తాను కాలుస్తూన్న సిగరెట్ వంకే పరీక్షగా చూశాడు. యువకుడుమాత్రం అలారంలాగా కొట్టుకుపోతున్నాడు.

"అంతా కులాసాయేనా బాబాయ్! ఓసారి వచ్చి చూద్దామంటే బొత్తిగా కుదరడం లేదనుకో. రేపు సాయంత్రం ఎయిర్‌లో కలకత్తా పోవాలి. తరవాత బొంబాయి, అబ్బబ్బ—ఛస్తూంటేనే!... అయితే మీా వెంకటమహాలక్ష్మికి పెళ్లి చేసేసేవా?"

"ఇంకా లేదురా. ఇంక సంబధాలు చూడాలి. చెల్లెలు కూతురైతేనేం...నా కూతురైతేనేం, ఒకర్తేగా..."

"అంతే బాబాయ్! నీ విశాలదృష్టిగురించి నాకెప్పుడూ తెలుసును. అయితే సంగీతం నేర్చుకుంటోందా ఇంకా?"

"ఓ...పదో ఇరవయ్యో కృతులొచ్చాయి. గిట్టక అందరూ అలా అంటారుగానీ—దాని గొంతుకా, ఆ సంగీతమూ ఎవళ్ళకివొస్తాయిరా?"

"నిజం–నిజం బాబాయ్! ప్రపంచం అంతా ఒట్టి దగాకోరులనుకో.. నాది అరవైవేలు మొన్న వీనస్ బేంక్ నించి విత్ డ్రా చేస్తే, బేంక్ రప్ట్ అయిపోయేనన్నారు. ఎంత గొప్ప వ్యాపారంలో పెట్టానో వీళ్ళకి తెలుసా?"

"వాళ్ళకేం తెల్సురా?"

"బాగా అన్నావు. ఇంత వ్యాపారం ఒక్క చేత్తో చేసుకొస్తున్నానుగదా ... అంత తెలివితక్కువగా అడుగు వేస్తానంటావా?"

"అబ్బే! నువ్వు చాలా జాగ్రత్త అయిన వాడివి."

"నాసంగతి నీకు తెల్సు బాబాయ్! ఓసారి మదరాసు తప్పకుండా రా...నాలుగు దేశాల వర్తకులకీ పరిచయంచేసి వదిలేస్తాను. మీ జిల్లా వేరుసెనగ అంతా నూటికి పాతికలు ఎక్కువ ఇచ్చి కొనేయి...లాభం అంతా మనదే."

"అంతఖరీ దొస్తుందిట్రా?"

"నీకేం తెల్సు బాబాయ్! వేరుశెనగ అన్న అక్షరాలు వింటేచాలు డబ్బు కురిసేస్తుంది. వాళ్లు ఆ తొక్కలని యంత్రాలతో కాగితాలుగా తయారుచేస్తారు. ఆ పలుకుల్లోంచి నూనెలూ, అత్తరులూ, సబ్బులూ, బిస్కట్లూ, తయారు చేసేస్తారు."

"ఒరేయ్ విశ్వం! ఎంతవాడివయ్యావురా!"

"ఇదేముంది బాబాయ్! ఒక షిప్ కాంట్రాక్ట్ కొట్టేయాలని చూస్తున్నాను. అదిగాని కుదిరిందా మనవూళ్ళో ఎయిరోడ్రోమ్ కట్టించాలనుకో... ఇవాళ బొంబాయ్, రేపు బర్మింగ్‌హాం, ఎల్లుండి కొలంబో-కాన్‌బెర్రా, అబ్బ! తీరుబాటులేదనుకో."

ఐస్ అయిపోయి వింటున్నాడు పెద్దమనిషి.

"ఆ జర్నల్ ఒకసారి ఇస్తారా?"

డిటెక్షన్ పూర్తి అయినట్లుంది-అమ్మాయి అడిగింది.

ఇస్తూ, "మీ పుస్తకం ఓసారి ఇవ్వండి", అన్నాను.

"లాభం లేదండీ. నూరునుంచి నూటపన్నెండుదాకా పేజీలు ఎగిరిపోయాయ్. సరిగా విక్టర్ రైలుకోసం కారుమీద రష్ అయేదగ్గరే ఈ అఘాతం వొచ్చేసింది. ఏమైందో ఏమో!" అంది...చాలా ఆందోళనగా.

"నేను చదివేనులెండి," అన్నాను.

"ఏమైందండీ?" అంది అమ్మాయి-ఆత్రుతగా నావంక తిరుగుతూ.

"విక్టర్ రష్ అయేసరికి ట్రెయిన్ బ్లూక్రాస్ స్టేషన్ వదిలేస్తుంది. హీరోయిన్-అదే కాలేజీ లెక్చరర్..."

"ఆఁ... నెల్లీ..."

"అవును. నెల్లీ స్టేషనులో కనిపించి డ్రమ్మొండ్ నించి వొస్తున్నాననీ, అక్కడ ఎఫిలీ కనిపించిందనీ, ఆమెదగ్గర ఆ ఎర్ర అట్టల పుస్తకం చూశాననీ, ఆమె తనని చూడలేదనీ చెప్తుంది."

"అరే!...ఎఫిలీ బ్రతికే ఉందా?"

"ఆఁ... కార్స్మోష్‌లో ఆవిడ చాలా విచిత్రంగా తప్పించుకుని ఉంటుంది."

"ఆ పుస్తకం విక్టర్ సెల్‌లోనించి యెలా వెళ్లిందీ?"

"బ్లాకర్ దాన్ని తీసికెళ్ళి కొన్ని ఫోటోస్టాట్లు తయారు చేయించడానికి వెళ్తూంటాడు ... కార్స్మోష్‌లో అతను చని పోతాడు. పుస్తకం ఆమెకి దొరుకుతుంది."

"నెల్లీ ఆ పుస్తకం పోలీసులకిస్తే మిస్టరీ సాల్వ్ అవుతుందే!"

"అవదు!"

"ఏం?"

"అందులో మూడు పేజీలు ఉండవు!"

"అయ్యయ్యో!"

"ఆఁ. చివరకి ఆ మూడు కాగితాలనీ పోలీస్‌డాగ్స్ సహాయంతో ట్రేస్ చేస్తారులెండి..."

"అందుకా 'మిస్టరీ ఆఫ్ దినోస్' అంది!"

"అవును."

"గొప్పగా ఉంది."

ఆవిడ తిరిగి తన పుస్తకంలో లీనం అయింది. ఇంతలో మా స్టేషన్ రానేవచ్చింది. పెద్దమనిషి త్వరగాదిగి ... "వొస్తారా విశ్వం!" అన్నాడు.

"గుడ్ బై బాబాయ్...అడ్రస్ కార్డు ఇస్తానుండు."

కాని, మరుక్షణం యువకుడిముఖం అమెరికన్ ఫ్లేగ్‌లా వక్షత్రాలు మెరిపించింది.

"ఏమిట్రా?"

"స్కాండల్...ఎవడో జేబుకొట్టేశాడు బాబాయ్!"

"అరే!"

యువకుడు ప్రక్క జేబు చిరిగినది చూపేడు.

"ఎలాగరా!"

"ఏదో చేస్తాను... వెళ్ళగానే పంపుతాను— కొంచెం డబ్బియ్యి బాబాయ్. రేపు కలకత్తా వెళ్ళాలి. లేకపోతే వైర్ చేసి ఇక్కడికే తెప్పించుదును."

పెద్దమనిషి త్వరగా జేబులో పర్స్ తీసి అతని చేతిలో ఉంచుతూ, "మూడొందల పదహారు రూపాయల ఎనిమిది— చిల్లర ఉంది...వెళ్ళగానే..."

"టి. ఎమ్. ఓ. చెయ్యనూ? ...... వెడతాను బాబాయ్...దిగులుపడకు_ సరిపోతుందిలే!" అన్నాడు యువకుడు. రైలు కదిలిపోతోంది,... నా ఫిలింపత్రిక ఆ మహిళామణి ఉంచుకుంది— పుస్తకంలో లీనమై బయటికి చూడనే లేదు...ఊళ్ళోకి బయలుదేరాను. రైలు వెళ్ళిపోయింది.



ఆ సాయంత్రం కాఫీ త్రాగుదామని ఒక హోటల్ లోకి వెళ్లాను. ఒక టేబుల్ దగ్గర రైలులోని పెద్దమనిషీ, గౌరవనీయులలాగ కనిపిస్తోన్న మరినలుగురు పెద్దలూ కూర్చున్నారు.

"మన విశ్వం జ్ఞాపకం ఉన్నాడా?"

"సరే— వాణ్ని మరిచిపోతామూ? ... ఎక్కడైనా కలిసేడా ఏమిటి?"

"ఆఁ. రైల్లో మదరాసు వెళ్తున్నాడు వైజాగ్ నించి. వాడిపని ఎంత బాగుందంటారు?"

ఆయన జరిగినదంతా అక్షరం పొల్లుపోకుండా వర్ణించి చెప్పేడు. చివరకి తాను డబ్బిచ్చిన విషయంకూడా చెప్పేడు.

ముందు వాళ్ళల్లో ఒకాయన నవ్వాడు. తరువాత అందరూ నవ్వేరు.

"విశ్వం సంగతి మీకు తెలీదుటండీ? వాడక్కడ ఒక మిల్లులో ఫిట్టర్ గా పనిచేస్తున్నాడు."

నామిత్రుడు తెల్లబోయాడు.

"నిజమే?"

"ఓ...అక్షరాలా వాళ్ళనాన్నని అడగండి కావలిస్తే."

"పోనీండి ... నేనుమాత్రం వాడి మాటలు నమ్మి ఇచ్చానంటారా ఏమిటి?"

"వాడిమాట లెవ్వరూ నమ్మరు!"

"అంతే ... ఏదో అవసరంలో ఉన్నాడు. మన ఊరు వాడు. సరే అన్నాను. ఇంతకీ నాకు పరాయివాడా? ఇచ్చింది మాత్రం ఏపాటి!"

"అబ్బే...అంతే!"

క్లబ్బుకి వెళ్ళినప్పుడల్లా పెద్దమనిషి మిత్రులలో తరచు విశ్వాన్ని తిడుతూనే మాట్లాడుతూ ఉండేవాడు. "వాడు పట్టి మోసగాడేనండీ! నాకు తెలీదు గనకనా!... అయినా ఎంతో అవసరంలో ఉంటే ఎందుకు సాయం చెయ్యక పోవాలి? అని ఇచ్చాను..."

ఈ ధోరణిలో సాగేది సంభాషణ.

నవ్వుకొనేవాడిని.

రాఘవరావు మావూరు పోస్టాఫీసులో గుమాస్తా. సాయంత్రం అతన్నోసారి కలుసుకుందామని ఆఫీసు వైపు వెళ్ళాను. మనీఆర్డర్లు రిసీవయినవి లెక్క వేసుకుంటున్నాడు. కూర్చున్నాను.

"ఈ ఫిగర్స్ ఓసారి డిక్టేట్ చెయ్ భాయ్ గిట్టడంలేదు" అంటూ మనిఆర్డరు ఫారాలు ఇచ్చాడు.

వరుసని చెప్తూంటే ఒక మొత్తం ఎందుకో కొంచెం పరిచితంగా కనిపించింది, 316-8-0.

జ్ఞాపకం వచ్చింది- తర్వగా చూశాను.

"పి. విశ్వం, ఫిట్టర్-ఆర్. సి. వర్క్షాప్."

ఆ పెద్దమనిషిదే అడ్రస్. క్రింద అడ్రస్కూడా చూశాను. మిత్రుడికి క్షమాపణ చెప్పి కూపన్లో వ్రాసినది చదివేను.

"బాబాయ్! నీదగ్గర నాటకం ఆడానని నీకు తెలిసే ఉంటుంది-నా ఉద్యోగం సంగతి. కాని, నిజంచెప్తే నా అవసరం తీరదనీ నాకు తెల్సును. అందుచే అబద్ధం ఆడాల్సి వొచ్చింది. క్షమించు. డబ్బుపంపడం కొంచెం ఆలస్యం అయినందుకూ క్షమించు—విశ్వం."

నాకు ఏదో చిత్రమైన గౌరవం కలిగింది విశ్వం అంటే. ఇటుపైని అతని మంచితనం వీరందరూ తెల్సుకుంటారని అనుకున్నాను.

మర్నాడు మనీ ఆర్డర్ పేమెంట్ అయింది. కాని, ఆ సాయంత్రం క్లబ్బులో ఆయన విశ్వాన్ని మామూలుగానే తిట్టాడు. తరువాత చాలా సాయంకాలాలు మిత్రులతో ఆయన గడుపుతూన్నప్పుడు, విశ్వం విషయం వొచ్చినప్పుడల్లా ఆయన విశ్వాన్ని తిడుతూనే ఉన్నాడు.

ఆయన పెద్దమనిషి, విశ్వాన్ని తిడుతూన్న వాళ్ళందరూ పెద్దమనుషులు...అదిమాత్రం నిజం—వాళ్లందరూ విశ్వాన్ని "ఫ్రాడ్" అంటారు.

అదీ నిజమేననిపిస్తూంటుంది—అప్పుడప్పుడు!

— తెలుగు స్వతంత్ర, 30–4–54

# 1+1=0

"శేఖర్ లేచాడా నర్స్!"

డాక్టర్ ప్రకాశం నడక నర్స్ రేఖకి వినపడినట్లు లేదు. అందుచేతనే, అతనువచ్చి తన నా విషయం అడిగేదాకా, ఆమె కతని రాక తెలియనేలేదు... కిటికీలోంచి బయటికి చూస్తూ, నెమ్మదిగా పడుతోన్న చినుకులూ, నల్లగా కొండలమీద వ్రేలాడుతూన్న బరువైన మేఘాలూ, చుట్టూ బలిసి అలుముకున్న చెట్లూ, ఆమె చాలా బలంగా ఆకర్షించినట్లు చూస్తూ, లీనం అయిపోయింది.

ఒక్కసారి ఈ సాగిపోతోన్న ఆలోచనలనించి తేరుకుని నర్స్ లేచి నిలువబడి, "గుడ్ మార్నింగ్ డాక్టర్", అన్నది.

"మార్నింగ్ రేఖా ... శేఖర్ లేచాడా?"

"లేదు..."

"టెంపరేచర్..."

"సబ్ నార్మలే ఉంది-ఇప్పుడు. ఉదయంనించీ కొంచెం రిసీడ్ అయి తిరిగి రైజవుతోంది..."

"చార్ట్ -"

రేఖ త్వరగా గదిలోంచి బయటికి నడిచింది- రెండో గదిలో శేఖర్ ఉన్నాడు. ఒక్కసారి అతనిముఖంలోకి చూసి, చార్ట్ తీసుకుని, డాక్టర్ గదిలోకి వెళ్ళింది.

డాక్టర్ ఏదో ఆలోచిస్తూ, కిటికీలోనించే బయటికి చూస్తున్నాడు. రెయిన్‌కోట్‌నించి పడుతోన్న నీటిధారలు చుక్క చుక్కా కలిసి చిన్న ప్రవాహంగా అయి డాక్టర్ జోళ్ళకిందికి పోతున్నై...బహుశా డాక్టర్‌ని ఆ దృశ్యం - కిటికీలోనుంచి - ఆకర్షించి ఉంటుంది... తన్మయుడైనట్లు చూస్తున్నాడు!

ఒకటి - రెండు ... నాలుగు నిముషాలు.

వర్షం క్రమంగా జోరవుతూంది. కొద్ది చినుకులు కిటికీలోంచి పడగానే డాక్టర్‌కి తెలివి వచ్చినట్లు ఉంది... త్వరగా కిటికీనించి దూరంగావస్తూ "అప్పన్నా! వచ్చి తలుపువెయ్యి!" అని కేక వేశాడు.

ఆ చిన్న హాస్పిటల్‌లో ఒక మూల కూర్చుని ముసిలి అప్పన్న కునికిపాట్లు పడుతున్నాడు ... నర్స్‌కి తెలుసు. ఆమె చేతిలోని చార్టు టేబిల్ మీదవుంచి కిటికీదగ్గరికి వెళ్ళి తలుపులు మూసింది.

"వాడు–వట్టి బద్ధకస్తుడై పోతున్నాడు..." గొణిగాడు డాక్టర్.

"ముసిలాడు..."

నాలిక కరచుకొంది రేఖ ... ప్రకాశం షాక్ తిన్నట్లు వెనుదిరిగాడు. ఒక్క–సారి నల్లటి ఆమె కళ్ళూ, దాహంతో ఉన్న అతనికళ్ళూ కలుసుకున్నాయ్. చాలా సిగ్గుపడుతోన్న రేఖ తన అందాలని దాచుకుంటూన్నకొద్దీ అవి మరీ ప్రస్ఫుటాలు కాసాగాయ్ ... బరువుగా తలవంచుకున్నది రేఖ.

బలమైన డాక్టర్ కండరాలు చాలా నీరసపడ్డాయ్. – ఆ మైకంతో ... కుర్చీలో కూర్చుంటూ, "కూర్చోండి", అన్నాడు.

"చార్ట్..."

"ఆఁ ... ఇలా ఇవ్వండి..."

పేరుకిమాత్రం ఆ చార్టుని పరీక్షచేస్తూ, "రెగ్యులర్ 'యు' " అన్నాడు ప్రకాశం.

"అవును, చాలా అన్‌స్టెడీ", అన్నది రేఖ.

"ఆ మందు, తెలివొచ్చినప్పుడు ఇవ్వండి–ఈవినింగ్ మారుస్తాను."

రేఖ మాటలాడలేదు. అలాగే కూర్చున్నది. కొద్ది నిమిషాలు పైన వర్షపుచప్పుడు తప్పిస్తే మరేమీ లేకుండానే గడిచిపోయాయ్.

"మీ...రెలెటివ్ ఉన్నారా?"

సాధ్యమైనంత సామాన్యంగా ధ్వనించేలా అడిగాడు ప్రకాశం... ఆ ప్రశాంత వాతావరణంలో, కొండలమధ్య, మూడు వేల అడుగుల ఎత్తున, ఉన్న ఆ హాస్పిటలు... ఏజన్సీ హాస్పిటలు ఊరు ఉన్న కొంచెమూ అరమైలు దూరంగా ఉన్నది. అందులో ఉన్న నాలుగు ప్రాణాలలోనూ ఒకటి తెలివితప్పి ఉన్నది; ఒకటి నిద్రపోతున్నది. రెండు జీవాలు - నిండు యౌవనంతో మిసమిసలాడుతూ, తమ ఉద్యోగధర్మాలని నిర్వర్తించుకోడానికి ప్రయత్నిస్తూ, చేసేపని ఏమీలేక, మాట్లాడుకోసాగాయ్.

"ఉన్నారండీ -"

"మీ ...?"

"ఫ్రెండే లెండి... రెలెటివ్ కాదు."

మళ్లా కొద్ది నిమిషాల నిశ్శబ్దం - బరువుగా.

"అతను ... ఎలా ఉన్నాడంటారా?"

"ఎవరు?" పరధ్యాన్నంగా అన్నది రేఖ.

"శేఖర్ ..."

అనుమానం తొణుకుతోన్న కళ్ళతో చూస్తూ, "నాకేం తెలుసు డాక్టర్?—మీకు తెలియాలి", అన్నది రేఖ.

"మీకు – చాలా దగ్గర స్నేహితుడేమో ననుకు నేంత అభిమానంగా సేవ చేస్తున్నారు ......"

రేఖ ఒక్కసారి తన రెండుకళ్ళనీ డాక్టర్ వైపుతిప్పి, "మీరనేది – " అన్నది వేడిగా.

"నోనో... అదికాదు – అందుకని మీతో నిజం చెప్పడానికి కొంచెం సంశయంగానే ఉంది", అన్నాడు ప్రకాశం.

నర్స తన ముఖలక్షణాలని ప్రశాంతం చేసుకోడానికి ప్రయత్నిస్తూ "మీ యిష్టం", అన్నది.

"అతను – చాలా క్రిటికల్ గా ఉన్నాడు", అన్నాడు డాక్టర్.

ఆ క్షణంలో అతను రేఖ ముఖలక్షణాలని కనిపెట్ట లేదు...ప్రక్కకి తిరిగి ఉన్నాడు.

"బహుశా రేపు ఉదయానికి..."

"అంత ప్రమాదమా డాక్టర్?"

"అనుకుంటాను...పల్స వీకేవ్ అవుతోంది. పీక్స క్రమంగా నార్మల్ కి దూరం అవుతున్నాయ్..." చార్ట్ లోని కర్వ్ పీక్సనించి ఏక్సిస్ కి చేత్తో గీతలుగీస్తూ అన్నాడు డాక్టర్.

రేఖ ఏమీ మాట్లాడలేదు. ప్రకాశమూ ఏమీ మాటలాడలేదు. వర్షం తగ్గాక ఇద్దరూ ఇళ్ళకి వెళ్ళి పోయారు.

♦ ♦ ♦ ♦

డాక్టర్ ప్రకాశ్ అక్కడ రెండేళ్ళనించి పనిచేస్తున్నాడు...ఏజన్సీ హాస్పిటల్ లో, పూర్వం అతను మామూలు డాక్టర్లలాగే ఒక పట్టణంలో ప్రాక్టీసుచేస్తూ ఉండేవాడు. చాలావరకూ అతని ప్రాక్టీసూ బాగానే ఉండేది.

తరువాత అతను వివాహం చేసుకున్నాడు. లత అతని జీవితంలో అడుగు పెట్టడంతో అతని కష్టాలు ప్రారంభం అయాయి.

ఆమెకి సుఖం కావాలి; తన విధినిర్వహణ ఎట్లా పోయినా. విషయవాంఛలు విపరీతంగా ఉన్నవాళ్ళని వివాహంలో స్వీకరించాల్సింది డాక్టర్లుకాదు...ఆ పాఠం ప్రకాశం కొంచెం ఆలస్యంగా నేర్చుకున్నాడు.

లత తన కాలమంతా థియేటర్లలోనూ ప్రయాణాల లోనూ గడిపేది. ప్రకాశం మొదట బాధపడ్డాడు_తరవాత పరిస్థితులకి అలవాటు పడగలిగాడు. లోకం నవ్వసాగింది. 'పోనీ' అనుకున్నాడు. తాను ఆమె విషయంలో ఏ విధినీ నిర్వహించలేకపోతున్నాడని అతనికి తెలుసును. ఆ జ్ఞానమే అతన్ని పట్టిఉంచి, లతకి పూర్తి స్వాతంత్ర్యం ఇచ్చింది.

ఒక్క సంవత్సరంలో ప్రకాశం పూర్తిగా మారి పోయాడు—లోకం నవ్వులని వింటూ బాధపడకుండా ఉండడం నేర్చుకున్నాడు. లతని ఒక స్నేహితురాలిగా మాత్రం చూడడం నేర్చుకున్నాడు—ఇంకా, జీవితాన్ని హాడిగా గడపడానికి కావాల్సిన పాఠాలని నేర్చుకున్నాడు.

అలాగే గడిచే ఒకరోజున, తాను ఇంటికొచ్చేడు. ఎందుకో అనుకున్నాడు—ఇంటిలో అందరూ గుమిగూడారు. వందలు.. లత చచ్చిపోయింది. హార్టు ఫెయిల్యూర్ అను కున్నాడు తాను...కాని పోస్టుమార్టమ్ 'ఆత్మహత్య' అన్నది.

తల గిర్రున తిరిగింది,..లత ఎందుకు ఆత్మహత్య చేసుకోవాలి ?

కనుచూపు మేరలో ఏ కారణమూ కనిపించలేదు. బహుశా, ఆమె తన ప్రవర్తనకి పశ్చాత్తాపపడి ఉంటుందా? ...అయినా, ఆ పశ్చాత్తాపం నిరూపించే పద్ధతి ఇదా ?

అతని కేమీ బోధపడలేదు. కొద్దిరోజులుపోయాక ఆమె డైరీ అతని కళ్ళపడ్డది. తీసి చూశాడు, కొన్ని ఎంట్రీలు......

మార్చి 6 : తిరిగి, ఆ థియేటరులో ఆ యువకుడు— అవును. శేఖరమే. రెండు గంటలసేపూ నావంక చూస్తూనే ఉన్నాడు...ఏం చేసేదీ ? వచ్చేద్దా మనుకున్నాను. కాని, వెనకాల వస్తాడని భయంవేసింది.

ఏప్రిల్ 1: అతనితో మాటలాడాలని అనుకోలేదు_కాని, బీచ్‌లో కనిపించి పలకరించాడు. పాతరోజులన్నిటినీ జ్ఞప్తికి తెచ్చాడు. అతని నైఖరిచూస్తే భయం వేసింది. ఉత్తరాల ప్రశక్తి తెచ్చాడు...ఇచ్చిమని అడిగాను. నవ్వి ఊరుకున్నాడు...భగవాన్...ఏమి టతని ఉద్దేశం?

ఏప్రిల్ 15: ఎవరో ఒకర్ని మోసమైనా చెయ్యాలి; నన్ను నేనైనా మోసం చేసుకోవాలి. నన్ను నమ్ముకున్న ఆయనని మోసం చెయ్యలేను—నా ప్రాణం చేతిలోఉన్న శేఖర్‌నీ మోసం చెయ్యలేను_మూడో మార్గమే ఉత్తమంలా ఉంది.

ఏప్రిల్ 18: ఈ సాయంత్రం ఆటకట్టేటట్లు కనిపిస్తుంది. జీవించినది చాలు. అతను నన్ను పూర్తిగా చంపాడు.

ఆ రోజునే లత విషం మింగింది.

శేఖర్!... శేఖర్—ఎవరది?

ఆమె కాగితాలన్నీ వెదికాడు ప్రకాశం. ఏమీ ఆచోకీ దొరకలా. ఆమె చిన్ననాటి స్నేహితుడల్లే ఉన్నాడు. అంతకన్న అప్పటికేమీ ఆచోకీ దొరకలేదు—ఒక్క విషయం మాత్రం ప్రకాశం పూర్తి అవగతం చేసుకున్నాడు...లతని చంపిన దుర్మార్గుడు—అతనని.

తరవాత అక్కడ లేకపోయాడు ప్రకాశం. ఒకసారి ఈ ఉద్యోగానికి అప్లికేషన్లు అడిగారు. తాను అప్లైచేశాడు.

ఈ రెండేళ్ల నించీ ఇక్కడే ఉండిపోయాడు. కొండలమధ్య, అడవులమధ్య, ప్రశాంతమైన జీవితం. తనని చూసి నవ్వు తోన్న ఆ లోకానికి ఎన్నో వందలమైళ్లు దూరంగా, నాగరి కతకి ఎన్నో వందలమైళ్ళ దూరంగా, చీకులేని బ్రతుకు.

అలా బ్రతుకుతోన్న తన జీవితంలోకి మళ్ళా ఈ శేఖర్ వొచ్చాడు. అతను ఆ వూళ్ళో కొద్దిరోజులు ప్రశాం తంగా గడపడాని కొచ్చాడు. మనశ్శాంతికోసం ఒచ్చా నన్నాడు. త్వరలో ప్రకాశం, శేఖర్ స్నేహితులయారు. త్వరలో అత నెవరో తెల్సింది డాక్టర్ కి.

చిత్రమైన సంఘటన—అనుకున్నాడు ప్రకాశం.

వాన తగ్గింది. చిన్న చినుకులు మాత్రం పడు తున్నాయ్. తడిగాలి బలంగా వీస్తూన్నది.

ప్రకాశం బుర్రలో వెయ్యి ఆలోచనలు బలంగా పని చేస్తున్నవి. తనని సర్వనాశనం చేసిన శేఖర్......

"అంత ప్రమాదమా డాక్టర్ !"

రేఖ! నవ్వుకున్నాడు...ఆమె అతనికోసం ఎంత తహతహలాడుతూందో తనకి తెలీదనుకున్నది! ...నర్స్! ఆ సౌందర్యం అంతా శేఖర్ కోసం!...తనని నాశనంచేసిన శేఖర్ కోసం!

"లతా! ఎందు కంత తొందరపడ్డావు!" అను కున్నాడు ప్రకాశం, పశ్చాత్తాపంతో..."నేను నిన్ను

తేమించి ఉండును. రాక్షసత్వం నిన్ను చంపకుండా అడ్డుకుని ఉండును. ఈ రోజు నీ చేత్తో ఈ ఘూత్యాన్ని..." అను కున్నాడు...

"భోజనం బాబూ !"

కుక్ వెళ్ళిపోతాడు. "కాఫీ" అంటూ కిచెన్ వైపు నడిచాడు ప్రకాశం. "అయినా ఏం? నర్సే చేస్తుంది ఆ పని...ఏ బంగారు చేతులైతేనేం? ప్రాణం తీయడానికి! లతకి బదులు రేఖ..." అనుకున్నాడు.

♦ ♦ ♦ ♦

రేఖ రెయిన్‌కోట్ తీసి పిడిచి లోపలికొస్తూ, "హల్లో రామూ ! ఏం చేస్తున్నావ్ ?" అన్నది గట్టిగా.

"ఏముంది ! మరో నవల చదువుకుంటున్నాను ... నువ్వుమాత్రం నీపని యథావిధిగా సాగిస్తున్నావు. నేను బోర్ అయి చస్తున్నాను", అన్నాడు రామారావు గుక్క తిప్పకుండా.

రేఖ లేతగా నవ్వి, "న్యాటీ..." అంది.

"అందులో, పేషెంట్ కూడా ఫ్రెండ్..."

తృళ్ళిపడ్డది రేఖ..."ఈ సంగతి ఎవరు చెప్పారు?" అన్నది.

"తెలిసిందిలే..."

రామూ నవ్వి ఊరుకున్నాడు. "వంట అయిందా అమ్మా?" అంటూ రేఖ లోపలికి వెళ్లిపోయింది తన భావోద్రేకాన్ని కప్పిపుచ్చుకునేందుకు.

భోజనాలవగానే రాము నిద్రపోయాడు. రేఖ ఆలోచనలో పడింది. ఈ సంగతి రాముకికూడా తెల్సిపోయింది!

"నా జీవితంలో ఎందు కడుగు పెట్టావు శేఖర్!" అనుకుంది విచారంగా రేఖ ... అనవసరంగా తాను అతనికి దొరికిపోయింది. తన జీవితాన్ని అతనికి వశం చేసింది.

"చాలా క్రిటికల్‌గా ... '...' బహుశా రేపు ఉదయానికి..."

గుండె తొందరగా కొట్టుకుంది ... డాక్టర్ ఎందుకలా అన్నాడు? శేఖర్‌కి తగిలినదెబ్బ పెద్దది కాదు. కొంత రక్తం పోయింది. అంతే! తెలివి లేకపోయినా, అతని స్థితిలో క్రిటికల్ ఏముంది?

"ఉంటే బాగుండును" అనుకుంది రేఖ ... తాను రాముకోసం ఇన్నాళ్లు వేచి ఉన్నది. అతనూ తానంటే చాలా అభిమానంగా ఉన్నాడు. త్వరలో తాను పెళ్ళి చేసుకొని ఈ ఉద్యోగం వదిలేసి హాయిగా బ్రతుకవచ్చును. అందరూ అంగీకరించిన ఈ పెళ్ళి శేఖర్ మూలంగా తప్పిపోతుంది. అతను బ్రతికిఉంటే—

"నిన్ను నా దాన్ని చేసుకునితీరతాను రేఖ!"

పిచ్చిగా అనేవాడు శేఖర్ ... తాను ఊహుకునేది. అవి, రాము మనస్సు తెలియని రోజులు. ఆశమాత్రం ఉండి. నిశ్చయం లేని రోజులు. ఆ మైకంలో పడి తనని తాను కూలద్రోసుకున్నదా?

"ఏముంది నర్స్! డాక్టర్లు పొరపాటు చెయ్యాలంటే ఎంత సులువు! చూడండి ఆ ఎర్రసీసాలో-ప్యూర్ పాయిజన్, కొంచెం వీక్ స్టేట్‌లో ఓర్గెయిన్ కలిపితే, సెటిల్డ్!"

ఎప్పుడో చెప్పాడు డాక్టర్. ఒక్కసారి జ్ఞప్తికి వచ్చింది. ఓ నాడు "ఆ సీసాతీసి చూసింది ... "పర్మాంగనేట్‌లా ఉంది డాక్టర్!"

"అలానే ఉంటుంది."

రేఖ ముఖంలోకి ఒక్కసారి దార్ఢ్యం, పట్టుదలా వొచ్చాయి. "సారీ శేఖర్—నువ్వు మళ్ళా లేవవు. మన ప్రణయం నీతో చచ్చిపోతుంది," అనుకున్నది. ఏం చెయ్యాలో తనకి బాగా తెలుసు.

♦ ♦ ♦ ♦

నాలుగు గంటలకే చీకటి పడింది—మబ్బులు బాగా కమ్ముకొనడాన్న.

శేఖర్ నెమ్మదిగా మంచంమీద ఒత్తిగిల్లి, "రేఖా!" అని పిలిచాడు.

డాక్టర్ రూమ్‌లో ఉన్న శేఖ ఒక్కసారిగా లేచి, డాక్టర్ వేపుచూసి ఆగిపోయింది. "పదండి," అన్నాడు డాక్టర్.

"హల్లో! ఎలా ఉంది!" అన్నాడు ప్రకాశం.

"నీరసం— అంతే...చాలాసేపు నిద్ర పోయానుగా!" అన్నాడు నీరసంగా శేఖరం.

"కాఫీ..."

"తెస్తాను."

శేఖ వెళ్ళి అప్పన్నని ఇంటికి పంపింది.

"చాలా గట్టిగా తగిలింది దెబ్బ—సైకిల్ రాతిమీదికి పడిపోయింది. మరేం ప్రమాదం లేదుకదూ!" అన్నాడు శేఖర్.

"అంటే మీ రెలా అడుగుతారు?"

శేఖర్ చిన్నగా నవ్వాడు, "ఊఁ... మీరు చాలా శ్రమ తీసుకున్నారు. ముఖ్యంగా నర్స్— మహాఁ చల్లని చేతులు!"

ప్రకాశం ముఖం నల్లబడింది. శేఖగుండె జల్లుమన్నది.

కాఫీ ఇస్తూ, "సాయంత్రానికి కోడోస్ ఇస్తాను. ఉదయానికి బెస్టుగా ఉంటారు. రెండు మోతాదులు రాత్రి తీసుకోండి" అని, ప్రిస్క్రిప్షన్ రాసి ఇచ్చాడు శేఖకి... అక్కడ కంపౌండింగ్ ఆమె తరచుగా చేస్తూంటుంది.

"మందు కలిపి తీసుకురండి."

నర్స్ వెళ్లి అలా చేసింది. ప్రక్క టేబిల్ మీద సీసా ఉంచుతూ, "ఇంకో పావుగంటలో ఒకటో డోస్, పది గంట లకి రెండు. తెల్లవారుఝామున మూడోది," అన్నాడు ప్రకాశం.

కొద్దిసేపయ్యాక ప్రకాశం చెప్పినట్లు రేఖ మందు గ్లాసులో పోసి ఒక డోస్ ఇచ్చింది. ఆమె చేతులు వణకు తున్నా సాధ్యమైనంత దృఢంగానే ఇచ్చింది. క్రీగంట ప్రకాశం అదంతా కనిపెడుతున్నాడు.

"వొస్తాను...రాత్రి మరిచి పోకండి."

ప్రకాశం తొందరగా ఇంటివైపు నడిచాడు. కొద్ది నిమిషాలయ్యాక, రేఖా ఇంటికి వెళ్లింది,

♦ ♦ ♦ ♦

పదకొండు కొట్టింది గడియారం.

నిద్రిస్తోన్న ప్రకాశం హఠాత్తుగా లేచాడు...చుట్టూ చీకటిగా ఉంది.

టార్చిలైటుతీసి వెలిగించాడు ... కల! తను తనగది లోనే ఉన్నాడు! జెయిలూ కాదు; ఏమీ కాదు.

ఒళ్ళంతా చెమట పోసింది. ఒణుకుతున్నాడు.

"హత్య !"

ఔను, తాను హత్య చేశాడు. శేఖర్‌ని హత్య చేశాడు... శేఖ తన ప్రిస్క్రిప్షన్ ప్రకారం మందు కలిపింది. పాయిజన్...విషం ఇచ్చి చంపాడు పేషంట్‌ని... మిత్రుణ్ణి!

మిత్రుడు!—పల్లు కొరికాడు వాడు...తన జీవితాన్ని అడవులపాలు చేశాడు. తన లతని చంపాడు!...తాను పగ తీర్చుకున్నాడు—అంతే.

ఇదా పగతీర్చుకోడం? తన చేతిలో తన ప్రాణాన్నుంచినవాడిని, విషం ఇచ్చి చంపడం_ఎవరు సంతోషించే పగ?

తన చేతులు...

ఆ చేతులతోనే మధ్యాహ్నం ఎర్రసీసా, నీలిసీసాల లోని పౌడర్లు తారుమారు చేశాడు_ఆ చేతులతోనే ప్రిస్క్రిప్షన్ రాశాడు. ఆ చేతులతోనే శేఖర్‌ని చంపాడు!

ఎంత ఘోరం చేశాడు! ...జుత్తు పీక్కున్నాడు. కళ్లు కనిపించకుండా చేసుకుని హత్యచేశాడు!... కాని, అంతా జరిగిపోయింది! ఈ సరికి శేఖర్ గుండ్లు తేలవేసి ఉంటాడు...

తాను హంతకుడు—

ఆరాత్రి నిద్ర పోలేకపోయాడు ప్రకాశం. అడుగడుగునా భూతాలూ ప్రేతాలూ కలలోకి వస్తున్నై...నిమిష నిమిషానికి జెయిళ్లు తనచుట్టూ తయారౌతున్నాయ్...తాను హంతకుడు......

♦ ♦ ♦ ♦

తెల్లవారింది. సూర్యుడు ఉదయించాడు—నిన్నట్లా తలదాచుకోకుండా.

ప్రకాశం కిటికీలోనించి చూశాడు... తెల్లవారింది... అప్పన్న రాలేదేం?— బహుశా వాడికింకా తెలివి వొచ్చి ఉండదు.

తొందరగా బట్టలువేసుకుని హాస్పిటల్‌కి నడిచాడు ప్రకాశం ... తొందరగా వెళ్ళి సీసాలలోని పౌడర్లు యథాస్థానాలలో పెట్టకపోతే ప్రమాదం.

గేటు తీసుకుని, చప్పుడు కాకుండా డిస్పెన్సరీలోకి వచ్చి, త్వరగా తన పని ముగించుకుని, తనగదిలోకి వచ్చి కూర్చున్నాడు. కలలో బ్రతుకుతోన్నట్లుం దతని పరిస్థితి.

"డాక్టర్ !"

నీరసంగా వినిపించింది ... అవును. శేఖర్ గొంతు. అరే, శేఖర్ ఇంకా...

"గుడ్‌మార్నింగ్ డాక్టర్ !"

"మార్నింగ్... శేఖర్ !"

"అరే! అలా చూస్తారేం!...నాకు చాలా కులాసాగా ఉంది డాక్టర్! ... ఈ పూట—అరే, రేఖా ! అలా తెల్లబోతావేం ?"

రేఖ నీరసంగా కుర్చీలో కూర్చున్నది. డాక్టర్ ఆమె కళ్ళల్లోకి చూశాడు. ముఖం అంతా అలా పాలిపోయిందేం ? ... తన రహస్యం...

"చాలా బాగా ట్రీట్ చేశారు డాక్టర్!...థాంక్స్ నర్స్...నేను వెళ్లి ప్రయాణానికి సిద్ధపడతాను. అవును. ఈ రోజే వెళ్లిపోవాలి. నాకోసం అందరూ ఎదురుచూస్తుంటారు...ఒక్కమాట మీతో చెప్పాలి నర్స్...సెలవు డాక్టర్! మీ ఉపకారం మరువను...

శేఖర్ నెమ్మదిగా బయటికి నడిచాడు...నర్స్ అతని వెనకాలే వెళ్లింది..."క్షమించు నర్స్!...నీ త్యాగం ఇలాగే ప్రాణాలని కాపాడుతూ ఉండాలి. వంటఇల్లూ, పడకగదీ నీవికావు...నా ఉద్దేశాలు మార్చుకుంటున్నాను ... సెలవు సిస్టర్!" బాధగా, ఆమెకళ్లల్లోకి చూస్తూ అన్నాడు. ఆమె తెల్లబోయింది.

అతను త్వరగా నడిచి, సాగిపోయాడు. రేఖ ముఖం తిరిగినట్లు ఫీలై, చెట్టుకి జేరపడింది ... తాను చేసిన 'త్యాగం'! ... సిస్టర్!

"అలా ఉన్నారేం?..." ప్రకాశం...సానునయంగా అన్నాడు.

"కొంచెం_చీకాకుగా ఉందిలెండి...అంతే..."

"అవసరమైతే..."

"ఆ...ఇంటికి వెళ్తాను..."

"శేఖర్ ... రికవరీ చాలా చిత్రంగా ఉందికదూ?"

"చాలా చిత్రంగానే ఉంది...మీను..."

"ఆఁ ... అలానే అనుకున్నాను. కాని, మనం Explain చెయ్యలేని విచిత్రాలు జరుగుతూనే ఉంటై!"

"నిజం డాక్టర్ ! విచిత్రాలు జరుగుతూనే ఉంటై !"

ఆమె వెళ్లిపోయింది. ప్యూర్ పాయిజన్ ఎలా ఫెయిలైందని ఆలోచిస్తూ; డాక్టర్ కుర్చీలో కూలబడ్డాడు—ప్యూర్ పాయిజన్ ఎలా ఫెయిలైందని ఆశ్చర్యపడుతూ.

— ఆంధ్రపత్రిక, 19-8-53

# బొమ్మలు

గదిలో కూర్చుని రేడియో వింటూంటే శ్రీపతి వచ్చాడు..."ఏం బాబాయ్ అంత శ్రద్ధగా వింటున్నారీవేళ ?" అంటూ.

"ఏముంది ? పాట బాగుందని. కూర్చో", అన్నాను.

వాడింకా చిన్నవాడు—ఈ పాటలు వయసు ముదిరిన మా మనస్సులని పెట్టేబాధలు వాడి కేమిటి తెలుస్తాయి? ఒక్కసారి చంద్రలోకానికి ప్రయాణం చెయ్యవచ్చు; కామెట్స్‌ని వెంట తరమొచ్చు; ఈ మహాశాస్త్రవిజ్ఞానంతో ఏమైనా చెయ్యొచ్చు...కాని, ఒక్క గంటైనా కాలంలో వెనక్కి ప్రయాణించలేము. భౌతికంగా, ఇలాంటిపాటలూ, ఇతర జ్ఞాపక చిహ్నాలూ మాత్రం మిగిలి, ఒకొక్కసారి

మనస్సుని కొన్ని సంవత్సరాలు వెనక్కి తీసుకుని వెళ్తాయి. కొద్దిక్షణాలు ఈ విశాలమైన ప్రపంచాన్నీ, దానిలో తన నిస్సహాయతనీ గుర్తించుకుని మనస్సు ఏడుస్తుంది...గతించినది గతించిపోయిందని తెలుసుకుని దీనంగా విలపిస్తుంది. అందుకే మాధుర్యం ఒలికించే సుఖపూరితస్మృతులకన్న దుఃఖస్మృతులే ఎక్కువ ఉపకారులు. ఆ క్షణంలో అవి ఏడిపించినా, కొంచెం దూరమయ్యాక, వాటికి దూరంగా అవుతూండడం సంతోషం కలిగిస్తుంది. మధురక్షణాలు దూరం అయిన కొద్దీ ఏడిపిస్తాయ్. దీపావళిలాగ అవి సంవత్సరానికో దశాబ్దానికో ఓసారయినా రావు...వాడింకా కుర్రవాడు. ఏం తెల్సునివన్నీ ?

వాడు మాట్లాడకుండా కుర్చీలో కూర్చుని పాటలు వింటున్నాడు. నేను నా ఆలోచనలలో సాగుతూంటే సంగీతం ఆగిపోయింది...రేడియో గొంతునొక్కి, "ఏం ఇట్లా వచ్చావ్?" అని అడిగాను.

"చిన్న విషయంలో నీ సలహా అవసరం వచ్చింది బాబాయ్."

పాపం! ఎంత గౌరవం ఇస్తాడు నాకు! ఎవరి దృక్పథాన్నిబట్టి వారు గత చరిత్రతో సంబంధం లేకుండా మనుష్యులు ఒకణ్ని గౌరవిస్తారు. వీడూ నన్నంతే.

"చెప్పు," అన్నాను.

"నేను పెళ్లి చేసుకోవాలట బాబాయ్!"

వాడు చెప్పడానికి భయపడలేదు—సిగ్గు పడ్డాడు. పెళ్ళంటే ఉద్యానవనాలలో నడవడం అనీ, మేఘాలలో తేలిపోవడం అనీ వీళ్ళ ఉద్దేశం...ప్రతీయువకుడూ అట్లానే అనుకుంటాడు. కాని ఒక్కసారి తెర తొలగించి వాస్తవి కతకి కళ్లు తెరిచాక అందులో నిజాలు తెల్సుకుని...

"అట్లాగా? మరేం!" అన్నాను.

వాడు నవ్వాడు..."అది కాదు, మీ సలహా కావాలి," అన్నాడు.

"పెళ్ళి నీ ఇష్టమోయ్. అయినా, నువ్వు పెళ్ళి చేసుకుని సుఖపడాలనే నా ఉద్దేశమూను."

"అది సరేలెండి. నాన్నగారేమో రెండు ఫోటోలు మాత్రం ఇచ్చి నన్నేదో ఒకదాన్ని ఎంచుకోమన్నారు."

"ఉత్తమం. వ్యక్తిగతంగా వెళ్ళి పిల్లని పరీక్షించడం అంటే మహా ఘోరం అనుకో. ఆయన మాటప్రకారం ఏదో ఒకటి నిర్ణయించు."

బహుశా నన్నడగని సలహా ఇచ్చాను.

"అదంతా సరే బాబాయ్. కాని, ఆ రెండు ఫోటోల్లోనూ నేను ఏ ఒకటీ ఎంచుకోలేకుండా ఉన్నాను."

నవ్వుకున్నాను. వాడి తరువాతమాటలు నాకు తెల్సుగా! అందులో ఏది బాగుందని అడుగుతాడు. సౌందర్యం ఎవరికళ్ళకి వారి కోలాగ ఉంటుంది. వీడు పాపం నాకళ్ళు నమ్ముతాడు!

వాడు జేబులోంచి రెండు ఫోటోలు తీసి అప్పుడే నా టేబిల్ మీద పడేశాడు. ఈ పని నాకేమీ ఇష్టంలేదు. కాని వాడిని బాధించడం నాకు మరీ ఇష్టంలేదు.

"రెండూ బాగున్నై," అన్నాను.

"అందుకే కష్టం అంతా"—వాడు తేలిపోయాడు.

నిజంగా ఇద్దరు అమ్మాయిలూ చక్కగానే ఉన్నారు. అయితే ఒక అమ్మాయికళ్ళల్లో తాను సౌందర్యవతిననే భావం ప్రస్ఫుటంగా కనిపిస్తూన్నది. భార్య రూపవతి అయినంతమాత్రాన ప్రమాదంలేదు. కాని ఆ సంగతి ఆమెకి తెలిస్తేనే ప్రమాదమంతా.

"నీ ఉద్దేశం చెప్పు," అన్నాను.

"మీ మీద నేను పూచీ పెట్టాను", అన్నాడు శ్రీపతి.

"చాలా కష్టమైనపూచీ ... నేనూ సౌందర్యాలపై తీర్పు చెప్పే వయస్సు దాటిపోయాను...", అన్నాను.

"అందుకే బాబాయ్ మిమ్మల్నడగటం ... సముద్రంలో మునిగిపోతున్నవాడికి దాని సౌందర్యం ఏం తెలుస్తుంది?"

వాడట్లానే మాట్లాడతాడు. అందుకే నాకెంతో అభిమానం వాడంటే...పూచీ పూర్తిగా మీదనిపడింది.

నా పరిశీలన తప్పేమోనని మళ్లీ పరీక్షించి ఆ ఫోటోలలో ఒకదాన్ని వాడిముందుకు త్రోశాను. వాడు చిరునవ్వు నవ్వాడు.

మరికొద్దిరోజులకి వాడి పెళ్ళి అయిపోయింది. వాడి భార్యని పరిచయం చేశాడు — పార్వతి. ఆమెని చూశాక అనుకున్నాను ... ... తప్పక వీడు సుఖిస్తాడని.

ఇదంతా మూడేళ్ళ క్రిందట.

*           *           *

తరవాత ఎన్నో సంఘటనలు జరిగాయ్. నాకు ఊరినించి, వాడి పెళ్ళి అయిన మరోనెలకే, బదిలీ అయింది. వాడు ఉద్యోగంకోసం ఉత్తరదేశానికి వెళ్ళిపోయాడు. తరచు ఉత్తరాలుమాత్రం వ్రాశేవాడు.

ఎందుకో ఒక్కసారి జీవితంమీద నాకు విరక్తి కలిగింది. బహుశా రోజూ పదిగంటలు పనిచేయించే ఆఫీస్ పని మెదడుని పాడుచేసి ఉంటుంది. మూడునెలలు సెలవు పెట్టి చింతపల్లి బయలుదేరాను. ఆ ఏజన్సీ ఊరులో, ఏకాంతంగా ప్రశాంతంగా గడుపుదామని.

అక్కడ చిన్న గది దొరికింది. అందులో ఉండేవాడిని. ఆ ప్రక్కన ఇంకో ఇద్దరు ఉంటూండేవారు. ఒక యువకుడూ, యువతి. నేను వెళ్ళిన కొద్దిరోజులకామె నొకసారి చూశాను_ఎందుకో మనస్సు గుర్తుకోసం బాధపడసాగింది... ఎక్కడో ఆమెని చూశా నింతకుముందు...

పగలంతా అడవిలో తిరిగి, సాయంత్రం భోజనంచేసి గదికి వచ్చేవాడిని. కనుచూపుమేరలో మానవులు లేని చోట్లలో గడిపేవాడిని. రాత్రి ఏదో నవల చదివి చదివి

పడుకునేవాడిని. మధ్యమధ్య నిద్రిస్తోన్న నా మనస్సు లేచి కూర్చుని అడిగేది ... "ఆమె నెక్కడ చూశావ్ ?" అని. జవాబుకోసం తహతహలాడేవాడిని. Sub-Consciousness లోకి జారిన ఆ జవాబు వచ్చేదికాదు.

ఆ సాయంత్రం వర్షం పడసాగింది. వేసవిలో వర్షాలు చింతపల్లికి క్రొత్త ఏమీకాదు. మూడువేల అడుగుల ఎత్తున ఉన్న అక్కడ శీతోష్ణస్థితే అది.

తగ్గాక భోజనానికి వెళ్దామని అనుకున్నాను. ఎనిమిదయేదాకా అలా కురుస్తూనేవుంది. వాటర్‌కోటు తెచ్చుకోలేదు. గొడుగులో వెడితే తడుస్తాను. నిప్పు వెలిగించి పని మనిషి ఎప్పుడో జారుకున్నాడు.

ఆలోచిస్తూండగా అతను తలుపుతట్టుతూ పిలిచాడు... "మాష్టారూ!" అంటూ.

లోనికి రాగానే, "ఈ పూట హోటల్‌కి వెళ్ళకండి. మా ఇంట్లో భోజనం చేద్దురుగాని, రండి" అన్నాడు.... పాత మిత్రుడల్లే మాట్లాడాడు.

కేవలం మర్యాదకోసం వద్దన్నాను. చివరికి వెళ్ళక తప్పలేదు. ఆమె వడ్డిస్తోంది. వాళ్ళిద్దరూ అన్నా, చెల్లెళ్లని తెలిసింది. వారి వివరాలన్నీ అడిగాను. నాకు సంబంధం లేని ఊరు వాళ్ళది.

కాని, ఆమె ముఖం చూసినకొద్దీ ఎక్కడో చూచాననే విషయం ఇంకా స్ఫుటంగా జ్ఞప్తికి వస్తోంది...కాని ఎక్కడ?

అయితే, ఆమెకళ్ళు దుఃఖంతో బరువెక్కాయనీ, ఆమె ముఖాన్న బొట్టులేదనీ గ్రహించాక నా ఆలోచనలు సాగలేదు.

◆ ◆ ◆ ◆

రామారావూ నేనూ స్నేహితులం అవడానికి చాలా కాలం పట్టలేదు. అతను వయస్సుకి నాకంటె చాలా చిన్న వాడు; కాని మంచి భావాలున్న మనిషి. అక్కడ ఏదో ఆఫీసులో పనిచేస్తున్నాడు.

అతని సంభాషణనిబట్టి ఒక్క సంగతిమాత్రం తెలుసు కున్నాను; ఆమె భర్త ఈమధ్యనే పోయాడని.

అనుదినమూ నేనూ అతనూ షికారు పోయేవాళ్ళం. ఆ రోజు ఆమెనీ రమ్మన్నాడు. మొదట రానన్నది. తరవాత బయలుదేరింది.

ముగ్గురమూ కొంతదూరం నడిచి ఓచోట కూర్చున్నాము. ఆమె దూరంగా కనిపిస్తూన్న కొండలవైపు తదేకంగా చూస్తూన్నది. రామారావు నెమ్మదిగా సంభాషణలోకి దిగకుండా తలవంచుకుని గీతలు గీస్తున్నాడు. ఆ మహాప్రశాంత ప్రకృతి సౌందర్యంలో, మెదడెన్నో పరుగులు వేస్తున్నది. ఆమె కంత దుఃఖం ఎందుకు వచ్చిందీ అని ఆలోచిస్తున్నాను నేను.

ఉన్నతమైనచోటునించి కనపడాల్సినట్లు కనిపిసు న్నాయి దూరంగా కొండలు. స్వేచ్ఛగా ఎగురుతూ సంతోషంగా అరుస్తున్నయ్ పక్షులు.

"ఏమిటి శ్యామలా ఆలోచిస్తున్నావ్?" అన్నాడు రామారావు. శ్యామల మాటలాడలేదు. ఒకసారి ఆమె కళ్లెర్రబడ్డాయేమో ననుకున్నాను.

మరి కొద్దినిమిషాలు నిశ్శబ్దంగా గడిచాయి. ఎందుకో, కాలంలో ప్రయాణంచేస్తూన్నట్టు అనిపిస్తూంది. ఎవరిమట్టుకు వాళ్ళం ఆలోచనలో పడ్డాము.

"చాలా ప్రశాంతంగా ఉందికదూ?"

రామారావు మొదలుపెట్టాడు. "ఔను చాలా," అన్నాను.

"ఈ ప్రకృతినంతటినీ మనం మాత్రం అనుభవిస్తున్నాం... పెద్దపెద్ద పట్టణాలలో దుమ్ములో ధూళిలో నలిగి మనుష్యులు..."

"మనంచేసిన పుణ్యం", అన్నాను.

శ్యామల తలదించకుండా దూరాన శిఖరాలనీ, మేఘాలనీ పరికిస్తూన్నది. ఆమెని మాటలాడించాలని ప్రయత్నిస్తూ రామారావు "ఏమమ్మా...ఏమిటాలోచిస్తు న్నావు అంత తీక్ష్ణంగా?" అన్నాడు.

"ఏంలేదన్నయ్యా ... నామాటే నేనాలోచించు కుంటున్నాను. పార్వతి ఏం చేస్తూంటుందా ... అని", అన్నదామె.

"నీకా ఆలోచన తప్పిస్తే ఇంకేవీ రావా?"

"ఎలా అన్నయ్యా ..." గాద్గదికంగా శ్యామల ఆగి తలవంచుకుంది. నేను మాట్లాడలేదు. ఈ వ్యవహారం రోజు రోజుకీ లోతులకి వెళ్తూన్నది.

"ఆమె ఇట్లా అనడానికి కారణం ... ఒకమనిషి అని చెప్తే మీరు నమ్మతారా?" రామారావు నాతో అన్నాడు.

"కారణమా...ఎలా?"

"అతనికి తెలీదేమోలెండి ... ఈమె క్లాస్‌మేట్ పార్వతి. జరిగినకథ ఏమిటంటే, మానాన్నగారు చనిపోతూ దీని పెళ్ళి కళ్ళచూడాలని పట్టుపట్టారు. దీనికి క్లాస్‌మేట్ పార్వతి అనే అమ్మాయి ఉండేది. వాళ్లో సంబంధంకోసం ప్రయత్నిస్తూండగా, మాకాసంగతి తెలియక, మేమూ ఆ సంబంధంకోసం ప్రయత్నించాం.

"పెళ్లికొడుకు చదువుకున్నవాడట. మమ్మల్ని ఫొటో పంపమన్నారు. మూడ్రోజుకి మాసంబంధం కాక, పార్వతిని అతను ఎన్నుకున్నట్లు తెలిసింది.

"నాన్నగారికి రోజురోజుకీ ముదురుతూంది. ఆయన కోసం తొందరపడి వేరో సంబంధం కుదిర్చాము ... పెళ్ళి అయిపోయింది.

"మరో సంవత్సరం తిరిగేసరికి అతను చనిపోయాడు... ఈమె ఇలా ..."

నదిలో వేగంగా ప్రయాణిస్తూ ఏదో కొండకి తగిలి ఢీకొనడానికి తొందరపడే పడవలా నా మనస్సు గింజుకొంటూంది.

"దీనిలో ఇతరుల ప్రమేయం ఏం ఉందండీ?" అన్నాను.

అతను పొడిగా నవ్వాడు. "అక్కడే Tragedy అంతా ఉంది...ఆ మొదటి పెళ్లికొడుకేంచేశాడో తెలుసా? ఒక స్నేహితుణ్ని ఆ రెండు ఫొటోలలోనూ తన కొరకటి ఎన్నుకమన్నాడు. అతను పార్వతిని ఎన్నేడు ... మానవ మాత్రులంగదా! అతనే స్వయంగా ఎన్నుకుని ఉంటే శ్యామలనే ఎంచుకొనేవాడేమో...ఈ పర్యవసానం రాక పోవునేమోనని అనుకుంటూంటాము..."

నాతల తిరుగుతోంది. ఒక్కసారి శ్యామల కళ్ళలోకి చూశాను. అవి నీళ్ళతోనిండి, ఏవో శాపాలనిస్తూన్నట్లు కనిపించాయి. ఒక్కసారి ముఖం కప్పుకుని ఆమె వెక్కివెక్కి ఏడ్వసాగింది.

నా జ్ఞానం, నా విశ్రాంతి, నా అహంకారం, నా సౌందర్యపరిశీలన ... అన్నీ ప్రచండమారుతంలో ఎగిరి రాళ్ళకి ఢీకొంటున్నాయ్. వెయ్యినోళ్ళతో శ్యామల నన్ను శపిస్తున్నది.

ముఖంనిండా చెమట పోసింది. మూడేళ్ళ క్రిందటా నా చేతిలోని ఫొటోలని కాగితాలుగా చూశాను; అంతే. వాటివెనుక రక్తమాంసంతో కూడిన మనుష్యులున్నారని నే నెన్నడూ అనుకోలేదు. ఈ నిముషంలో ఈ శోకదేవత నా అజ్ఞానాన్ని బయటపెట్టింది.

"ఎందుకండీ అలా ఉన్నారు? ..." అని అడిగాడు రామారావు. మెత్తని మనస్సనుకుని ఉంటాడు... "ఎవరికర్మ కెవరు బాధ్యులు చెప్పండి! ఏం చెయ్యగలం?" అన్నాడు.

"కాదులెండి... ఈ విషాదాంతానికి నాంది వేసిన మహానుభావుణ్ని నే"నని ఎట్లా చెప్పడం? మనస్సు దుర్బలంగా ఉండడంమూలాన్నే ఇంత నీచమైన పనులనికూడా చేయించగలదు మనిషిచేత... ఆ దౌర్బల్యంలో అంతబలం ఉంది.

"అతని స్నేహితుడూ ఇంత దారుణమైన ఫలితాలుంటాయని ఏమాత్రం అనుకోగలిగినా, అలాటి సహాయం చేశేవాడు కాదేమో", నన్నాను.

"అది నిజమేలెండి ... కాని మాకేమనిపిస్తుంది? అతనిమూలంగానే ఇదంతా జరిగిందని కదా?"... కష్టంలో ఉన్నవాళ్ళకి దానికి ఒక కారకుణ్ని ఊహించుకోవడమూ కొంత ఉపశమనమేకదూ!"

ఔను... అంతమాత్రాన ఆగితే అదృష్టవంతుణ్ణే!

"ఇంతకీ ఆ స్నేహితు డెవరో తెల్సునా?" ఉండ లేక అడిగాను.

"ఎవరైతేనేం లెండి ... తెల్సుకోవలసిన అవసరం మాత్రం ఏముంది? అతనిమీద పగ తీర్చుకుంటే మాకేం ఒరుగుతుంది?"

కొంచెం చీకటి పడుతూంది. నా మనస్సులో పూర్తిగా చీకటి పడ్డది. ఇంటికిపోడానికి లేచాం.

ఆ రాత్రి అన్నం సయించలేదు. ఉదయం బెడ్డింగ్ సర్దాను.



శ్రీపతిని ఒకసారి చూడాలని చాలాకాలంనించి అను కుంటున్నాను. ఈ సంఘటన జరిగాక వాడిని చూసే ఉబ లాటం ఎక్కువైంది.

వాడప్పుడు ఖరగ్‌పూర్‌లో పనిచేస్తున్నాడు — రైల్వేలో, అక్కడికని బయలుదేరాను.

ముందు ఉత్తరం వ్రాశాను—ఇల్లెక్కడో వ్రాయ మని. జవాబుగా టెలిగ్రాం ఇచ్చాడు.

ఆ అడ్రస్‌ పట్టి వెళ్లాను.

తలుపుతీసి పార్వతి తెల్లబోయి నిలువబడింది. అప్పటి కాంతీ, సొగసూ ఆమె కళ్ళలో కనపడక, నేను ఆశ్చ ర్యంగా చూడసాగాను.

"రండి", అంది పార్వతి. లోపలికి వెళ్ళాను. ఒక గది నాకోసం ఉంచారు. స్నానంచేసి బట్టలు మార్చుకుని అందులో కూర్చున్నాను. పార్వతి బిస్కట్లూ, టీ పట్టుకొచ్చి, "ఆయన సాయంత్రందాకా రారు. విశ్రాంతి తీసుకోండి", అన్నది.

"నేను బిస్కట్లు తినడంలేదు. టీ ఉంచండి", అన్నాను.

"ఆయన అట్లా చెప్పారు...కొంచెం తినరూ? ...నామీద మళ్ళా ఆయన కోపగిస్తారు. నేను ఇవ్వలేదనుకుంటారు."

ఆమె ఆదరాన్ని సులువుగా కాదనలేకపోయాను.

"మరి—నన్ను 'మీరు' అనకండి."

నేను చేసిన పొరపాటుని గ్రహించుకున్నాను. నా ధవళవర్ణపు కేశాలు గౌరవాన్ని పొందుతున్నాయ్!

టీ త్రాగి పడుకున్నాను. సాయంత్రం లేచేసరికి శ్రీపతి గొంతుక వినిపిస్తోంది.

"నువ్వు వట్టి మృగానివి...ఆయన మనకి తండ్రివంటి వాడు. ఒక్కరాత్రి పనుందంటే అలా అవుతావేం?"

పార్వతిదే అనుకుంటాను...బాధగా, గాద్గదికంగా, ఔను... అనే గొంతుక వినిపించింది.

నా కెవరో బల్లేలతో పొడుస్తూన్నట్లయింది. శ్రీపతి... ఆ యువకుడు...ఇంత పశుత్వంతో ప్రవర్తిస్తున్నాడా?

ఇంతలో శ్రీపతి నా గదిలోకివచ్చి, తెల్లబోయి, "లేచారా బాబాయ్! ఎన్నాళ్ళకి!" అన్నాడు.

ఆ ఆనందంలో గత క్షణాల చరిత్రని మరిచిపోయాను. ఇద్దరమూ షికారుకని బయలుదేరాము.

అనేక విషయాలని గురించి మాటలాడుకున్నాము. చివరికి వాడిసంగతి వచ్చింది.

"బాగానే వెళ్తోందిలెండి...దానికి బొత్తిగా నాగరికత లేదు. అన్నీ కల్పించుకుని బాధ పెడుతుంది. మూడేళ్ళనించీ ఇంతే బాబాయ్...మనశ్శాంతి లేకుండా చేస్తోంది. ప్రతీ చిన్న విషయానికీ కలుగజేసుకుంటే ఎట్లా ఏడవడం చెప్పండి?"

మనస్సప్పుడే కొన్ని సమ్మెటపోట్లు తింది. ఈపోట్లింక చాలా బాధాకరాలు కాలేవు. అందుచేతనే వాడు చెప్పినదంతా నేను నిర్వికారంగా వింటూవుండి పోసాగాను.

"నువ్వు కొంచెం సర్దుకోవాలి..." అన్నాను.

వాడు పొడిగా నవ్వాడు, "మీ కన్నీ తెలుసు బాబాయ్ నన్నుగురించి—నేనంత సుళువుగా నిశ్చయానికి వస్తానా బాబాయ్?" అన్నాడు.

"నాకు తెలుసుగా",... అన్నాను.

"అన్నీ చేసి చూశాను. కాని లాభం లేకపోయింది బాబాయ్...చివరికి—తప్పనిసరిగా సరిపెట్టుకున్నాను."

"నా మూలంగా నీ మనశ్శాంతి పాడైంది. ఆ రోజు ..." కష్టంగా అంటూన్న నామాటలకి అడ్డంవచ్చి... "మీ మీద నేనేమీ నింద వెయ్యడంలేదు బాబాయ్. ఇద్దరిలో మీరు మంచిపిల్లనే నాకోసం ఉద్దేశించారని నాకు తెలుసును. మానవుడు కొంతదాకా ప్రయత్నించి విధికి వదలడం తప్పదు. ఎవర్నన్నా తన దురదృష్టానికి నిందించడం మూర్ఖత్వం..."

ఇంకేమీ మాటాడలేదు నేను.

రాత్రి Night Duty ఉందని శ్రీపతి వెళ్లిపోయాడు. భోజనం చేసి ఉత్తరాలు రాస్తూ కూర్చున్నాను.

"ఇక్కడ రేడియో ఉందండీ. మీరు పెట్టుకోండి", అంది పార్వతి. "అట్లానే", అన్నాను.

కాని పాటలు వినేంత తేలికగాలేదు మనస్సు. లైటార్పి పడుకున్నాను—ఆలోచించసాగాను.

కొద్దిసేపట్లో ఎవరో— పార్వతి ఏడుస్తూందని గ్రహించాను. నా కెందుకనట్లుగా ఊరుకోలేకపోయాను.

లైటు వేసి, ఆమెని పిల్చాను. కొద్దిసేపట్లో వచ్చింది. ముఖాన దుఃఖపు చిన్నెలు కనపడనేలేదు!

"ఎందుకమ్మా ఏడుస్తున్నావ్?"

"నేనా?...లేదే!..."

"నేను విన్నాను—నిజం దాచకమ్మా. నాచేతిలో ఉండేపని చేస్తాను..."

ఆమె ఆగి ఆగి ఒక్కసారి..."ఒకసారి నా బ్రతుకంతా పాడుచేశారు. ఇంకా ఏం చేస్తారు!" అన్నది.

"నే నిట్లా ఔతుందని కలగన్నానమ్మా ?...వాడు నిన్ను బాధపెడుతున్నాడా ?" సాధ్యమైనంతవరకూ తిన్న దెబ్బ దాచుకుంటూ అన్నాను.

"బాధ...రాత్రంతా ఎవరింట్లోనో పడక...నోరెత్తితే దెబ్బలు..."

ఆమె వెక్కి వెక్కి ఏడ్వసాగింది—తక్షణం వెళ్ళిపోయింది.

రాత్రంతా జాగరం చేశాను.



ఉదయం బెడ్డింగ్ సర్ది వెళ్ళటానికి బయలుదేరేను. పార్వతి గుమ్మందాకా వచ్చి నా ప్రయాణసన్నాహంచూసి తెల్లబోయింది.

"వెళ్తున్నానమ్మా...నీ జీవితంతో అట ఆడినందుకు క్షమించు", అన్నాను.

"మీరు అడుగుపెడితే ఒట్టు...రాత్రి తొందరలో అన్న మాటలకి క్షమాపణ చెప్పుకుంటాను ... కోపగించకండి", అన్నది పార్వతి తలవంచుకుని.

"మనసారా, పశ్చాత్తాపమే కాని, నీమీద కోపం ఏమీ లేదమ్మా..." అన్నాను.

"అయినా, వెళ్ళవద్దండీ...ఆయన చంపేస్తారు..."

కాళ్ళకి బంధం పడ్డది ... వాడొచ్చేదాకా ఆగక తప్పిందికాదు.

కాఫీ తాగుతూంటే, పార్వతే మళ్ళా రాత్రిప్రసక్తి తెచ్చింది ... వారించాను.

ఆ సాయంత్రం ఎన్నో అబద్ధాలాడి, ఇంటికి బయలు దేరాను. రైలెక్కుతూ శ్రీపతితో అతిప్రయత్నంమీద అనగలిగాను..."విధికి ఎలానూ వదిలిపెట్టిన నీ జీవితాన్నామె సుఖానికి కొంత వినియోగపడనీ" అని.

రైలులో కొంచెంసేపటికి నిద్ర పట్టింది.

నా గదిలోకూర్చున్నాను... రేడియో వింటున్నాను.

శ్రీపతి కుర్చీలో కూర్చుంటూ నాచేతికి రెండు ఫొటోలని ఇచ్చి, "ఈ ఫొటోలు చూడండి బాబాయ్. ఒక అమ్మాయిని పెళ్లి చేసుకోవాలి. నా కళ్ళకంటె మీ కళ్ళని నే నెక్కువగా నమ్ముతాను. ఏ అమ్మాయి బాగుం దంటారు?..." అని అడిగాడు.

రెండింటినీ పరిశీలించాను. ఒక ఫొటో ఎందుచేతనో వాడికి ఇవ్వడానికి నిశ్చయించాను ... కాని, ఏదో బలీయమైన శక్తి నాచేతిని రెండో ఫొటోమీదికి పంపుతూంది.

ఏదో మహాశక్తి ఆ భావాన్నికూడా దూరంచేసి, నా చేతిని పార్వతిఫొటో దగ్గరకి పంపింది ... నవ్వుతూ దాన్నే వాడి కిచ్చాను.

పెద్దగాలి వేసింది. రెండో ఫొటో కిటికీలోంచి ఎగిరింది. నేనూ, శ్రీపతీ నవ్వుకున్నాము.

నాకు తెలివివచ్చేసరికి పొలాలూ చెట్లూ కిటికీలోంచి వేగంగా ప్రయాణం చెయ్యడం చూశాను. అటువైపు తిరిగి మళ్ళా కళ్లు మూసుకున్నాను.

— భారతి, 7_11_52

# రసభంగం

"నువ్వు నన్ను నిజంగా ప్రేమిస్తున్నావా?"

"లోకంలో అన్నిటికంటే నిన్ను ఎక్కువగా ప్రేమిస్తున్నాను. నాహృదయాధి దేవతా! నీకోసం నా ప్రాణాలనే త్యాగం చెయ్యడానికి సిద్ధంగా ఉన్నాను...ఒక్కసారి నీ చక్కటి శరీరాన్ని నా చేతుల్లో..."

శకుంతల ఒక్కసారిగా పుస్తకాన్ని శక్తికొద్దీ విసిరి కొట్టింది. అది కిటికీ ఊచలకి తగులుకుని, కొంచెంసేపు నిస్సహాయంగా ఊగులాడి చివరకి క్రిందపడ్డది. ఆమెకి కోపం తీరలేదేమో, లేచి ఆ పుస్తకాన్ని తీసి కిటికీలోంచి బైట పడవేసింది.

పుస్తకం తియ్యబోయేసరికి ఇదీ కథ! ప్రేమ—మోహం...ఇంతేకాబోలు వీళ్ళకి వచ్చినది! "నీకోసం చచ్చిపోతాను–కాఫీ మానేస్తాను–అవి చేస్తానూ ఇది చేస్తానూ", అనడం—అక్కడినించి మామూలుగా కృతఘ్నతా–అంతా చవకబారు కథలు!

కిటికీలోంచి శకుంతల బయటికి చూసింది. తూర్పువైపు ఉన్న స్టూడెంట్ల లాడ్జినిండా దీపాలు. అందరూ చదువుకుంటున్నట్లున్నారు. మార్చిగా మరి! నిరుడు తానూ అలాగే బాధపడ్డది!

టైము చూసింది...పదిన్నర. నిద్రపోదామని మళ్ళా మంచంమీద వాలింది శకుంతల. నిద్రవచ్చే సూచన లేమీ కనపడలేదు. చదువుకోడానికి పుస్తకా లేవీ లేవు. ఉన్న దొక్కటీ పైకి విసిరింది. మూడో అంతస్తులోనించి దిగి దానిని తెచ్చుకోవడం అసంభవం—తాను పడిన తొందరకి కొంచెం సిగ్గుపడ్డది శకుంతల ... ఇంకా చదివితే కథ బాగుండు నేమో!

ఒకటి రెండుసార్లు దొర్లింది, కాని, లాభంలేదు—నిద్రపట్టదు. ఏమిటిలాభం అలా పడుకుంటే?

లేచి, లైటు వేసింది. రేడియో పెట్టింది. ఇండియన్ స్టేషన్లన్నీ నిద్రపోతున్నై ... పన్నెండుదాకానైనా స్టేషన్లు పని చెయ్యకపోతే ఎట్లా? అనుకుని చికాకుపడ్డది శకుంతల... అన్ని బేండ్లూ చూసింది ఏఫారెన్ స్టేషనైనా దొరుకుతుందని.

దొరికింది. ఏదో స్టేషనులో చక్కటి జంత్రసంగీతం వస్తోంది. పియానో, దాని వెనకాల ఎన్నో ఇతర వాద్యాలు. ఎంత హాయిగావుంది!

పద్దెనిమిదేళ్ళ యవ్వనం శకుంతలని ఆ సంగీతం వింటూండగా నిలువనియ్యలేదు. చిన్నప్పుడు కాన్వెంటులో చదువుతోండగా ఆమె నాట్యం నేర్చుకొనేది. ఈ ప్రశాంత వాతావరణంలో, ఏకాంతంలో, ఈ చక్కని సంగీతానికి ఆమెలో నరాలన్నీ కదలికపొందాయి. ఆనందంగా అడుగులు వేసుకుంటూ నాట్యం చెయ్యసాగింది.

టెలిఫోన్ గంట గణగణ మోగింది.

శకుంతలకి కోపం వచ్చింది. ఎవరబ్బా ఈ అర్ధరాత్రిని పనివున్న మహానుభావుడు?

విసుకుతో రేడియో గొంతుక తగ్గించి, ప్రక్కనే వున్న టెలిఫోను తీసిందామె.

"ఇది నూటపదహారు...ఎవరది?"

"అక్కడ ఎవరు?"

"శకుంతల."

"నమస్తే, శకుంతలాదేవిగారూ!"

"నమస్తే...మీరెవరని అడిగాను."

"ఎవరినైతేనేమిలెండి — మీరు బి. ఏ. నిరుడేగా ప్యాసయ్యారు?"

"తమ కెందు కదంతా ?"

"పని ఉండే లెండి_అర్ధరాత్రయేదాకా మీ రేడియో ఫుల్ బాస్టలో వుంచి గోలచేస్తూంటే మా మాట ఏమిటంటారు?"

"మీరెవరో నాకు తెలీదు—అయితేనేం? సంగీతం విని సంతోషించండి."

"పరీక్షల్లో మా సంగీతం వినదుగా?"

"నేను వింటాలెండి."

"వింటే ఏం లాభం ?"

"చెప్తాను—రేపోసారి కల్సుకోండి."

"పోనీ ఆసాయం ఇప్పుడే చేయరాదూ ?"

"ఏంటదీ ?"

"మీ రేడియోగారి నోరు కట్టేయాలి."

"లేకపోతే ?"

"మీకు తెలుసుగా ?"

శకుంతలకి వళ్లుమండింది—మంచిగా చెప్పరాదూ? అంత పొగరుమోతుతనం ఎందుకూ ?

చేతిలోఉన్న రిసీవర్ రేడియోమీద పెట్టి, టోన్ పూర్తిగా రైజ్ చేసింది. తన పనికి తానే నవ్వుకుంది... రెండు నిమిషాలయాక తీసింది.

అవతలాయన ఇంకా డిస్కనెక్ట్ చెయ్యలేదు.

"చాలా బాగుందండీ సంగీతం."

"థాంక్స్—ఇంక చాల్లనుకుంటాను!"

"చాలకేం? కాని, వెంటనే కట్టేస్తారా?"

"అదలా వినిపిస్తూంటుందిలెండి. మీ సంగీతం మీరూ కానివ్వండి..."

రిసీవర్ పెట్టేసింది కోపంగా శకుంతల. రేడియో పాడుతూనే ఉంది. కొన్ని నిమిషాలయాక కట్టేద్దామా అనుకుంది. కాని, అంత సులువుగా ఓటమిని అంగీకరించడం ఇష్టంలేకపోయిందామెకి.

లైటుమాత్రం ఆర్పి పడుకుంది. అనేక ప్రశ్నలామెని బాధించడం మొదలుపెట్టాయి. ఎవరా పిలిచినది? ఎందుకంత కటువుగా మాట్లాడాడు? చుట్టుప్రక్కల ఎవరో అయితీరాలి. కాని, ఎవరు? పెద్ద మగవాణ్నని, నోరు కట్టేయాలిట!—ఇన్సల్ట్!

ఎదురుగావచ్చి, "మాకు పని చెడుతోంది; దయ ఉంచి రేడియో పెట్టకండి!" అంటే తాను తప్పకుండా ఆ పని చేసి ఉండేది. పోనీ, ఫోనులో అయినా మంచిగా అడగరాదూ? ఎందుకంత గర్వం?

మళ్లా ఆ ప్రశ్న... ఎవరతను? ఎలా ఉంటాడు?...

ఎవరైతే నేం? చుట్టుప్రక్కల ఎవరో అయి ఉంటారు ...అని తానే సమాధానం ఇచ్చుకుంది శకుంతల.

ఆమెకి తెలియకుండానే నిద్రపట్టిందా ఆలోచనలో. తెల్లవుఝామున మూడుకి రేడియోగోలకి తెలివి వచ్చింది. లేచి రేడియో కట్టేసి పడుకుంది మళ్లా.



ఉదయం కాఫీ తాగుతూంటే తండ్రి అడిగాడు... "రాత్రి మూడుగంటలకి రేడియో పెట్టావేంటమ్మా?" అని.

"ఏదో ప్లే వస్తోంటే వింటున్నాను నాన్నా", అన్నది శకుంతల.

"అప్పుడెలా వచ్చింది? ఏ స్టేషను?"

"టొరంటో నాన్నా."

అసలా స్టేష నుందో లేదో తెలీదామెకి. తడుము కుంటే నాన్న అనుమానపడతాడు. ఆయన నిజమే నను కున్నాడు.

తన గదిలోకొచ్చేసరికి శకుంతలకి రాత్రి జరిగిన సంగతిఅంతా జ్ఞప్తికి వచ్చింది. మరచిపోదామంటే మరీమరీ జ్ఞప్తికి వచ్చాయి తా నాడిన మాటలు.

అత నెంత బాధపడ్డాడో! నిశ్చయంగా అతను తన నెరుగును. ఆ చనువు తీసుకున్నాడేమో! తానెంత కటు

వుగా మాట్లాడింది! — పాపం అతను చాలా సిగ్గుపడి ఉంటాడు.

ఆ రోజంతా ఆమె నాజ్ఞప్తి వెంటాడుతూనే ఉంది. కనిపించిన ప్రతీయువకుణ్ని ఆమె పరీక్షిస్తూంది తన కిటికీవైపు తేరిచూరి చూస్తాడేమోనని. ఉహూఁ. ఎవ్వరూ చూడలేదు. ఎవరిపనుల్లో వాళ్లు నిమగ్నులై ఉన్నారు.

ఏవో పుస్తకాలకోసం లైబ్రరీకి వెళ్లింది. అక్కడ అందరినీ పరీక్షించింది. ఆమె భావనకి సరిపడే వారెవరూ దొరకలేదు. పరధ్యానంగా షల్ఫులు వెదుకుతూ దేనికోసం తాను వెదుకుతూందో మరిచిపోయింది.

ఆ రోజల్లా ఆమెకి కలలో బ్రతుకుతూన్నట్లుంది. ఆ ప్రశ్న ఆమెని వేధిస్తూంది.

సాయంత్రం ఎనిమిదయేదాకా రేడియో ఉంచుకుని తరవాత తీసేసింది శకుంతల. "పోనీ పాపం! చదువు నా మూలంగా పాడయి పరీక్ష సంగీతం పాడితే నామీద పడుస్తాడు", అనుకుంది.

తొమ్మిదయేసరికి టెలిఫోను మోగింది.

"నూటపదహారు..." అంది శకుంతల.

"నమస్తే!"

తృళ్లిపడింది అమ్మాయి. ఆ గొంతుకే! మళ్ళా...

"నిన్నరాత్రి సంగీతానికి మిమ్మల్ని థాంక్ చేద్దామనిపించింది. పోయినచదువు పోతే పోయిందిగాని, చక్కటి ఆర్కెస్ట్రా సుమండి!"

శకుంతల చాలా సిగ్గుపడ్డది. ఇంతమోటుగా ప్రవర్తిస్తున్న అతనిమీద ఆమెకి కోపమూ వచ్చింది.

"ఇది చెప్పండి—మీ పేరేమిటి?"

"ఏమైతేనేంలెండి? – న్యూసెన్స్ కేసు పెట్టడానికా?"

"పెట్టనులెండి. చెప్పండి."

"కేసు పెట్టకపోతే పేరెందుకు? పోనీ 'ఎక్స్' అనండి".

"మీ ఇల్లెక్కడ?"

"మీలాటివారి ఔన్నత్యాలక్రింద ... దానికేంలెండి. ఈవేళ మీరు నన్ను డిస్టర్బ చెయ్యకూడదని నిశ్చయించుకున్నందుకు సంతోషం."

కోపంతో పెదవులు బిగబట్టి రిసీవర్‌ని క్రిందపడవేసి, శకుంతల రేడియో పెట్టింది. సాధ్యమైనంత ఎక్కువ చేసింది వాల్యూమ్. రాత్రి పన్నెండుదాకా ఆపాటికి నిద్రపట్టలేదు. ఆమె అది సహించింది. రేడియోమాత్రం కట్టలేదు.

మరునాడు ఉదయం కాఫీతాగి కూర్చునేసరికి ఒలి ఫోన్ పిలిచింది. రిసీవర్ తీసేసరికి మళ్ళీ అదే గొంతుక!

"రాత్రి సంగీతానికి థాంక్ చేద్దామని పిల్చాను."

తెల్లబోయింది శకుంతల. మరుక్షణమే తెలివితెచ్చుకుని "మీరు మీ మోటుతనానికి క్షమాపణ చెప్పేదాకా నా రేడియో గోలచేస్తోనే వుంటుంది—మీరు థాంక్ చేసినంత మాత్రాన రేడియో పెట్టడం మానేస్తానని ఆశ పడకండి", అన్నది.

నవ్వు ... "నేను మోటుగా ప్రవర్తించానా?"

"అక్షరాలా. చేతనైతే ఎదుటపడండి. ఎంత మోటుగా ప్రవర్తించారో చెప్తాను."

"మీ కంత కోపం ఎందుకూ? క్షమాపణ కావాలంటే ఇప్పుడే ఇచ్చేస్తాను."

"ఫోన్ క్షమాపణ అక్కర్లేదండి."

"నేరమైతే ఫోన్‌మీద చేశాగా?"

"అయినాను—"

"కాని నేను మీకు కనపడదల్చుకోలేదండి."

చిరాకుగా రిసీవర్ పెట్టేసింది శకుంతల. అతనెవరో చూడాలనే కౌతుకం ఆమెకు రోజు రోజుకీ ఎక్కువౌతోంది. రోజూ ఈ టెలిఫోన్‌వల్ల తన ఆలోచనలు పెరిగిపోతున్నవి. కొంపతీసి, అతనీ ప్రసంగం ఏ ప్రణయానికీ నాందిగా ప్రారంభించలేదుగద?

తన ఆలోచనికి నవ్వొకుంది శకుంతల. "శాన్‌ఫ్రాన్సిస్కోలో ఒక యువకుడు, ఒక యువతిని ప్రేమించాడట.

అనుదినమూ ఫోన్ ద్వారా ఆమె యోగక్షేమాలు తెలుసుకుంటూ ఉండేవాడట. కాని తానెవరో, ఎందుకలాగ చేస్తున్నాడో మాత్రం చెప్పేవాడుకాదట. సంవత్సరం ఇలాగ గడిచాక, ఆమె అతనెవరో తెలుసుకోలేకుండా ఉండలేక, "నువ్వెవరైనా సరే, నాదగ్గరికివస్తే వివాహమాడతాను, అని చెప్పిందట. తరవాత ఆ ఇద్దరూ పెళ్లాడి సుఖంగా జీవిస్తున్నారు", అని ఒక వార్త పేపర్లోపడితే ప్రతీవాళ్ళూ నమ్ముతారు. బహుశా ఈ యువకుడూ అలాటి పనేమీ చెయ్యడం లేదుగద?—అందులో పరీక్షలుకూడా అయిపోతే కావలసినంత తీరుబడి!

కాని, ఎవరితను?



రోజూ రాత్రిళ్ళు రేడియో పూర్తి వాల్యూమ్‌లో ఉంచుతోంది శకుంతల— ఈ గొడవ తగ్గించుకోవడానికి అతను వ్యక్తిపరంగా క్షమాపణ చెప్పుకుంటాడని ఆమె ఆశ.

ప్రతీరోజూ టెలిఫోన్‌లో అత నామెకి గతరాత్రి సంగీతానికి కృతజ్ఞత చెప్తున్నాడు.

"మీరీ రాత్రి సంగీతం పెట్టరని ఆశించవచ్చునా?"

"అలాటి ఆశేమీ పెట్టుకోవద్దు—దాని కొక్కటే షరతు."

"నేను వచ్చి క్షమాపణ చెప్పాలా?"

"ఔను..."

టెలిఫోనులో నవ్వు..."సారీ..."

"వెరీ సారీ..."

ఇదీ వరస. ఇలాగ పదిరోజులు గడిచిపోయాయి. ఆమె సంగీతం రాత్రంతా ఉంచుతోంది—ఈ మెసేజే వస్తోంది.

ఆ మరుసటిదినం శకుంతల సినీమాకి పోయింది. తిరిగొచ్చేసరికి టెలిఫోన్ ఒకే పనిగా అరుస్తోంది.

"నమస్తే శకుంతలాదేవిగారూ!"

"ఊఁ. ఏం?"

"అయితే మీరు పంతం వదలనంటారు?"

"మీరూ అంతే అంటున్నారుగా?"

"మీ కింతకోపం ఉండకూడదండీ...నామాట విని ఈ రోజునుంచి రాత్రి నిశ్శబ్దం ఉండనివ్వండి."

జవాబుగా రేడియో సంగీతం టెలిఫోన్లోంచి వెళ్ళింది.

"శకుంతలాదేవీ!"

"సంగీతం చాల్లేదా?"

"నన్ను ఓడించారండీ!"

"సంతోషం."

"రేపు సాయంత్రం మీ దర్శనం చేసుకోమంటారా?"

"చిత్తం."

శకుంతల ఒక్కసారి సముద్రంలో మునిగినట్లైంది సంతోషంతో.

"ఎక్కడ ?"

"నదివద్దకి రండి 5 గంటలకి. లవర్స్ బెండ్..."

"థాంక్యూ. సెలవు."

"సెలవు."

ఈ పదిరోజుల ఆట ఈనాటితో సరి! ఆరాత్రి సంతోషపు ఉద్రేకంలో నిద్రే పట్టలేదు. ఇంత గ్రిట్ ఉన్న యువకుడిని లొంగదియ్యగలిగినందు కామె చాలా గర్వపడింది. మర్నాడు సాయంత్రం జరుగబోయే కథ నామె భావించుకుంది...అతను వినమ్రుడై క్షమాపణ చెప్తుంటే...పాపం! మగవాళ్లు! అనుకుంది.

మర్నాడు తెల్లవారిన దగ్గరనించీ ఆమె సాయంత్రం కోసమే ఎదురు చూస్తోంది. రోజు మెల్లిగా నడుస్తోంది. సాయంకాలం వేసుకోబోయే దుస్తులను గురించి ఆమె ఆలోచిస్తూ ఎలాగో గడిపింది.

మూడున్నర అయిన దగ్గరనించీ ఆమె అలంకరించుకోసాగింది. "ఎందు కింత అలంకారం?" అన్న అనుమానం

ఆమెకి కలుగలేదు...తాను పొందబోయే మహావిజయ గర్వంలో ఆమె మునిగి తేలుతోంది.

సరిగ్గా అయిదు.

లవర్స్ బెండ్ దగ్గరకి వచ్చింది శకుంతల. చుట్టూ చూసింది. ఒక చెట్టుక్రింద ఎవరో ఒక ముసలాయన కూర్చుని ఏదో చదువుకుంటున్నాడు.

వాచీ చూసుకున్నది. అయిదూ రెండు నిమిషాలు.

తానే అక్కడికి ముందువచ్చినందుకు సిగ్గుపడ్డది శకుంతల. "వీళ్ళకి పంక్చువాలిటీ అంటే తెలియనే తెలియదు", అని గొణిగింది. కనుచూపుమేరలో ఆ ముసలాయన తప్పిస్తే ఇంకెవరూ లేరు.

కొద్ది నిముషాలామె అట్లానే నిల్చుంది. మధ్య మధ్య ముసలాయన తనవంక చూస్తున్నాడని గ్రహించి ఒకచోట కూర్చున్నది. ఆయన ఎవరో పెద్దఇంటాయనల్లే ఉన్నాడు.

అతనింకా రాడేమిటి ?

తనని ఫూల్ చేస్తున్నాడా ?

చుట్టూ చూసింది శకుంతల మళ్లా. ఎవ్వరూ రావడం లేదు. ఏదో ఆలోచిస్తూ ఎలాగో అయిదున్నర అయేదాకా గడిపింది. ఆ యువకుడి జాడలేదు.

"డామ్‌హిమ్", అని గట్టిగా అని వెళ్లిపోవడానికి లేచింది శకుంతల కోపంగా.

ముసిలాయన అప్పుడు చేతులోవున్న పుస్తకం మూశాడు. "ఏమమ్మా అంత కోపంగా ఉన్నావ్?" అన్నాడాయన.

ఆమె నిజం చెప్పలేకపోయింది. "ఏమీ లేదండి. ఊరకనే వచ్చాను. తోచడంలేదు. చికాకు పుడుతోంది", అన్నది.

ఆయన చిన్న నవ్వునవ్వాడు. "నీ మాటలు అబద్ధం అని నాకు తెల్సులే" అనేట్లు. శకుంతల సిగ్గుపడ్డది.

"ముసిలివాళ్ళకి నిజం చెప్తే మంచే జరుగుతుందమ్మా. నాకు కొంచెం థాట్ రీడింగ్ వచ్చును. నీపేరు శకుంతల కాదమ్మా? ... సిగ్గుపడకు. అత నిక్కడికి రాడు", అని ఆగాడు.

ఆమె నిరాశగా చూసింది – దొరికిపోయా ననుకుంది. ఈయనెవరో మహానుభావుడల్లే ఉన్నాడే!

"అసలు జరిగినసంగతి చెప్పేదా?" అన్నాడాయన ఒక్కక్షణం కళ్ళుమూసుకుని. ఎక్స్‌రే తీస్తోన్నట్లు Feel అయింది శకుంతల.

"...అతనువస్తే ఏంచేస్తావు?" అన్నాడాయన కళ్లు తెరిచి.

"ఇంకెప్పుడూ అలా చెయ్యొద్దని చెప్తాను."

ఆయన మళ్ళా నవ్వాడు. చిన్నగా "నిజంగానా?"

"ఔనండి..."

"అత నంత అపరాధం ఏం చేశాడని? మీ రేడియో తనని బాధిస్తోంది గనుక నిన్ను కొంచెం వాల్యూం తగ్గించమన్నాడు. పెద్ద నేరం ఏమిటి చేశాడమ్మా?"

శకుంతల తల వంచుకున్నది.

"నాకు తెల్సునమ్మా, నువ్వు చాలా మంచిదానివని. అంతకోపం నీకు రానేరాదు. ఊరికేనే అతన్ని చూద్దామను కున్నావ్. కౌతుకం చాలా బలమైనదిగదూ మరి!"

"ఆయన ఎవరండీ?"

ముసిలాయన ఒక్కసారి ఆమెవైపు తన కళ్లు తిప్పి,

"అబ్బే, చాలా ముసిలాయనలే అమ్మా", అన్నాడు.

శకుంతల దెబ్బ తిన్నది ...... "ముసిలాయనా?" అన్నది.

"ఔనమ్మా..."

"పరీక్షకి చదువుతానన్నాడే?"

ఆయన పెద్దగా నవ్వాడీసారి..."అబద్ధంలే", అన్నాడు.

"ఎవరండీ ఆయన అసలు?"

"— నే నే నమ్మా..."

నిలువునా నీరైపోయింది శకుంతల. ఈయనా?...

"మీ ఇంట్లోనే క్రిందిభాగంలో ఉంటున్నాం. మా అల్లుడింటికి వచ్చాను. వాళ్ళ రేడియో చెడ్డది. నాకు

పన్నెండుదాకా నిద్రపట్టదు. ఆ ఇంగ్లీష్ సింఫొనీలూ అవీ నాకిష్టం. అందుకని ఈ నాటకం వేశానమ్మా."

"నాతో చెప్తే..."

"పిల్లలమ్మా మీరు—పంతంతో ఏమన్నా చేయించ గలం గాని, మంచిని అమ్మో! ... నాటకంలా ఉందా?— ఏమనుకోవుగదూ?"

శకుంతలకి చాలా బాధగా ఉన్నది. పెద్ద దెబ్బతిన్న దానిలా తల దించుకున్నది.

"ముసిలాళ్ళమీద అంత కోపం అయితే ఎలామ్మా? కావలిస్తే నాతో దెబ్బలాడు. మా మనవరాలట్లానే లే...."

శకుంతలకి జరిగినదంతా తల్చుకోగానే నవ్వొచ్చింది. ఇక ఆగలేక నవ్వింది గట్టిగా.

"రేపు వెళుతున్నా నమ్మాయ్. అందుకే నీకు కని పించాను. వెళ్దామా?" అన్నాడాయన లేస్తూ.

"పదండి", అని వెనకాల బయలుదేరింది. కొంచెం దూరం వెళ్ళగానే సంభాషణ మొదలుపెట్టింది.

— ఆంధ్రపత్రిక, 24-9-52

# నీటగలిసిన త్యాగాలు

హాలులో నిశ్శబ్దంగా కూర్చున్న ఒకే ఒక జీవి... వెంకట్రావు, సెకండ్ల నిశ్శబ్దాలలో సూచిస్తూ నిశ్శబ్దాన్ని భంగపరుస్తూన్న గడియారం.

కాలం గడుస్తోంది. వెంకట్రావు సాయం సమయ సౌభాగ్యాన్ని కాక, దేనినో కిటికీలోంచి చూస్తున్నాడు. కిటికీలోంచి దూరాన రంగులు మారుస్తూన్న కొండలూ, చెట్లు అతనికి దర్శనంద్వారానే ఏదో పాఠాలని నేర్పుతున్నై...

చాలాసేపు అలాగ గడిచాక వెంకట్రావు కళ్ళనించి కొంచెం అశ్రువులు క్రిందికి రాలాయి...

రెండు సంవత్సరాల క్రితం...

♦ ♦ ♦ ♦

రాత్రి పన్నెండుగంటలో, ఎక్కువో అయింది. వెన్నెల విరిసిన మల్లెలల్లే నవ్వుతూ కాస్తున్నది. వెంకటరావుకి ఆనాడు జరిగిన వివిధ విషయాలూ నిద్రని దూరం చేశాయి. మేడమీద కుర్చీలో కూర్చుని ఆలోచించుకుంటున్నాడు.

హఠాత్తుగా, ఆ నిశ్శబ్ద ప్రకృతి నిర్మలత్వంలో అతనికేదో మురళీగానం వినపడింది...పసిడికి తావిలాగ, ఆ వెన్నెలకి సౌరభాలలాగ, ఆ గానమాధుర్యం ఆ ప్రకృతి నిర్మలత్వానికి అందాలు దిద్ది, అతని హృదయానికి గిలిగింతలు పెట్టింది.

ఆ గానం వింటూ ఎంతసేపు గడిపాడో...

"ఇంకా నిద్రపోలేదా బావా ?" అంటూ ప్రభ వచ్చింది...ఈ యథార్థ ప్రకృతిలోకి రావడానికి కొంచెం బాధపడ్డాక, "మురళి వింటున్నాను", అన్నాడు వెంకటరావు.

ఆసరికి గానం ఆగిపోయింది. ప్రభ కొంచెం కోపంగా, "మళ్ళా నిద్ర చెడగొట్టాడా వాడు ?" అన్నది.

వెంకట్రావు వారిస్తూ, "నిద్ర చెటగొట్టలేదులే... ఎంత చక్కగా వాయించాడంటావ్ ? అసలు, ఎవరది ప్రభా ?"

"వాడా? నాగరాజని, కాఫీహోటల్ సర్వరు. తల్లీ దండ్రీ లేకపోగా వాళ్ల మేనమామ చేరదీశాడు...ఇంట్లో అవీ ఇవీ కొట్టేస్తూంటాడట. తరుచు దెబ్బలు తింటూనే ఉంటాడు. చూశావుగా? అర్ధరాత్రి కర్రపుచ్చుకుని ఇలాగ నిద్రపట్టనియ్యకుండా మోగిస్తూంటాడు. ఎంతమంది తిట్టినా, కొట్టినా—"

"కొట్టారా? ఎందుకని?"

"నాన్నే ఒకసారి తగలనిచ్చాడులే ... అర్ధరాత్రి ఇలాగ అల్లరిచేస్తూంటే మరేం చేస్తారు? ఇంకా నయం. ఆవేళ అన్నయ్యఉంటే చంపేసేవాడు...అదేం బావా, అలా చూస్తావ్?"

"ఏమీలేదులే ప్రభా...కాని, వాడి గానంలో ఎవ్వరికీ మాధుర్యం కనిపించలేదూ?"

"మాధుర్యంలాగే ఉంది ... తలనొప్పి చస్తూంటే. అసలు వాడెవడో తెలుసా?"

"ఎవరు?"

"వాడితండ్రి, నాన్నని ఒక దావాలో ఇరికించి, ఫోర్జరీనేరం బనాయించి, జైల్లో త్రోయించాలని చూశాడుట...నాన్న అలా దొరుకుతాడా? అద్దెందంటే ఇప్పుడు వీడిశని ... దొంగవెధవ. పెంచేరన్న కృతజ్ఞత లేకుండా ఇంట్లోనే దొంగతనాలు..."

"పోనీలే ప్రభా...పుణ్యమూ పాపమూ భగవంతుడి కెరుక ... పోయి పడుకుంటాను. వెళ్ళు."

ప్రభ వెళ్ళిపోయాక వెంకట్రావు ఆలోచనలో పడ్డాడు. ప్రభ చెప్పినదానిలో చాలా తక్కువ నిజం ఉండాలి. ఊళ్ళో చాలామంది ప్రభ కుటుంబానికీ, నాగరాజు కుటుంబానికీగల వైరుధ్యానికి కారణా లనేకాలుగా చెప్పు కుంటూంటారు. నాగరాజు తల్లిని యవ్వనంలో ప్రభ తండ్రి జానకిరామయ్య వలలో వేసుకోజూచాడనీ, ఆమె ఆపని సాగ నియ్యక భర్తతో చెప్పి అతన్ని తన్నించిందనీ ఒక కథనం. ఏది ఏమైనా, ప్రభ కుటుంబానికంతటికీ, తన కుటుంబములో చివరికి మిగిలిన నాగరాజువీాద చాలా కోపం ఉందన్న సంగతిమాత్రం నిర్ధారణ అయింది.

ఉదయంలేచి ముఖం కడుక్కుంటూంటే గోడ అవతల, నాగరాజింట్లోంచి ఏదో స్త్రీకంఠం తిడుతూ వినిపించింది. వెంకటరావు ఆ వైపుకి చూశాడు. నాగరాజుని వాళ్ళ అత్త తిడుతోంది.

"సిగ్గులేని వెధవా...ఆ రూపాయి నువ్వుకాక ఇంకెవరు తీస్తారు? వాడికి బూట్సుకొందామని ఇందాకా ఒక రూపాయి ఉంచాను. అప్పుడే నీకళ్ళు పడ్డాయీ? ఎక్కడ దాపురించావురా?"

నాగరాజు దీనంగా, "నేను తియ్యలేదత్తా ... నాకెందుకు? నిజంగా నే నెరగను", అన్నాడు.

ఆ మాటలు పూ ర్తయేసరికి వాడి లెంపమీాద ఆమె వ్రేళ్లు డిగ్ మన్నాయి. వెంకటరావు గుండెలు జివ్వు మన్నాయి. ఇంక చూడలేక కష్టంగా వెనుదిరిగాడు. ప్రభ కాఫీకప్‌తో సిద్ధం అయింది. అతను ముఖం తొందరగా కడుక్కోవడం ముగించి కాఫీ తీసుకున్నాడు.

"నేనే వద్దనే ... నువ్వెందుకు తెచ్చావు ప్రభా?"

"ఏం, తేకూడదా ?"

"ఎందుకూడదు? కాని అనవసరంగా శ్రమ ఇవ్వడం ఎందుకని – తరవాత ఎలాగూ తప్పదుగా?"

ప్రభ తొందరగా కప్పు తీసుకుని క్రిందికి పరిగెట్టింది ప్రయత్నించినా వెంకటరావు చేతులకి దొరకకుండా.



బావమరదులు వెంకటరావూ, శ్రీపతీ హోటల్‌కి పోయారు కాఫీ తాగుదామని. ఒక మూల కూర్చున్నాక శ్రీపతి, ఎవరూ సర్వ్ చెయ్యడానికి రాకపోవడం చూసి, "ఒరే నాగరాజూ!" అని పిలిచాడు.

నాగరాజే అయి ఉంటాడు, వచ్చాడు. పద్నాలుగేళ్లుంటాయి. చక్కని ముఖవర్చస్సు బీదరికాన్ని సూచించినా మాలిన్యాన్ని సూచించని బట్టలు. వెంకటరావుకి చాలా కష్టం అనిపించింది వాడి పరిస్థితికి. ఉదయం ఇంటిదగ్గర జరిగిన కథకి వాడికళ్లు సాక్ష్యం చెప్తున్నాయి.

"ఇడ్లీ తీసుకునివచ్చి రెండు పెసరట్లు చెప్పరా", అన్నాడు శ్రీపతి. అధికారయుక్తంగా ఆ మాట లతనం టూంటే వెంకటరావు కళ్ళల్లో కనిపించిన అసహ్యాన్ని నాగ రాజు మాత్రం చూశాడు.

శ్రీపతి 'ఆర్డర్' తీసుకుని, నాగరాజు వెళ్ళిపోయాడు. ఇంకా వెంకటరావు అలాగే పరధ్యానంతో ఉండడం చూసి, శ్రీపతి "ఏమిటి బావా, ఆలోచిస్తున్నావు?" అన్నాడు.

వెంకటరావు కొంచెం తేరుకొని, "ఈ హోటల్లో పరి శుభ్రత అంటే ఏమిటో తెలుసునా అని ఆలోచిస్తున్నాను... అలాటిచోట వెయిటర్‌గా ఉండడం ఇంకా ఎంత అసహ్యా కరమా అని?" అన్నాడు.

శ్రీపతి నవ్వి, "మనకిక్కడ అంతా స్పెషల్‌లే ... వెయిటర్‌ది కూడా ఒక ఉద్యోగమేకాదూ? వీడిబాబు చాలా డబ్బు అందరిదగ్గరా కొట్టేశి తాగేశి వీడిని లోకంమీద వదిలేశాడు. అదంతా ఒక కథలే."

వెయిటర్ నాగరాజు ఇడ్లీ తెచ్చాడు. ఇద్దరూ తింటున్నారు. వెంకటరావుమాత్రం చాలా ఆలోచనలతో బాధపడుతున్నాడు. నాగరాజుని ప్రత్యక్షంగా చూశాక గతరాత్రి వాడు వినిపించిన సుందరమురళీనాదతరంగాలు మళ్లా జ్ఞప్తికి వస్తున్నాయి. మాణిక్యం బొగ్గుల్లో పడిఉండే లాగ, నాగరాజు పరిస్థితి అతనిని బాధిస్తూన్నది.

పెసరట్లు వచ్చాయి. సరిగ్గా కాల్చలేదని వెయిటర్‌ని తిట్టాడు శ్రీపతి. నాగరాజు మాటలాడలేదు; వెంకటరావుకి మాత్రం శ్రీపతిమీద కోపం అంచులకి ఎగబ్రాకుతోంది.

కాని, కాఫీవచ్చాక, కప్పులో చిన్న చీమ కనిపించే సరికి శ్రీపతి కోపం ఆగలేదు. కోపంగా "వెయిటర్" అని పిలచాడు.

"బాబూ !"

"ఇదేమిట్రా ?"

"పంచదారలోనిది కాబోలు... ఇంకొకటి తెస్తాను."

"స్టుపిడ్...కళ్లు కనపడలేదూ ?"

"నే నేం చేసేదండీ? కాఫీ కలిపేవారి నడగాలి."

"వెధవ, సమాధానం చెప్తావ్! మేనేజర్!"

గట్టిగా కేక వేశాడు ... మేనేజరు వచ్చాడు.

"ఏమండీ ఈ కాఫీ చూశారా? ఏమిటని అడిగితే కాఫీ కలిపినవాడి నడగమంటాడు. వెయిటర్‌కే ఇంత గర్వమా?"

నాగరాజు వణకుతున్నాడు.

"ఏమిరా? ఏందిరా యిది?"

"నేను చూడలేదు సార్."

"ఏమిరా? కళ్ళులేవా? పైగా, సమాధానం సెప్తావా? ఇడియట్."

నాగరాజు కళ్ళల్లో నీరు తిరిగింది. మేనేజరు వాడి చొక్కా కాలరు పట్టుకున్నాడు.

బలంగా గింజుకుంటూ నాగరాజు "వదలండి", అన్నాడు. అందరూ తెల్లబోయారు.

కాని, మేనేజర్ అధికారమూ, శ్రీపతి స్వోత్కర్షా దెబ్బతిన్నాయి.

"ఏమిరా?" అన్నాడు కోపంగా మేనేజరు.

"నాకు ఉద్యోగం అక్కరలేదు", అన్నాడు నాగరాజు, బిల్లుపుస్తకమూ పెన్సిలు టేబిలుమీద పడేస్తూ.

మేనేజర్ కోపంతో వణికిపోతున్నాడు. "నీ మామకి ఒక నెల జీతం అడ్వాన్సు ఇచ్చి ఉండాన్రా. ఏమిచేస్తావు? దెబ్బలు తినేదానికి", అన్నాడు.

నాగరాజు తెల్లబోయాడు ... మేనేజర్ అనువు చూసి ఒకటి అంటించాడు.

అప్పటిదాకా కూర్చుని ఇదంతా సంబంధంలేనట్లు చూస్తూన్న వెంకట్రావుకి ఒక్కసారి కోపం వచ్చింది.

"ఆగు ... మళ్ళా వాడి వంటిమీద చెయ్యిపడితే జాగ్రత్త", అని కేకవేసి, వెళ్లి నాగరాజుని విడిపించి వాడికీ మేనేజరుకీ మధ్యన నిలబడ్డాడు. ఉన్నతమైన అతని ఆకృతి చూసి, మేనేజరు కొంచెం తగ్గాడు.

ఇంతలో శ్రీపతి కలుగజేసుకుని, "వదిలేయ్ బావా... వాడి ఖాగరుకి తగలాల్సిందే. మన కెందుకు?" అన్నాడు.

"అదేమిటోయ్? వెయిట ర్లై తేమాత్రం అంతనీచంగా చెయ్యి చేసుకుంటారా? అసలు కాఫీలో ఈగవుంటే పూచీ ఎవరిది ?"

శ్రీపతి చిన్నబుచ్చుకున్నాడు. తనమీద బావ అంత నిందనీ వేశేశాడు. అతనికి చాలా కోపం వచ్చింది.

"ఏడి మామ నాకు వీడిని ఒప్పగించేడు సార్...వీడి కెవడుసార్ తిండిపెట్టేది? ఎక్కడికిరా నువ్వు పోయేది?"

నాగరాజు తలవంచుకున్నాడు. ఔను—వాడెక్కడికి పోతాడు ?

"ఎక్కడికీ పోను సార్", అన్నాడు.

"వెధవ", అన్నాడు శ్రీపతి తాను తిన్న దెబ్బ తీవ్రతని చూచిస్తూ.

"ఏడి మామ కెంత ఇచ్చావు అడ్వాన్సు?" అన్నాడు వెంకటరావు మేనేజర్ వైపు తిరిగి.

"ఒక నెల జీతం స్సార్ ... పదిహేను రూపాయలు."

వెంకటరావు పర్సుతీసి నోట్లు తీస్తూంటే తెల్లబోయి శ్రీపతి, "ఏమిటది బావా ?" అన్నాడు.

"చూస్తావుగా ?" అని, పదిహేను రూపాయిలు మేనేజర్ చేతిలోపెట్టి, నాగరాజుకేసి తిరిగి, "పద", అన్నాడు.

"ఎక్కడికి సార్?" అన్నాడు నాగరాజు.

"నా ఇంటికే..."

"మా మామ తంతాడు సార్."

"నే నున్నానుగా ... భయంలేదులే ..."

ఆ మాటలు అమృతంగా పనిచేశాయి ... నాగరాజు కళ్లు తుడుచుకుని బయలుదేరాడు.

గుమ్మం దాటాక, శ్రీపతి "ఎక్కడికి తీసికెళ్తావ్?" అన్నాడు మహాశ్చర్యంతో.

"ఇంటికి."

"ఏడు గుమ్మం ఎక్కితే నాన్న వప్పుకోరు."

"నాకు తెల్సును."

వెంకట్రావు ఇంటికి వెళ్లకుండా, రైలుస్టేషన్‌కి దారి తీశాడు ... శ్రీపతి మాటలు నిష్ఫలమయ్యాయి.

"నువ్వు చేస్తున్న పని ఎంత ప్రమాదిస్తుందో తెలుసా?" అన్నాడు చివరికి శ్రీపతి.

"ఇందులో తప్పేమీ ఉన్నదని నా ఉద్దేశంకాదు. నా దృష్టికి ముఖ్యమైనవి వాడికి వచ్చిన సంగీతమూ, వాడు పొందుతూన్న కష్టాలూను. ఏదో తినడానికి భగవంతుడిచ్చాడు. సాధ్యమైనంతవరకూ ఏడిని పండితుడిని చెయ్యడానికి నాశక్తి వినియోగిస్తాను... మీ కందరికీ వాడిమీద

కోపం కావచ్చు. కాని నా అంతరంగాన్ని చంపి నేను వాడికి ద్రోహం చేయలేను.”

“కాని—ప్రభ ఏమంటుందో ఆలోచించావా? నాన్నకి నీ విషయంలో ఉన్న ఉద్దేశం మారవచ్చుకూడా.”

“నీ ఉద్దేశం నాకు తెలుసు...ప్రభ విశాలభావాలనీ, అవసరమైన జాలినీ, దయాధర్మాలనీ పరిత్యజించదలచు కొంటే నన్నూ పరిత్యజిస్తుంది. చదువుకుంది...తన భావాలు తన కున్నాయి—ఏమైనా, నేను విషయమంతా రాస్తానే ఆమెకి...ట్రైమైంది...వస్తాను. బట్టలకీ, సూట్ కేస్ కీ మనిషిని పంపుతా.”

ఈ మాటలు అనేసి, వెంకటరావు నాగరాజు భుజం మీద చెయ్యివేసి రైలుస్టేషన్ దగ్గరికి దారితీశాడు. రైలు అప్పటికే ప్లాట్ఫారమ్మీద ఉంది. తొందరగా రెండు టిక్కెట్లుతీసి వెంకటరావు రైలెక్కాడు—తన కొత్త బను వుతో సహా.

గుమ్మందగ్గర నిలబడి నాగరాజు ఊరుకేసి చూస్తూ న్నాడు...వెంకటరావు వాడిని వెనుకనించి పరిశీలిస్తున్నాడు. రైలుస్టేషన్ దాటి, ఊరుని దృక్పథం దాటించాక నాగరాజు వెనుదిరిగి, వెంకటరావు ప్రక్కన కూర్చున్నాడు.

కొంచెంసేపు ఎవరూ మాటలాడలేదు. బహుశా ఆనాటి అనుకోని సంఘటనలని గురించి ఇద్దరూ ఇంకా ఆశ్చర్యంతో ఆలోచిస్తున్నారు.

ఇంతట్లో నాగరాజు ఒక్కసారి వెంకటరావువైపు తిరిగి, "నామూలంగా మీరు వారితో దెబ్బలాడారు — ఏదో నా బ్రతుకు బ్రతకలేనని తొందరపడి", అన్నాడు.

వాడి సంభాషణలో నాగరికతని చూసి వెంకటరావు మొదట కొంచెం ఆశ్చర్యపడ్డాడు ... "లేదులే. అసలు సంగతేమిటంటే, నిన్నరాత్రి నీ మురళీవాద్యం విన్నాక నువ్వంటే నాకు చాలా అభిమానం ఏర్పడింది—నీ పరిస్థితులలో నువ్వు చాలా అభివృద్ధిపొందడం అసంభవం; కనక నా మానవత్వం నన్ను ప్రేరేపించి, నిన్ను నాతో తీసుకుపోతున్నాను. నాకూ తమ్ముళ్లెవరూ లేరులే", అన్నాడు.

ఆ చివరిమాటలు నాగరాజు మనస్సులో వారిద్దరికీ ఉన్న దూరాన్ని చాలా తగ్గించాయి. నాగరాజు ఒక్కసారి అతనివైపు చూశాడు.

వాళ్ళు తమ గమ్యస్థానం చేరేసరికి, తాము వివిధ కుటుంబీకులమనే విషయాన్ని మఱచిపోయారు.

♦ ♦ ♦ ♦

అక్కడినించీ నాగరాజంటే వెంకట్రావుకి అభిమానం దినదినమూ అభివృద్ధిపొందుతోంది. మొదట ఊళ్ళోవున్న సంగీత విద్వాంసుడిచేత శాస్త్రసంగీతం చెప్పించాడు. స్వరజితులై, "శ్రీ గణనాథ – సిందూరవర్ణ" అని నాగరాజు మురళిమీద పాడుతోంటే అతను తనని తాను మరచి ఆనందించాడు. ఆ చిన్న పాటలలోనే అతని మురళి వెంకట్రావుకి ఏదో అపూర్వ సంగీతాన్ని అందించేది.

ఒకరోజు సాయంత్రం...అదే హాలులో కూర్చుని నాగరాజు ఏదో గీతం మాస్టరు చెప్పినది సాధకం చేస్తున్నాడు. అప్పటికి వాడు హోటల్ వదిలిపెట్టి రెండు మాసా లవలేదు పూర్తిగా.

అప్పుడే పోస్ట్‌మాన్ ఉత్తరాలు తెచ్చి పడవేశాడు... ఒక దస్తూరీ అతను త్వరగా గుర్తుపట్టాడు ప్రభదని. చించి చదివాడు.

"బావా!

ఈరెండు నెలలూ నువ్వు ఉత్తరం రాస్తావని నమ్ముకుని కూర్చున్నాను. కాని, అంతటి అదృష్టం కలగలేదు. అందుకని, నేనే ఈ నాడు నీకు రాస్తున్నాను.

అన్నయ్య అంతా చెప్పాడు. నాడు తొందరపడి ఏదో అంటేమాత్రం, అంతమాత్రానికే ఒక్కసారి కనపడకుండా ఇంటికి వెళ్ళిపోవాలా? నాన్న ఎంత బాధపడ్డారంటావు? నాకేడుపు వచ్చింది బావా నిర్దయతో నువ్వు చేసినపనికి.

నువ్వంత తొందరపడతావని నే నెన్నడూ అనుకోలేదు. నాగరాజంటే నీకు అవ్యాజంగా అభిమానం కలిగి ఉండవచ్చు. కాని, నాకన్నా నీకు వాడెక్కువా? ఒక సత్యాన్ని నీముందు వెలిపుచ్చుతున్నాను. వాడి పాట అంటే నా కెంత ఇష్టమో, వాడిపరిస్థితులంటే అంత జాలి...కాని, నాన్న కా విషయం తెలిస్తే బ్రతక నిస్తారా? అందుకని,

ఎక్కడా నేను నిజం బయటపెట్టలేదు—చివరికి, నేటిదాకా నీదగ్గరకూడా...

నిన్న ఎవరితోనో నా పెళ్లిగురించి మాటలాడుతున్నారు నాన్నగారు. హడిలి పోయాను. నిన్ను ప్రాణంగా చూసుకున్నాను కాదూ బావా? ఇలాగ నాగతికి నన్ను వదిలి, వాడిని పట్టుకుంటావా ?

దయవుంచి, వాడిదారిన వాడిని పోనీ ... నువ్వు ఆయకువి కాబట్టి కాని, వాడిమీద నిన్ను కోర్టుకెక్కిద్దామనుకున్నాడు. పరిస్థితులన్నీ నా పీకచుట్టూ బిగుసుకుంటున్నాయి. ఏం చేసినా నువ్వే బావా.

నీ

ప్రభ

రెండుసార్లు నాలుగుసార్లు చదివాడు వెంకట్రావు ఆ ఉత్తరాన్ని. ఏం చెయ్యడం ?

ఆ సాయంసమయపు నిశ్శబ్ద పరిసరాలలో వాడి పాట వినిపిస్తూంది. ఏమిటి చెయ్యడం ? వాడిని అధోగతికి వదలడమా ? ఎలాగో బ్రతుకుతూన్నవాడిని ఏమో ఉపకారం చేస్తానని తీసుకొచ్చి వాడి జీవితాన్ని ఇంకా అధమం చెయ్యడమా ?

కాని, ప్రభ ? ఈ పరిస్థితుల్లో తమ ఇద్దరి వివాహమూ అసాధ్యమే అయింది. పరిస్థితిని గమనించి ప్రభ

తనకి రాస్తుందని అతనికి తెలుసును. అందుకే అతనన్నట్లుగా తను ముందు ప్రభకి ఉత్తరం వ్రాయలేకపోయాడు.

ప్రభ అంటే వెంకట్రావు ప్రాణం ఇయడానికి సిద్ధంగా ఉండేవాడు—ప్రభకూడా అంతే. ప్రభ చదువుకున్న పిల్ల ... స్వతంత్ర భావాలు కలది. ఈ ఉత్తరంలో ఆమె ఎన్నడూ లేనంత క్రిందికి దిగింది—దానినిబట్టే తెలుస్తోంది, వాస్తవంగా ఆమె మనస్సు ఏ పరిస్థితుల్లో ఉందో.

అటు ఇటూ ఊగులాడి ఆడి చివరికి ఏ నిర్ణయానికీ రాలేకపోయాడు వెంకట్రావు. అప్పటికి సాధకం ముగించాడు నాగరాజు; సంధ్యాదేవి తన ఛాయలని అలముజేస్తోంది.

లేచి వసారాలోంచి హాలులోనికి వస్తూ, "ఎందుకండీ అలాగ ఉన్నారు?" అన్నాడు నాగరాజు.

ఈ "అండీ" కట్టించడానికి వెంకట్రావు చాలా ప్రయత్నించాడు. ఈ పరిస్థితిలో అతని కా విషయం మళ్లీ చెప్పడానికి మనస్కరించలేదు.

"ఏమీ లేదులే—నీ సాధకం వింటున్నాను. ఏదో ఆలోచనలో పడ్డాను. ఇందాకటినుంచీ నువ్వు పాడిన గీతం—ఏ రాగం"

"అదా? ఖరహర ప్రియ అండీ ... చాలా చక్కటి గేయం కాదూ? చూడండి—రాగం ఆలాపిస్తాను."

మురళీస్వరం పరిసరాలని నింపివేసింది. చంద్రుడు ఉదయించాడు. ఇంట్లో దీపం పెట్టారు...వాళ్లిద్దరూ గానంలో

తన్మయులౌతూనే ఉన్నారు. ఇంతటిలో సంగీతం మాస్టరు వచ్చినసంగతి తెలుసుకుని ఇద్దరూ బాహ్యప్రపంచంలో పడ్డారు.

"ఎంతసేపైందండీ వచ్చి?" అన్నాడు వెంకటరావు —ఆయనని కొంతసేపు నిలువబెట్టినందుకు చింతిస్తూ.

"ఒక పావుగంట అయిందిలెండి...అయితేనేం? ఆ రాగాలాపన వింటూంటే గంటలు నిలువబడొచ్చును కదండీ?—లోనికి వెళ్ళి పనిచూడు నాగరాజూ ..."

నాగరాజు లోపలికి వెళ్లాడు.

"అతనిముందు చెప్పాల్సిన విషయం కాదిది...ఇతనికి సరస్వతీ ప్రసన్నత పూర్తిగా ఉంది బాబూ...ఆ రాగాలాపన చూస్తూంటే మహావిద్వాంసులని జ్ఞప్తికి తెస్తున్నాడనుకోండి – ఇంతా చేస్తే ఏమిటి చెప్పాను కనుక? గీతం చెప్పాను. ఆరోహణం, అవరోహణక్రమాలూ, లక్షణాలూను...అంతే."

వెంకట్రావు తన్మయుడై వింటున్నాడు. మాస్టరు చెప్పుకుపోతున్నాడు.

"నా విద్యఅంతా ఇంక మూడునెలలు. వర్ణాలూ కృతులూ నాకు వచ్చినవన్నీ చెప్పేస్తాను ... నామాటవిని, మా గురువుగారిదగ్గరికి పంపండి— వారి వెనకాల తిరిగితే అద్భుతమైన పాండిత్యం సంపాదిస్తాడు. మీ జీవితమూ ధన్యం ఐపోతుంది...సరస్వతీస్వరూపాన్ని పైకి తీసేరండీ."

తరువాత తనపని చూసుకుని ఆయన వెళ్ళిపోయాడు. వెంకట్రావు ఒక నిశ్చయానికి రాగలిగేడు - ఏది ఎలాగ పోయినా, నాగరాజులోని విద్యాపటిమని చూసితీరాలని.

ఆ మర్నాడు తను ప్రభకి ఉత్తరం వ్రాశాడు.

ప్రభా!

నీ ఉత్తరం అందింది...ఈ నాటకంలో నీ పాత్రని సరిగా అర్థం చేసుకోలేక పోయాను. ఆ ఉత్తరం అందాక నా అజ్ఞానం ఇంకా ఎక్కువే అయింది.

అయితే, ఒకటి బాగా తెల్సును మన ఇద్దరికీ— నాగరాజు నా రక్షణలో ఉండగా మన వివాహానికి మీ నాన్నగారి అంగీకృతి ఉండదని. మీ అన్నకికూడా ఆదృష్టే ఉంది.

కాని, నాగరాజుని ఈ పరిస్థితిలో త్యజించడం నా వల్లకాని పని ప్రభా...వాడిలో అమృతం ఉంది. వాడిని మథించి ఆ అమృతాన్ని వెలిదీసే బాధ్యత నామీద వేశాడు భగవంతుడు. వాడిని నమ్మించి ద్రోహంచేసే పాపం నన్ను వడిగట్టుకోమంటావా?

నీకూ స్వతంత్రభావా లున్నాయ్. చదువుకొన్న దానివి. నా హృదయం ఇచ్చి నిన్ను ప్రేమించాననే సంగతి నీకు తెల్సును. కాని, విధి బలీయం అయినప్పుడు తల ఒగ్గకుండా కుదుకుతుందా?

ఇలాగ రాశానని నన్ను క్షమించు ప్రభా. మన కతీతమైన విపరీతశక్తులకి మనం లొంగిపోవలసివచ్చింది.

కాని, మనకి సాధ్యమైనంతవరకూ ఆ పరిస్థితులని ఎదిరిద్దాం...

నీ మనస్సుకి నొప్పి కలిగించాను. ప్రభా, క్షమించు. కాని కర్తవ్యం అటులాగుతోంది.

సీ,

వెంకట్రావు.

తరువాత రెండు నెలలదాకా ప్రభ ఏమీ ఉత్తరం రాయలేదు.

♦ ♦ ♦ ♦

నాగరాజు తన జీవితంలో కలిగిన అద్భుతమైన ఈ మార్పుకి కొంచెం కొంచెంగా అలవాటుపడ్డాక, క్రమ క్రమంగా సంగీత శిక్షణలో నిమగ్నుడవసాగాడు. ఎవరికైనా అనురక్తి ఉన్న విద్యని నేర్చుకోవడం చాలా సులువు; అదే జీవితపరమావధిగా ఉంచుకున్నవాళ్ళమాట చెప్పనే అక్కరలేదు.

నాగరాజు సాధకం చూస్తూంటే అతని జీవిత పరమావధి సులభంగా అర్థం అయిపోయేది. రాగలక్షణాలు చెప్పేసరికి అతను ఆలాపనలో అద్భుతమైన తన సహజపాండిత్యాన్ని చూపగలిగేవాడు. సామాన్యంగా సంగీతం నేర్చుకునేవాళ్లు చుట్టుప్రక్కల వాళ్ళకి బాధాకరంగా ఉంటారు.

కాని నాగరాజుగానం ఆ ప్రారంభ పరిస్థితుల్లోకూడా మనో రంజకంగానే ఉండేది. వెంకట్రావుకి అది ప్రాణంగానే ఉండేది.

స్వతస్సిద్ధంగా కర్ణాటక సంగీతం అంటే వెంకట్రావుకి ప్రాణం. త్యాగరాజూ, దీక్షితార్‌లూ అతనికి అపరదైవాలు. పధ్నాలుగేళ్ళ ఈ బాలుడు త్యాగరాజకీర్తనలని మురళీ మీద వాయిస్తోంటే అతనికి కళ్ళముందు దేవతలు నాట్యం చేసినట్లనిపించేది. ఒడలు పులకరించేది.

ఒక సంవత్సరం గడిచేసరికి ఆ వూరిలో నాగరాజు నేర్చుకునే విద్యనంతటినీ నేర్చుకున్నాడు. ఇంక ఏమిటి చెయ్యడమా అని ఆలోచనలోపడ్డాడు వెంకట్రావు. సంతోషంగా నాగరాజుని చేరతీసి విద్య నేర్పేవాళ్ళు చాలామంది పెద్దవాళ్లు ఉన్నారు. నాగరాజు తిండికీ, బట్టకీ ఇచ్చే తాహతు తనకీఉంది. కాని, నాగరాజుని వదలి ఉండడమే ఒక సమస్య అయింది వెంకట్రావుకి. ఏదో పూర్వబంధాలు వెంకట్రావుని నాగరాజుకి దగ్గరగా చేర్చాయి. చెప్పలేని బలంగల అనురాగం వాళ్ళిద్దరిమధ్యా ఉండేది.

ఒకనాడు రాత్రి...ఒంటిగంట అయింది—వెంకట్రావుకి మెలకువ వచ్చింది...కారణం అతనికి ప్రభ కలలోకి వచ్చి ఏడుస్తూ ఏదో అంటూన్నట్లు—త్రుళ్ళిపడి లేచాడు.

వెన్నెల నిండుగా కాస్తోంది. అతను లేచి చెట్టుక్రింద కుర్చీలో కూర్చున్నాడు. అతనితోనే తన దుఃఖాన్ని ప్రభ చెప్పుకునేలాగ అతను బాధపడుతున్నాడు.

ఈ సంవత్సరకాలంలో ప్రభ రాసిన ఉత్తరాలు ఒక్కసారి జ్ఞప్తికి వచ్చాయతనికి. అన్నిటిలోనూ సుమారుగా ఒకటే విషయం—ఏలాగైనా నాగరాజున్ని వదలిపెట్టి రమ్మని...

వెన్నెల చాలా బాధాకరంగా ఉంది. అతని మనస్సు వివిధ భావనలకి ఆలం అవుతూంది. ఈ నాగరాజు తన జీవితంలోకి ఎందుకు రావాలి? ప్రభతండ్రికీ వీడికీ అంతటి వైరం ఎందుకు ఉండాలి? ప్రభ తండ్రి నెందుకు ఎదిరించదు?

అకస్మాత్తుగా అతనికి ఒకో ఆలోచన కలిగింది... నాగరాజుని మళ్లా వాడి ఇంటికి పంపేసి, ప్రభని వివాహం చేసుకుని, నిర్విచారంగా జీవితం గడిపితే?

ప్రభ! పాపం, తనకోసం ఎంత బాధపడుతోంది! ఆమె కోరినదంతా స్వార్థం కానేకాదు. తీయటి కలలు కని కని, ఈనాడు తన తొందరపాటువల్ల ఆమె బాధపడుతూంది?

"నిన్ను వివాహం చేసుకుంటాను ప్రభా! అందుకే వచ్చాను", అని తాను చెప్పగలిగితే, పాపం ఆమె ఎంతగా సంతోషిస్తుంది?

నాగరాజుని తానొక మార్గంలో పెట్టాడు. ఇంక వాడెలాగో జీవితపథంలో తన బాధ తాను పడాలికాని, తనెంతదాకా సహాయం చెయ్యగలడు? ఆ సహాయంకూడా తనకోసం ప్రభని బాధపెట్టి!...

ఈ ఆలోచనతో, ఆ మాటలు చెప్పడానికి వెంకట్రావు నాగరాజు గదిదాకా వెళ్లాడు. ఆ గదిలోనూ కిటికీలోంచి వెన్నెలపడుతూ, నాగరాజుముఖాన్ని ప్రకాశవంతం చేస్తుంది.

వెంకట్రావు గుమ్మందాకావెళ్ళి అక్కడ నిలబడ్డాడు.

ఒక్కసారి అతని నరాలు ఎవళ్ళో లాగినట్లైంది. తనని నమ్ముకుని వాడెంత నిర్విచారంగా నిద్రిస్తున్నాడు! ఒక్కసారిగా లేపి, "మనస్నేహం ఇంక సరి నాగరాజూ, తెల్లవారేసరికి మీవూరు వెళ్ళిపో", అంటే వాడెంతగా ఆశ్చర్యపడి బాధపడతాడు? "నేనేం చేశానండీ?" అంటే తానేమిటి జవాబు జెప్తాడు? —పాపం నాగరాజు!

వెంకట్రావు చాలా సిగ్గుపడ్డాడు...తొందరగా వెనుదిరిగాడు.

మిగిలినరాత్రి అతను జాగరం చేశాడు.

♦ ♦ ♦ ♦

ఆ మర్నాడు వెంకట్రావు బేంక్‌లో ఉన్న నూరు రూపాయలూ తీసుకున్నాడు. బట్టలకొట్టుకి వెళ్ళి నాగరాజుకి మంచి బట్టలు తీయించాడు. కొత్తది సూట్‌కేసూ, బెడ్డూ కొన్నాడు.

అత్తవారింటికి పంపినంత హంగామా చేసి, నాగరాజుని మద్రాసు ప్రయాణానికి సిద్ధపరిచాడు. అక్కడే వాడి కొత్త గురువుగారు ఉన్నారు.

ప్రత్యేకం ప్రయాణముహూర్తం పెట్టించి, సంగీతం మాస్టరునీ నాగరాజునీ మెయిల్ ఎక్కించి బరువుగుండెలతో

తిరిగి వచ్చాడు వెంకట్రావు. అవును—అవతల వాళ్ళ మంచికోసంకూడ మన అభిమానాలని మరవాల్సి ఉంటూం టుంది కొన్ని సమయాలలో.

♦ ♦ ♦ ♦

ఒక సంవత్సరం గడచిపోయింది—ఆ తరవాత.

ఆ సంవత్సరము నాగరాజులో చాలా మార్పులని తీసుకువచ్చింది. మొట్టమొదటిసారి నాగరాజు కచేరీలో తన విద్యా ప్రదర్శనంచేసి, గురువుగారితోసహా అందరి మెప్పునీ అందుకున్నాడు. ఆవార్త దినపత్రికలలోకూడా ప్రచురింప బడింది. తన జీవితంలో ఒక ఘనకార్యం సాధించినట్లు గర్వ పడ్డాడు వెంకటరావానాడు. నాలుగురోజులు పోయాక నాగరాజు వెంకట్రావుకి ఉత్తరం రాశాడు.

"(శ్రీ) అన్నగారికి!

మీదయతో నేను సాధించిన విజయాన్నిగురించి మీరు తెలుసుకునే ఉంటారు. ఈ సమయములో నా కృతజ్ఞ తని తెలుపుకుంటున్నాను. ఇప్పుడు నాకు చాలా ఆహ్వానాలు వస్తున్నాయి—ముఖ్యంగా రెండు స్టూడియోలనించి నా కచేరీకోసం ఆహ్వానాలు వచ్చాయి. త్వరలో ఏర్పాటు చేయించడానికి అంగీకరించాను. ఈ ఆహ్వానాలని నా అదృష్టంగా పరిగణిస్తున్నాను.

క్షేమంగా ఉన్నాను. విశేషాలు లేవు.

చిత్తగించవలెను,

నాగరాజు.

స్టూడియోలకి నాగరాజు వెళ్తూన్న సంగతి వెంకట్రావుకి చాలా కష్టాన్ని కలుగజేసింది. కేవలం వ్యాపార దృష్టితో పనిచేసే చోటులలో శాస్త్రీయసంగీతానికి స్థానం లేదని అతని విశ్వాసం.

నాగరాజు స్టూడియోలపట్ల ఎక్కువ ఆత్రుతచూపడం వెంకట్రావుకి కష్టం కలుగజేసింది. అతను నాగరాజుద్వారా సంగీతానికి సేవచేద్దామనుకున్నాడు. కాని ఆ సంగీతం చవక సంగీతంకాదు. ఏశాస్త్రం నేర్చుకోవడానికీ, సాధన చెయ్యడానికీ చాలా కష్టమో, అలాటి కర్ణాటకసంగీతమే అతనికి ఆరాధ్యం. నాగరాజు ఉద్దేశాలతనికి పన్నీటిని బూడిదలో పోసే ప్రయత్నాలలాగ కనిపించాయి.

తన ఉద్దేశాలను నాగరాజుకి రాద్దామనుకున్నాడు. కాని, నాగరాజు బాధపడతాడనే ఉద్దేశం అతనిచేత వెనక్కి లాగించింది. కాని, నాగరాజు తప్పుదారిని పడిపోతున్నాడనే బాధ ఎక్కువై, నాలుగురోజులు పోయాక అతనికి వెంకట్రా విలాగ వ్రాశాడు:

చిరంజీవి, నాగరాజుకి!

ఆశీర్వచనాలు.

నీ గానమాధుర్యంతో చాలామందిని సంతసింపజేస్తున్నావని తెలుసుకుని చాలా సంతోషించాను. నీ అభ్యుదయం కాంక్షించేవారిలో ప్రథముడినని నీకు రాయ. నక్కరలేదనుకుంటాను.

అందుచేతనే, ఈ సమయంలో నీకు కొంచెం చెప్ప దలచుకున్నాను.

భగవంతుడిచ్చిన పాండిత్యంతో నువ్వు స్వయంకృషి చేసి, చాలా విద్యని ఆర్జించావు. కర్ణాటక సంగీతంలో శిధివనే బిరుదు పొందబోతున్నావు.

కాని, కేవలం వ్యాపారంకోసం నువ్వు ఈ విద్య నభ్యసించలేదని మరచిపోకు. ఈ సంగీతశాస్త్రాన్ని నిష్క ల్మషంగా నేర్చుకుని, వ్యాపింపచెయ్యవలసిన బాధ్యత నీమీద ఉందని మరచిపోకు.

సినిమావాళ్ళు నిన్ను ఆహ్వానించారంటే ఎందుకో తెల్సునుకుంటాను. నీ విద్యని వికృతరూపాలతో ప్రజల కందించి డబ్బు చేసుకోడానికి నిన్ను వాళ్ళు కొనుక్కుం టారు, అప్పుడు నువ్వు త్యాగరాజునిగాని, దీక్షితార్‌నికాని, ముత్తుస్వామిని కాని, నీ గురువుగార్ని గాని, జ్ఞాపకం ఉంచు కోవడమే కష్టం అవుతుంది — ఒక్క మాటలో చెప్పాలంటే శాస్త్రీయ సంగీతానికే అపచారం చేయవలసి వస్తుంది.

స్టూడియోలకి వెళ్లి కచేరీ లిచ్చేముందు నువ్వీమాటలు మనస్సులో ఉంచుకుంటే ఈ ప్రమాదం ఉండదని ఆలోచించి ఈ మాటలు నీకు రాస్తున్నాను. గ్రహించు.

వెంకటరావు.

ఈ ఉత్తరం తరవాత పదిరోజులకిగాని జవాబు లేదు. అప్పుడు నాగరాజు జవాబు ఇలాగ ఉంది :

శ్రీ అన్నగారికి,

ఈ పదిరోజులూ పనితొందరలో మీకు జవాబు వ్రాయలేకపోయాను. మీ ఉత్తరం చేరేక నా జీవితంలో నేను ఆశించని రెండు గొప్ప అదృష్టాలు కలిగాయి. ఆరెండు స్టూడియోలవారూ నన్ను సంగీతశాఖలో ఉంచుకుంటామని కోరారు. ఇప్పుడు నెలకి అయిదు వందలు ఇస్తా నన్న ఒక స్టూడియోలో చేరాను.

మీరు సినిమాసంగీతాన్ని గురించి వెల్లడించిన ఉద్దేశాలు ఇప్పుడు పరిశ్రమకి అనువర్తించవు. నావిద్యకి వాళ్ళు వన్నెలు దిద్దుతారు. దేశం అంతటా పేరు తెప్పించడానికే ప్రయత్నిస్తారు.

ఈ రోజునే అడ్వాన్సు పుచ్చుకున్నాను. మీ రింకొకలాగ భావించరని నాకు తెల్సును.

మీరింక డబ్బు పంపకండి.

చిత్తగించవలెను,
నాగరాజు.

♦ ♦ ♦ ♦

హాలులో నిశ్శబ్దంగా కూర్చున్న ఒకే ఒకజీవి—వెంకట్రావు గడియారం చేసే శబ్దాన్ని గమనించకుండా ఒక్క—

సారిగా ఈ రెండు సంవత్సరాల చరిత్రనీ నెమరు వేసుకున్నాడు.

ఎదురుగా నాగరాజు రాసిన ఈ చిట్టచివరి ఉత్తరం బల్లమీద పేపర్ వెయిట్ క్రిందనుంచి తొంగిచూస్తూంది.

వెంకట్రావుకి ఈ ఉత్తరం చాలా బాధని కలిగించింది. నాగరాజింత తొందరపడతాడని అత నెన్నడూ అనుకోలేదు. అధమం తన అనుమతినైనా అడుగుతాడనుకున్నాడు.

ఈ సంవత్సరమూ తా నెంత త్యాగం చేశాడు! బేటరీ కొనక రేడియో అలాగే పడుకుంది. గుమాస్తాని మానిపించాడు. కొత్తగా బట్టలుకూడా కుట్టించుకోకుండా ధనం మిగిల్చి నాగరాజుకి పంపాడు — ఆ చిన్న వూరులో ప్రాక్టీసుమీద ఏమాత్రం వస్తుంది కనక? మిగిలినదానిలో అతను కష్టంగా సర్దుకుని కాలక్షేపం చేస్తున్నాడు.

ప్రభ — పాపం, ఈ సంవత్సరంనించీ అస్వస్థతతోనే ఉంది, కారణం సువిదితమేను. ఎలాగైనా ఒక్కసారి వచ్చి చూసి వెళ్ళమంది — అదే తన హృదయానికి శాంతిని ఇస్తుందని ... కాని —

కాలం గడిచిపోతోంది.

ఇంతలో ఎవరో వచ్చారు "బాబూ!" అని పిల్చారు.

ఎవరో పార్టీలు — మునునాడు ఏదో కేసు విశాఖపట్నం వాయిదా పడిందని జ్ఞాపకం చెయ్యడానికి వచ్చాడు.

ఉదయం బయలుదేరుతానని చెప్పి పంపా డతన్ని వెంకటరావు.

తెల్లవారింది. కాలకృత్యాలు తీర్చుకొని, బట్టలు వేసుకుని ప్రయాణానికి సిద్ధం అయాడు.

"కేంపు వెళ్తున్నానమ్మా—విశాఖపట్నం. రేపు తిరిగివస్తాను."

"ప్రభని చూసివస్తావా?"

కొంచెం ఆగాడు వెంకటరావు.

"అదేమిటిరా అలా చూస్తావు? పాపం ఎలాగ ఉందో ... ఉత్తరంకూడా రాసిందంటున్నావు రమ్మని ... అంత ఉదాసీనత ఏమిటి? వెళ్ళిచూచిరా నాయినా, ఏమైనా దూరందికనకనా?"

"అలాగేనమ్మా."

నెమ్మదిగా స్టేషన్‌కి బయలుదేరాడు. దారిలో దినపత్రిక ఒకటి కొనుక్కున్నాడు.

ఒకటో పేజీలో రంగురంగుల ప్రకటనలో పెద్ద అక్షరాలలో రాసి ఉన్నది.

"సినీ సంగీతానికి క్రొత్తశకం ఆరంభం...

మా నూతన చిత్రానికి సంగీత దర్శకులు శ్రీ నాగరాజు భాగవతార్." ఇంకా ఏమో...

వెంకట్రావు పత్రికని మడిచి తొందరగా నడిచాడు.

ఆ రోజంతా అతను చాలా అన్యాసక్తుడుగా ఉన్నాడు. జీవితం అంటే ఏదో దుఃఖపూరితమైన యాత్రలాగున కని పిస్తూంది అతనికి. కృతజ్ఞతారాహిత్యమూ, వ్యాపారమూ మాత్రమే దానిలోని ముఖ్యవిషయాలలాగ అనిపిస్తూందతనికి.

నాగరాజుని చేరదీసినందుకు మొట్టమొదటిసారిగా అతను ఈ రోజు విచారిస్తున్నాడు.

రైలు దిగేసరికి చాలా వ్యవధిలేదు. హోటల్లో భోజనం చేసి కోర్టుకి వెళ్లాడు. నాలుగయ్యేసరికి హోటల్లో గదికి తిరిగి వచ్చాడు.

ప్రభ అతని జ్ఞప్తులని బాధిస్తూంది. పాపం, చాలా నీరసించి ఉంటుంది. ఆమెని తొందరగా చూడాలని ఒక్కసా రతనికి బలమైన వాంఛ కలిగింది. ఏనాడో వాళ్లిద్దరిమధ్యా గడిచిన మధుర క్షణాలన్నీ మళ్లీ అతనికి జ్ఞప్తివచ్చి అతనిని ప్రియాసందర్శనంకోసం తొందర పెడుతున్నాయి.

ఇన్నాళ్లూ నాగరాజుకోసం తానుచేసిన ఈ త్యాగాని కీరోజుతో సంపూర్తి......

ఆలోచిస్తూ బట్టలు వేసుకుని రోడ్డు పట్టాడు. నాగ రాజు పూర్వాశ్రమంలో పనిచేస్తోన్న హోటల్ కనిపించింది. అందులోకి వెళ్లి కాఫీ తాగాలనే వాంఛ అతనికి కలిగింది. ఆ అనుభవం ఎలాగ ఉంటుందో?

ఆలోచిస్తూనే లోనికి నడిచాడు.

సర్వర్ వచ్చి—"ఏం కావాలి సార్?" అన్నాడు.

"స్ట్రాంగ్ కాఫీ."

సర్వర్ వెళ్ళాడు. మేనేజర్ వెంకటరావుని గుర్తించాడు. తొందరగా వచ్చి పక్కన కూర్చుని "నమస్కారం సార్", అన్నాడు.

వెంకట్రావు అతని జ్ఞాపకశక్తికి కొంచెం ఆశ్చర్యపడి, "వ్యాపారం బాగా సాగుతోందా?" అన్నాడు.

"దేవుడి దయ సార్...మీరు నాడు ఏమి మంచిపని చేస్తిరి సార్! మొన్నరోజు నాగరాజు భాగవతర్ పాట రేడియోలో వింటిని—ఎంతదా పాండిత్యం సార్!"

"అవును."

కాఫీ వచ్చింది. వెంకట్రావు దాన్ని తీసుకోబోతుంటే అయ్యరు వారించి సర్వర్ని కేకవేసి, "స్పెషల్ కాఫీ ఈయరా", అన్నాడు. మళ్లా వెంకటరావువైపు తిరిగి "ఈ కీర్తి అంతా మీదిదాసార్. సంగీతశాస్త్రానికీ ఉపకారం చేస్తిరి.చాలా సంతోషించేస్తిని. అతను నాహోటల్ సర్వర్ అనిచెప్పేదానికి విచారం చెయ్యాలో, సంతసం అవాలో తెలియదు సార్."

వెంకట్రావు కాఫీ ముగించేలోపున అయ్యరు అతన్ని చాలా పొగిడాడు. వెంకట్రావు బరువెక్కిన గుండెలతో హోటల్ వదిలి, ప్రభ ఇంటివేపు నడిచాడు.

ఇంకా ఎండ పూర్తిగా తగ్గకపోయినా ప్రభ పెంచుకున్న తోటలో చల్లగానే ఉంది. వెంకటరావు తలుపు తోసి లోనికి వెళ్ళేసరికి, ఈజీఛేయిర్‌లో కూర్చుని ప్రభ ఏదో చదువుకుంటూంది. వెంకట్రావుని చూడగానే ఆనందంతో ఒక్క కేక వేసి పుస్తకం నేలమీద పడవేసి, అతనికి స్వాగతం ఇచ్చింది.

అతికష్టంమీద వెంకటరావు మాటలాడ గలిగాడు. ఏదో మహానేరం చేసినట్లు అతను Feel అవుతున్నాడు.

"ఆరోగ్యం చాలా పాడయింది ప్రభా."

"ఏం చేసేది ? ... పోనీ నీ కిప్పటికైనా దయ వచ్చిందా?"

"రోజులు బాగులేకపోతే అన్నీ అలాగ వస్తాయి ప్రభా — మీ నాన్నకి నామీద కోపం తగ్గితే..."

"ఆయనకి నీమీద కోపం ఎందుకు బావా ? వాడిని నువ్వు వదిలేస్తే అదేచాలు. వాడినీ చాలా పెద్దవాడిగానే చేశావుగా ?"

వెంకటరావు గుండె ఝల్లుమన్నది. అతను మాట్లాడ లేదు.

"లోపలికి వెళ్దామా బావా?" ప్రభ ఆత్రుతగా అన్నది.

ఆమె నీరసంగా లేచింది. చేతిమీద ఆనించుకుని వెంకటరావు ఆమెని లోనికి తీసుకొని వెళ్లేడు.

"ఎప్పుడు వచ్చావు బావా?" అన్నాడు.

శ్రీపతి ... అతని ముఖంలో సిగ్గు తాండవిస్తూన్నది. జవాబివ్వడానికి వెంకటరావుకీ సిగ్గుగానే ఉంది.

"ఇప్పుడే."

"వాడిని చాలా గొప్పవాడిని చేశావే?"

"నేను చేసినదేముంది? వాడే అయాడు."

శ్రీపతి ఇంకేమీ వ్యాఖ్యానించలేదు.

కాని అన్నిటికన్నా పెద్ద Shock వెంకట్రావుకి ఆ రాత్రికి మిగిలింది. రాత్రి భోజనాలయ్యాక మాట లాడుతూ ... "నాగరాజుని వాళ్ళ మామావాళ్ళూ చూచి వచ్చారు తెలుసా?" అన్నది.

అతను తెల్లబోయాడు.

"వాళ్లకి చాలా డబ్బూ అదీ ఇచ్చాడటకూడా. ఏమైనా వాళ్ళూ వాళ్ళూ ఒకటేగా?"

"పోనీ—వాడిమాట ఇంక చెప్పకు ప్రభా."



వర్షం పడుతున్నది. కిటికీదగ్గర నిల్చుని ప్రభ తీవ్రంగా ఆలోచిస్తూంది.

ఆమె వివాహంఅయి నెలమాత్రం అయింది. వెంకటరావు ఇంటికి వచ్చింది.

ఆలోచిస్తూ ఆమె చేతిలోవున్న ఉత్తరంతీసి చదివిందింకొకసారి.

"శ్రీ అన్నగారికి,

నా కృతఘ్నతకి మీరు చాలా కోపగించుకుని ఉంటారు. మీ కీ కొద్దికాలం కలిగించిన మనోవ్యధికి చింతవ్యణ్ని.

మీరు వివాహం చేసుకున్న విషయం విని చాలా సంతోషించాను. ఇప్పుడు నా రహస్యం మీకు చెప్పేస్తాను.

మీరు నాకు చేసిన ఉపకృతి నా జన్మలో మరువ లేనిది. అలాటి మీకు కోపం తెప్పించడానికే ఇలాగ ప్రవర్తించాను. ప్రభావతిగారిని మీరు నా కోసం త్యాగం చేస్తున్నారని నాకు తెలిసి ఆ నష్టం మీ రనుభవించకుండా చేయడానికే ఈపని చేశాను. ఇంక నా కాలం మీ రెలాగ ఆదేశిస్తే అలాగే వినియోగిస్తాను.

దయవుంచి జవాబు వ్రాయమని ప్రార్థన.

నాగరాజు.

పెద్దగాలితో తుఫాను రేగుతూంది.

ప్రభ అగ్గిపెట్టితీసి ఉత్తరం అంటించింది. మరుక్షణం ఆ నుసి ప్రవహిస్తోన్న నీటిలో కలిసిపోయింది. ఒక్కసారి ఆమెకళ్లు మాత్రం ఆర్ద్రాలయాయి.

— ఆంధ్రపత్రిక, 4–6–52







## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA111B184 |
| పుస్తకం పేరు | వీటిమీద దీపాలు |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 319 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 71 TO 74 |
| తయారు చేసినది | pragathi |
| పేజీలు విడదీసినది | Soumya |
| స్కాన్ చేసినది | K Praveen |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | |